అపరాధ పరిశోధన అనుబంధం—59

# ఐదు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## అడుగడుగునా ఆటంకాలే!

రచన : 'సికిందర్'

## కాలభైరవ స్వామి!

రచన : శ్రీ రాజ్

## ఎదురుచూడని ప్రమాదం!

రచన : ఏ. వీ. మోహన్రావ్

## నర బలి?

రచన : వసుంధర

## ఇద్దరు దొంగలు

రచన : అజీజ్

అపరాధ పరిశోధన సప్లిమెంట్ — 59
నవంబర్, 1978
వెల : రు. 3-50
ఏడాది చందా 45 రూపాయలు
జీవితచందా 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్ :
శ్యామదామోదర్ రెడ్డి

సంపాదక వర్గం :
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. వీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం :
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-36959

ముద్రణ :
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# అడుగడుగునా ఆటంకాలే!

'సికిందర్'

రెండు చేతులమధ్య తల పెట్టుకుని కూచున్నాడు సావన్ కుమార్.

ఎదురుగా టేబిల్ పైన ఫైళ్ళూ, లెడ్జర్లూ కుప్పగా పడేసి వున్నాయి. వాటిని పరిశీలించే స్థితిలో లేడతను.

అందుక్కారణం అంతక్రితం అయిదుగురు ఆడవాళ్ళతో ఇంటర్వ్యూ చేయడంవలన వచ్చిన నీరసం. అతని మూడేళ్ళ అనుభవంలో ఇలాంటి ఇంటర్వ్యూ ఎన్నడూ నిర్వహించలేదు.

ఈ రోజు వుదయం అతను పదకొండు గంటలవరకు అయిదుగురు వయసు మళ్ళిన ఆడవాళ్ళని ఇంటర్వ్యూ చేశాడు — సెక్రటరీ కోసం క్రితంరోజు పత్రికలలో ప్రకటన ఇచ్చాడు.

ఇంటర్వ్యూకి వచ్చిన ఆ అయిదుగురూ వయ్యారం ఒలకబోస్తూ, కులుకుతూ, పెళ్ళి చూపులకి వచ్చినట్లు ముస్తాబై వచ్చారు. ఒక్కొక్కరి ముఖాలు చూస్తోంటే

సావన్ కుమార్‌కి అరికాలి మంట నెత్తికెక్కింది. ఫలితంగా ఇంటర్వ్యూలో ఒక్కరూ సెలక్టు కాలేదు.

సేఠ్ సోహన్‌లాల్ ఇద్దరి కుమారులలో సావన్ కుమార్ రెండవవాడు. వయసు ఇరవై అయిదు. మూడేళ్ళ క్రితం బి. కాం. పూర్తి చేశాక తండ్రి తన ఫైనాన్సింగ్ కంపెనీలో మేనేజర్‌గా నియమించాడు.

ఈ ఫైనాన్సింగ్ కంపెనీకి హైదరాబాదులో నేకాక వైజాగ్‌లోనూ, బొంబాయిలోనూ శాఖలున్నాయి. సోహన్‌లాల్ తన పెద్ద కుమారుడి సహాయంతో బొంబాయిలోని వ్యాపారాలు నిర్వహిస్తున్నాడు.

హైదరాబాద్‌లో ఒక బంగళా, వైజాగ్‌లో సముద్రతీరాన ఒక బంగళా, బొంబాయిలో మూడు బంగళాలు అతనికున్నాయి.

ఇరవై అయిదేళ్ళ సావన్‌కుమార్ మూడేళ్ళ అనుభవంలో బిజినెస్‌లో చాలా మెలుకువలు నేర్చుకున్నాడు.

'ది హైదరాబాద్ ఫైనాన్సింగ్ అండ్ ఇన్వెస్టిమెంట్స్ ప్రైవేట్ లిమిటెట్' సావన్‌కుమార్ పర్యవేక్షణలో విపరీతమయిన లాభాలు, ఖాతాదార్ల మన్ననలు ఆర్జించింది.

ఈ మూడేళ్ళనుంచీ సావన్ క్షణం విశ్రాంతి లేకుండా ఎప్పుడూ బిజీగా వుండేవాడు. సెక్రటరీ విమల వారం రోజుల క్రితం పెళ్ళి చేసుకుని రాజీనామా ఇచ్చింది. సావన్‌కి సెక్రటరీ సమస్య ఎదురయింది.

క్రితం రోజు పత్రికల్లో ప్రకటన ఇచ్చాడు.

ఈ రోజు ఇంటర్వ్యూకి వచ్చిన ఆ ప్రౌఢల్ని చూసి హతాశుడయ్యాడు కోరిన వయసు లేదు సరికదా సామర్థ్యంగాక అందాన్ని ప్రదర్శించడానికి వచ్చారు.

సావన్‌కి తల బద్దలవుతోంది.

తనకి సెక్రటరీ కావాలి! పద్దెనిమిది నుంచి ఇరవై అయిదేళ్ళ లోపు వయసువున్న పెళ్ళికాని స్త్రీ కావాలి. ఆమెకి బిజినెస్ తప్ప మరో ఆలోచన వుండకూడదు.

"సార్, మిస్ షీలా ఈజ్ వెయిటింగ్."

సావన్ తల ఎత్తి చూశాడు. ద్వారంలో ఆఫీస్ బాయ్ నాగేష్ నిలబడి వున్నాడు.

"పంపించు."

నాగేష్ వెనుదిరిగాడు.

ఆఫీస్ బాయ్ నాగేష్ యింటి దగ్గర వంట నుంచి ఆఫీసుకు ఫైళ్ళు అందివ్వడంవరకు అన్నీ చక్కగా చేసి పెడతాడు. ఇరవై ఏళ్ళు. ఇంటర్ వరకు చదువుకున్నాడు. రెండేళ్ళ క్రితం సావన్ అతన్ని వైజాగ్ నుంచి తీసుకు వచ్చాడు.

ఉదయం లేచి వంట చేయడం, తర్వాత ఆఫీసుకి వచ్చి ఫైళ్ళు వగైరా అందివ్వడం, సాయంత్రం తిరిగి ఇంట్లో వంట చేయడం...ఇవీ నాగేష్ దినచర్యలు. అతని వంటకి సావన్ ఎంతగా రుచి మరగాడంటే తాను పెళ్ళి చేసుకుంటే నాగేష్ ఎక్కడ దూరమవుతాడోనని బెంగపడు తున్నాడు.

సావన్ గబగబ టేబుల్ మీద ఫైళ్ళని పక్కకితోసి రుమాలుతో ముఖం తుడుచుకుని, రివాల్వింగు చైర్లో నిటారుగా కూచున్నాడు.

హఠాత్తుగా గదిలో మల్లెపూల వాసన గుబాళించింది. సావన్‌కి మైకం కమ్మింది.

"ఎక్స్‌క్యూజ్ మీ, సర్..." వీణ తంత్రులని మీటి నట్లుందా స్వరం.

"ప్లీజ్ సిడవున్..." అన్నాడు సావన్ ఆమెనే చూస్తూ.

"థాంక్స్" అని కూచుందామె.

ఆమె వయసు 20 వుంటుంది. పసుపు పచ్చ షిఫాన్ చీర, అదే రంగు జాకెట్టు ధరించింది. చేతుల్లోగానీ, మెడలోగానీ, చెవుల్లోగానీ ఎలాటి ఆభరణాలూ లేవు—ఒక్క రిస్టువాచీ, పూసల లాకెట్ తప్ప.

పెదవులకి లిప్‌స్టిక్ లేదు. గోళ్ళకి నెయిల్ పాలిష్ లేదు. తెల్లటి రంగు. నల్లటి కళ్ళకి కాటుక మరింత అందాన్ని తెచ్చింది. పొడవాటి జడలో మల్లెపూవుల దండ తురిమి వుంది. కళ్ళు చెదిరే అందం ఆమెది.

ప్రశాంతంగా వున్న ఆ ముఖంలో ఎలాటి భావాలూ వ్యక్తం కావడం లేదు. నిశ్చలంగా వున్న చూపుల్లో గౌరవం వుట్టిపడుతోంది.

"ఎక్స్‌క్యూజ్ మీ, సర్...నా పేరు షీలా!" హిందీలో పలికిందామె.

"సారీ! మిస్ షీలా...మీ రాలస్యంగా వచ్చారు" అన్నాడు సావన్.

ఆమె నవ్వింది. తెల్లటి పలువరుస తళుక్కున మెరిసింది.

"సారీ, సర్...ఇలా ఇంటర్వ్యూలకి హాజరవడం సర్వసాధారణమైపోయింది. ఎక్కడా వుద్యోగం దొరకడం లేదు...ఇక్కడా అదే పరిస్థితి ఎదురవుతుందనుకున్నాను—సారీ సర్, అందుకే ఆలస్యం చేశాను."

షీలా హాండ్ బాగ్ తెరిచింది. ఏవో కాయితాలు తీసి టేబిల్‌పైన పెట్టింది. సావన్ ఆలోచనగా ముందుకి వంగాడు.

ఆ కాయితాలు అందుకుని మళ్ళీ ఆమెని చూసి ఆలోచించాడు. సంస్కారం, మర్యాద, విశిష్ట వ్యక్తిత్వం వున్న ఇలాటి స్త్రీ తన జీవిత భాగస్వామి అయితే ఎంత బావుండు?

"సర్, అవి నా సర్టిఫికేట్సు."

ఈసారి ఆమె స్వరం గమనించాడు. ప్రశాంత స్వరం. స్త్రీత్వం ఉట్టిపడే స్వరం. మరోసారి సావన్ శరీరం పులకరించింది. అంతలోనే జలదరించింది. ఏమిటీ తన ధోరణి! తన ఆలోచనలు ఎక్కడికి వెళుతున్నాయి.

"వెరీగుడ్." అతిప్రయత్నంమీద ఆ కాయితాలపైన మనసు లగ్నం చేసి అనగలిగాడు.

"సర్, నేను ఈమధ్యే పార్ట్‌వోండు పాసయాను. టైపింగ్ వచ్చు, స్పీడు ఎనభై పదాలు. సెక్రటరీగా సంవత్సరం అనుభవముంది. నా క్వాలిఫికేషను బి.య్యే. కరెస్పాండెన్సు, అపాయింటుమెంట్సు, ఎంగేజ్‌మెంట్సు నిర్వహించగలను. ఇవిగాక మీరుకోరిన పనులు చేయగలను—ఐమీన్ ఆఫీసు వర్కు."

ఆమె ముఖంచూసి చెప్పవచ్చు: ఆమెకి సెక్రటరీ కావలసిన అన్ని అర్హతలున్నాయి. సర్టిఫికేట్లు వగైరా పరిశీలించడం అనవసరం. అసలు ఇంటర్వ్యూ అనవసరం.

"చూడండి, మీరు రేపటినుండి ఆఫీసుకి రావచ్చు. ఉదయం పదినుండి సాయంత్రం అయిదువరకు మీ డ్యూటీ. ఓ. కే." అన్నాడు సావన్ ఒక నిశ్చయానికి వస్తూ.

"థాంక్యూ, సర్" లేచి నిలబడి రెండుచేతులూ జోడించిందామె.

# 2

సావన్ తన రివాల్వింగ్ ఛేర్‌లో కూచోని సిగరెట్టు వెలిగించాడు. షీలా గుమ్మందగ్గర ఆగి, "ఎక్స్‌క్యూజ్ మీ, సర్" అంది.

"కమిన్" అన్నాడు గంభీర స్వరంతో.

ఆమె తలవంచుకుని లోనికివచ్చి సెక్రటరీ డెస్కు దగ్గర కూచుంది.

సావన్ నవ్వుకుని భుజాలెగరేశాడు. సిగరెట్టు పూర్తి కాలేవరకు పీల్చి, తర్వాత ఆష్‌ట్రేలోకుక్కి నవ్వుతూ చూశాడు షీలాని.

ఆమె బెదురుచూపులు చూసింది.

"మిస్ షీలా, ఈరోజు చాలా వర్కువుంది. ముందు వారం రోజుల పెండింగు వర్కు పూర్తిచేయాలి. నా ఉద్దేశ్యం ఓవర్ టైం చేయాలని కాదు! ఆ పద్ధతి ఈ కంపెనీలోలేదు. ఇక్కడ జీతాలెక్కువ. ఓవర్ టైము వుండదు. నా ఉద్యోగులకు ఎలాంటి ఇబ్బందులూ కలుగ కూడదు. నా సిద్ధాంతాల గురించి చెప్పాలంటే...మిస్ షీలా, సిద్ధాంతాలగురించి తరువాత మాట్లాడుకుందాం. ఇక పని చూద్దామా?" సావన్ అడిగాడు.

షీలా సావన్ ప్రశ్నకి తలూపింది.

"ఆల్ రైట్, ఇప్పుడు కొన్ని ఉత్తరాలు డిక్టేట్ చేస్తాను, వ్రాసుకోండి" సావన్ అన్నాడు.

ఆ తర్వాత రెండుగంటలు సావన్ ఉత్తరాలు డిక్టేటు చెయ్యడంలో నిమగ్నమయ్యాడు.

మధ్యాహ్నం లంచ్ అవరు తర్వాత షీలా ఉత్తరాలు టైప్ చేయడంలో నిమగ్నమయింది. ఆమె కోమలమైన

చేతివేళ్ళు కీ బోర్డుపైన నాట్యం చేస్తోంటే సావన్ తమా షాగా తిలకించ సాగాడు.

సాయంత్రం అయిదు గంటలకి ఉత్తరాలన్నీ టైప్ చేసి అందించింది షీలా. సావన్ ఆమె టైపింగు మెచ్చు కుని, వాటిని ఉదయం చెక్ చేస్తానని సొరుగులో తోశాడు.

ఆ తర్వాత ఆమెవేపు తిరిగి, "మిస్ షీలా, ఆఫీసు సమయం ఐపోయింది. ఇక మీరు వెళ్ళవచ్చు" అన్నాడు. "కానీ, ఒక మనవి" మళ్ళీ అన్నాడు. "మీతో కొన్ని విషయాలు మాట్లాడాలి. అభ్యంతరం లేకపోతే నాతో ఇంటికివస్తే మనం మాట్లాడుకోవచ్చు."

సాలోచనగా తలూపిందామె.

కార్లో సావన్ పక్క సీట్లో షీలా, వెనకసీట్లో నాగేష్ కూచున్నారు.

బంగళాకి చేరుకున్నాక నాగేష్ని కాఫీ టిఫిన్స్ రెడీ చ్చేయమని చెప్పాడు.

తర్వాత షీలాని ఇల్లంతా తిప్పి చూపించాడు. ఇంత పెద్ద ఇంట్లో ఒంటరిగా ఎలా వుంటున్నారని షీలా అడి గింది. సావన్ నవ్వి తనకి ఒంటరితనం ఇష్టమని చెప్పాడు. అప్పుడామె ముఖంలో మార్పు గమనించాడు.

ఇల్లంతా తిరిగాక నాగేష్ టిఫిన్ రెడీ అని చెప్పాడు. షీలా మొహమాటపడుతూ టేబులుముందు కూచుంది.

సావన్ ఇది గమనించి అన్నాడు, "చూడండి షీలా, నా దగ్గిర మొహమాటం పనికిరాదు. మీరు నాతో ఎంత ఫ్రీగా వుంటే అంతమంచి సెక్రటరీ అవుతారు."

టిఫిను చేస్తున్నంతసేపూ యెవరూ మాట్లాడుకోలేదు. కాఫీలు తాగాక సావన్ లేచి "యెలావుంది టిఫిన్?"

అనడిగాడు. ఆమె సిగ్గుపడి, "చాలా బావుంది" అంది.

సావన్ నవ్వి, "మళ్ళీ మళ్ళీ తినాలనిపించడంలేదూ?" అనడిగాడు.

ఆమె ఇంకా ముడుచుకపోయింది.

"మిస్ షీలా, ఈ టిఫిన్ నాగేష్ చేశాడు. వాడి వంట అంటే నేను పడిఛస్తాను. పెళ్ళి చేసుకున్నా నా భార్య చేత వంటచేయించను."

షీలా ఇబ్బందిగా చూసింది.

"ఓహ్, సారీ. మీకేదేనా ఇబ్బంది కలిగితే వెంటనే చెప్పేయండి. హిపోక్రసీ నాకు నచ్చదు." సావన్ అన్నాడు.

"నో సర్! నేనింకా నమ్మలేక పోతున్నాను—" మాటలాపేసింది షీలా.

"ఏమిటి?" సావన్ అడిగాడు ఆతృతగా.

"నిజంగా నాకీ ఉద్యోగం వచ్చినట్టు నమ్మకం కుద రడం లేదు" షీలా అంది.

ఆమె ముఖంలో విచారం, కళ్ళలో ఆందోళనచూసి సావన్ చలించిపోయాడు.

"ఓహ్, షీలా! మీ రెందుకంత దిగులుపడుతున్నారు? మీరు నా సెక్రటరీ. మీ జీతం వెయ్యి రూపాయలు."

అవాక్కయి పోయింది షీలా. "సర్, వెయ్యి రూపాయలా! ఇదింకా నమ్మలేను!"

'నువ్వు నమ్మలేనిసంఘటనలు ముందుగా ఇంకా జరుగు తాయి.' లోలోన అనుకున్నాడు సావన్.

"మిస్ షీలా. మీ కంగారు చూస్తోంటే నాకు నవ్వు వస్తోంది. పదండి, గార్డెన్‌లో కెళ్ళి మాట్లాడుకుందాం."

ఇద్దరూ గార్డెన్‌లోకొచ్చి కూచున్నారు. చీకటి పడుతోంది.

సావన్ సిగరెట్టు వెలిగించి ఆమె మొఖంలోకి చూశాడు.

"ఇప్పుడు చెప్పండి షీలా, మీ గురించి" అన్నాడు సావన్.

ఆమె ఉలిక్కిపడి, "సర్...?" అంది నీళ్ళు నములుతూ.

"మీగురించి చెప్పండి, షీలా. నాకు పరిచయమున్న వ్యక్తుల పర్సనల్ విషయాలు తెలుసుకుంటాను. వీలైతే వారి కష్టాల్లో పాలుపంచుకుంటాను. అబద్ధం చెప్పకండి. మీరిప్పుడు కష్టాల్లో వున్నారు. మీకు ఉద్యోగం ఇచ్చి ఆదుకున్నాను. కానీ నాకు తృప్తిగాలేదు. నేను మీకు పూర్తిగా సహాయపడాలి. చెప్పండి."

షీలా కంటిరెప్పలు నెమ్మదిగా యెత్తి నిశ్చలంగా చూసింది.

ఆ చూపుల బాణాలు సావన్ గుండెలో గుచ్చుకున్నాయి. నరాలు బిగదీసుకున్నాయి.

"సర్, నేను ఒంటరిదాన్ని - నాకు సమస్యలు లేవు"

షీలా మాటలువిని తిరిగి సావన్ మామూలుస్థితికివచ్చేడు.

"మీదేవూరు?" అడిగాడతను.

"మద్రాసు. మానాన్న మ్యూజీషియన్. సంవత్సరం క్రితం గతించారు."

"ఓహ్! సారీ, మిస్ షీలా! ఐ రిగ్రెట్ వెరీమచ్. ఆడవాళ్ళు ఒంటరివాళ్ళు కావడం నేను భరించలేను షీలా! ఎక్స్‌క్యూజ్ మీ, నా ప్రశ్నలతో మిమ్మల్ని బాధిస్తున్నాను."

"నో, సర్. అలాటిదేమీ లేదు. అడగండి."

సావన్ గట్టిగా నిట్టూర్చి, "మీ హిందీ యాసగా వుంది. నా అనుమానం —"

షీలా నవ్వి, "నేను తమిళియన్ని" అంది. "మా నాన్నకి తమిళ్ ఫీల్డులో మ్యూజిక్ డైరెక్టరుగా మంచి పేరువుండేది. నేను ప్లేబాక్ సింగర్ నవుదామనుకున్నాను. సర్, నేను సుశీలకంటే బాగా పాడగలను. వీణ వాయించడం వచ్చు. సంగీతం తరతరాలుగా మా వంశంలో ప్రవహిస్తోంది. మా నాన్న గతించాక నా ఆశలన్నీ కడిగేసుకున్నాను. ఆయన సంపాదించిన ఆస్తి ఆయన చావుతో బాటు పోయింది. నేనిలా వీధిలో పడవలసి వచ్చింది."

సావన్ జాలిగుండె గుబగుబలాడింది. "మీ నాన్నగారి పేరు?"

"కె. డి. లక్ష్మణ్."

"కె. డి. లక్ష్మణ్?" సావన్ ఉత్సాహం అధికమైంది. "ఆయనకి ఆరుసార్లు ఫిలింఫేర్ అవార్డు వచ్చింది కదూ?

"అవును" ముక్తసరిగా అంది షీలా.

"మీరంత గొప్పవారి కూతురయినందుకు గర్వంగా లేదా?"

షీల తలూపింది.

"ఆల్ రైట్ షీలా, బాగా చీకటి పడింది. మీరు యెక్కడ వుంటున్నారు?"

"వనరాజ్ ప్లాట్స్, బాలానగర్ లో."

"పదండి, కారులో మిమ్మల్ని వదిలిపెడతాను. చూడండి, మీకే సహాయం కావాలన్నా నన్ను అడగ

డానికి జంకకండి."

షీలా ఆశ్చర్యంగా తలూపింది.

## 3

వారం రోజులు గడిచాయి.

సావన్‌కి రోద్దిరోద్దిగా ఫలితం కన్పిస్తోంది. షీలా ఇప్పుడతనితో ఫ్రీగా మాట్లాడుతోంది. ఆఫీసు వర్క్ సమర్థవంతంగా చేస్తోంది. రోజూ సాయంత్రం సావన్‌తో ఎముకల్ని కొరికే చలిలో టాంక్‌బండ్ మీద కబుర్లు చెబుతూ గడుపుతోంది. సావన్‌తో స్నేహం ఆమె బాధలన్నిటినీ మరిపిస్తోంది.

ఆమె అలా సన్నిహితం కావడం సావన్‌కు చాలా ఆనందంగా వుంది. ఆ ఆనందంలో కొన్ని పన్లుచేశాడు. మొదటగా ఆమెకో నగ బహూకరించాడు. రెండవసారి కె. డి. లక్ష్మణ్ పాటలన్నీ దాదాపు సేకరించి టేప్ రికార్డర్ బహూకరించాడు. రెండు మూడుసార్లు ఆమె ఫ్లాట్‌కి వెళ్ళాడు.

నాగేష్ వీళ్ళిద్దర్నీ గమనిస్తూ ఓ కంట కనిపెట్టాడు. ఒకరోజు రాత్రి సావన్ గదిలోవుండగా బయటనుంచి తలుపు గడియపెట్టి కిటికీలోంచి ఒక హెచ్చరిక జారీ చేశాడు:

"సార్! ఆమెతో మీరలా తిరగటం ఏమీ బాగా లేదు. ఆఫీసులో గుసగుస లాడుకుంటున్నారు. చాలా నీచమయిన కామెంట్స్ చేస్తున్నారు సార్! సార్, ఆమెకి మీ భార్య అయ్యే అర్హత లేదు. ఆమె పుట్టు పూర్వోత్తరాలు మీకు తెలియవు! ఆమె మాయమాటలు చెబుతోంది. మీరు దయచేసి నా మాటవిని మీ ప్రయ

త్నాలు మానుకోండి, లేదా నేను మీ దగ్గరపని మాను కుని వెళ్ళిపోతాను!''

సావన్ కి ఆశ్చర్యం వేసింది. ఆఫ్టరాల్ ఒక నౌఖరు, తనని హెచ్చరించడమా! లేచివెళ్ళి నాలుగు అంటిద్దా మనుకున్నాడు. కానీ బయట గడియపెట్టి వుంది.

ఆఫీసులో గుసగుసలు బయలుదేరినట్లు సావన్ కి తెలుసు. అయినా వాటిని ఖాతరు చేయలేదు. ప్రేమించేవాడికి భయమెందుకు? మరో వారంరోజుల్లో తను డాడీకి తెలిపి షీలాను పెళ్ళిచేసుకోబోతున్నాడు.

డాడీ అభ్యంతరం చెప్పడు. తను మంచీ చెడూ విచక్షణా జ్ఞానం లేని పసివాడుకాడు. డాడీకి తనమీద నమ్మకం వుంది.

మరోవారం గడిచింది.

షీలాతో అతని పరిచయం మొదటివారంలో గాఢమయిన స్నేహంగా మారితే, రెండవవారంలో ఘాటైన ప్రేమగా మారింది.

తను ప్రేమిస్తున్నట్టు షీలాతో చెప్పినప్పుడు సావన్ నాలిక తడారిపోయింది. కాళ్ళు వణికాయి. చాలాసేపు అచేతనంగా వుండిపోయాడు.

''షీలా ఆఫీసులో పుకార్లు మీరు వినేవుంటారు. ఆ పుకార్లని రూపుమాపాలంటే మనం ఒక నిర్ణయానికి రావడం మంచిది. అదేమిటో ... అదేమిటో...మీకు తెలుసు. మీ అభిప్రాయ మేమిటి? మీరు ఒంటరివారు, నేను ఒంటరి వాడ్ని. ఏమంటారు? నేను మిమ్మల్ని పూర్తిగా అర్థంచేసుకున్నాను. మీరూ నన్ను అర్థంచేసుకునే వుంటారు...ఏమిటి?''

"సర్, నేను అనాథని! మీరు కోటీశ్వరులు. మీకు నాకంటే మంచి భార్యలు దొరుకుతారు!" షీలా నెమ్మదిగా అంది.

"నాకు తెలుసు షీలా! వాళ్ళకి కావల్సింది డబ్బు! నీలో ప్రత్యేకత వుంది. నేను వూహించుకున్న భార్యకు కావలసిన గుణాలన్నీ నీలో వున్నాయి. కాదనకు షీలా కాదనకు! నా డబ్బునుకాక నన్ను ప్రేమించే వ్యక్తి నాకు భార్యగా కావాలి. ఆ వ్యక్తి నువ్వుతప్ప యింక యెవ్వరూ కాలేరు షీలా."

"సర్ మీరు త్వరపడుతున్నారు."

"లేదు__పదిహేను రోజులు ఆలోచించాను. నో అబ్జెక్షన్ ప్లీజ్! షీలా ఇకనుంచి నన్ను కుమార్ అని పిలవాలి, నేను షీలా అనిపిలుస్తాను. ఓ.కే."

"సర్...సర్..."

"ఓహ్! డామిట్ యువర్ సర్! కుమార్ అని పిలువు."

ఒక్క క్షణం నిశ్శబ్దం.

"షీలా...?" సావన్ పిల్చాడు.

"సర్__కు...మా...ర్, నేను__నేనూ మిమ్మల్ని ప్రేమిస్తూన్నాను."

షీలా సిగ్గుతో ముడుచుకుపోయింది.

సావన్ పెదవులపైన చిరునవ్వు మెరిసింది.

"షీలా! మా తాత ఏం చెప్పేవాడో తెలుసా? అనుకున్నది సాధించి తీరాలన్న పట్టుదల నా ముఖంలో వుందనీ! ఇప్పుడు నీ ప్రేమ సాధించాను. ఇక యీ ప్రపంచంలో నాకు అసాధ్యమంటూ ఏదీ లేదు!"

# 4

ఛీఫ్ అక్కౌంటెంట్ చొక్కారావు స్వింగు డోర్ తోసుకుని లోనికి ప్రవేశించాడు. "గుడ్ మార్నింగ్ సర్."

సావన్ ఉత్తరాల్లోంచి తలెత్తి చూశాడు. చొక్కారావు కళ్ళు షీలాపైన వున్నాయి. సావన్ పళ్ళు కొరుకుతూ, "కమిన్, సిడవున్!" అని కసిరాడు.

చొక్కారావు వచ్చి సావన్ కెదురుగా చైర్‌లో కూచున్నాడు, "సర్, మీతో ఒక ముఖ్య విషయం మాట్లాడాలి."

సావన్ అతన్ని సూటిగా చూశాడు, "ఏమిటి?"

"సర్, A B C గురించి ఏం ఆలోచించారు?"

సావన్ తల మీద పిడుగులు కురిశాయి!

ఆ షాక్‌నుంచి తేరుకోడానికి అతనికి రెండు నిముషాలు పట్టింది.

A B C! గాడ్, ఏమిటీ మతిమరుపు? ప్రేమ వ్యవహారాల్లో పడినప్పటినుంచి బిజినెస్ విషయాలు పూర్తిగా మరిచిపోయాడు!

వైజాగ్‌లో 'ఆంధ్రా బిస్కెట్స్ కంపెనీ'కి అయిదు లక్షలు ఫైనాన్స్ చేయవలసి వుంది. దాని తాలూకు ఫార్మాలిటీస్ నవంబర్ అయిదవ తేదీన పూర్తి చేయవలసి వుంది. ఈరోజు మూడవ తేదీ. ఇంతవరకు ఆ విషయం తట్టనే లేదు!

"మిస్టర్...మిస్టర్ రావ్...డాక్యుమెంట్స్ సిద్ధంగా వున్నాయా?"

"యస్, సర్. వైజాగ్ బ్రాంచిలో."

"కానీ మిస్టర్ రావ్! నేను వాటిని పరిశీలించలేదు."

"క్షమించండి సర్, గడిచిన నెలలో పరిశీలించారు. నిర్ణయం ఇంకా తెలుపలేదు."

సావన్ కి మతి పోయింది. "ఓహ్, సారీ!... ఈమధ్య నేను_నెవర్ మైండ్! మిస్టర్ రావ్, ఆ ప్రపోజల్ నేను ఓ. కే. చేశాను."

"అయితే రేపు వైజాగ్ వెళతారా?"

సావన్ ఆలోచించాడు. వెళ్ళక తప్పదు. ప్రేమలో పడి బిజినెస్ నిర్లక్ష్యం చేస్తున్నాడని డాడీకి తెలిస్తే పెళ్ళి జరగదు!

"అవును, మిస్టర్ రావ్. రేపు వెళుతున్నాను."

"దటీజ్ గుడ్ సర్. థాంక్యూ" చౌక్యారావ్ లేచాడు. ఆ తర్వాత బయటికి నడిచాడు.

సావన్ తేలిగ్గా వూపిరి వదిలి షీలాని చూశాడు. ఆమె చక చక టైప్ చేస్తోంది. సావన్ సిగరెట్ వెల్గించి, "రేపు వైజాగ్ వెళుతున్నాను" అన్నా.

ఓ క్షణం తర్వాత షీలా తలెత్తి చూసింది. "అలాగే."

"నువ్వు కూడా రావాలి" మళ్ళీ అన్నాడు సావన్.

"ఎందుకు సర్?" భయంగా అడిగింది.

"ఓహ్, షీలా! ఇంత సామాన్య విషయం నీకెలా చెప్పాలి? ప్రేమికులు క్షణం కూడా విడిచి వుండలేరు, తెలుసా?" అసహనంగా అన్నాడు సావన్.

ఆమె సీరియస్ గా అంది, "సర్, పెళ్ళయేవరకు మనం కొన్ని నియమాలు పాటించడం మంచిది."

"షీలా, ఈ ఆఫీసులో విమర్శలకి నువ్వు భయపడుతున్నావా?" సావన్ అడిగాడు. అతని చూపులు అప్రయత్నంగా తలుపు మీద పడ్డాయి. నాగేష్ తలుపు కోద్దిగా నెట్టి తొంగి చూస్తున్నాడు.

షీలా ఏమీ అనలేకపోయింది. ఈసారి కీబోర్డు మీద ఆమె వేళ్లు వేగంగా కదలడం లేదు. ఆమె ఉచ్ఛ్వాస నిశ్వాసలు బరువుగా వున్నాయి. ముఖంలో భయం తొంగ లేదు. ఏదో తీవ్రంగా ఆలోచిస్తూ కంటి రెప్పలు వేగంగా ఆడిస్తోంది...

# 5

సముద్ర కెరటాలు ఎగసిపడుతున్నాయి.

ఉండుండి విన్పించే, గుండెలు హడలెత్తించే కెరటాల హోరు తప్ప అంతా నిశ్శబ్దంగా వుంది.

వైజాగ్‌లోని సేఠ్ సోహన్‌లాల్ బంగళాలో అంతకంటే నిశ్శబ్దంగా వుంది. మూడే మూడు జీవాలు బిజీగా అటూ ఇటూ తిరుగుతున్నాయి_సావన్, షీలా, నాగేష్.

రెండంతస్తుల ఆ భవనంలో పదేనిమిది గదులున్నాయి. ఆ గదులన్నీ ఉపయోగపడేవి కావు. ధనవంతుల దగ్గర తమకు ఉపయోగపడనివీ, సామాన్యులకు ఉపయోగపడేవీ చాలా వస్తువులుంటాయి.

సావన్ షీలాని బంగళా అంతా తిప్పి చూపించాడు. ఇది హైదరాబాదు బంగళాకంటే పెద్దది. ఆవరణ ఇంకా పెద్దది. చీకటి పడితే ఆవరణలో అడుగు పెట్టాలంటే వెంట ఎవరినయినా తీసుకెళ్ళడం మంచిది. గుబురుగా పెరిగిన పిచ్చి మొక్కలు, పొదలు, ఎత్తుగా పెరిగిన చెట్లు_ప్రతిదీ చీకటి పడితే భయం పుట్టించేలా కన్పిస్తాయి.

బంగళాలో ప్రవేశించాలంటే బయట పదిమెట్లు ఎక్కాలి. ఆ తర్వాత వరండాలోకెళ్ళి సింహద్వారం ద్వారా హాల్లోకి ప్రవేశించాలి. మేడమీదికి వెళ్ళేందుకు హాల్లో ఇరువేపులా మెట్లున్నాయి.

బయట బంగళాకి ఎడమవేపు నాలుగుని గ్యారేజి వుంది. ఈ గ్యారేజీలో ఒకదాని పక్కన ఒకటి వరసగా ఆరుకార్లు వుంచవచ్చు.

సమయం రాత్రి ఎనిమిది గంటలయింది.

హైద్రాబాదునుంచి ఆ ముగ్గురూ బెంజి కారులో సాయంత్రం అయిదు గంటలకి విశాఖ చేరుకున్నారు. నాగేష్ వంట పదార్థాలు కారు డిక్కీలోంచి కిచెన్‌లోకి తరలించాడు. సావన్, షీలా, తమ రెండు సూట్‌కేసులతో బంగళాలోకి ప్రవేశించారు.

మేడమీద సావన్ ఆమెకి అన్ని సౌకర్యాలూ వున్న గది కేటాయించాడు. ఆమె గదికి మూడు గదులవతల తన గది వుంది.

స్నానాలవీ ముగించి, బడలిక తీర్చుకున్నాక సావన్ షీలాని ఇల్లంతా తిప్పి చూపించాడు. ఎనిమిది గంటలకి నాగేష్ వంట ముగించి వడ్డించడానికి పిల్చాడు.

భోజనాలయ్యాక ఎవరి గదుల్లోకి వాళ్ళు వెళ్ళారు.

ఎంత రాత్రి గడిచినా సావన్ కుమార్‌కు నిద్ర రాలేదు.

పిచ్చి పిచ్చి ఆలోచనలు మెదడును తినేస్తున్నాయి. ఆలోచనలకు ఒక రూపం ఏర్పడటం లేదు!

కిటికీలోంచి చంద్రుడు సూటిగా కన్పిస్తున్నాడు.

సావన్ ఆరవసారి వాచీ చూసుకున్నాడు. 11-10.

మూడవ సిగరెట్టు వెలిగించాడు. సగం కాలేవరకు

శూన్యంలోకి చూశాడు. ఆ తర్వాత తిరిగి ఆలోచించడం ప్రారంభించాడు.

తను షీలాని ప్రేమిస్తున్నాడు. నిజమే. ఆమె తనని ప్రేమిస్తోంది. నిజమే. తామిద్దరూ భార్యాభర్తలు కాబోతున్నారు. నిజమే. కాబోయే భార్యాభర్తలకి ఎడబాటు ఎందుకు? ఇద్దరి మధ్య మూడు గదులు దూరమెందుకు?

సావన్ గుండెలు వేగంగా కొట్టుకున్నాయి.

లేచి కూచున్నాడు. ఆమె ఈ గదిలో, ఈ బెడ్ పైన తన పక్కన పడుకుంటే ఎంత బావుంటుంది?

సావన్ శరీరంలో ఏవో మార్పులు రాసాగాయి. తీయని బాధ! తన్మయత్వంతో కళ్ళు మూసుకున్నాడు ఓ క్షణం.

తేరుకుని సిగరెట్ విసిరేశాడు. తలుపు తెరిచి బయటికి వచ్చాడు.

నడవా చీకటిగా వుంది. చప్పుడు కాకుండా గబగబ మెట్లవేపు కదిలాడు. వేగంగా దిగి కిందికి వచ్చాడు. ఓ క్షణం ఆలోచించి నా గెస్ట్ గది ముందు కెళ్ళాడు. తలుపు నెట్టి చూశాడు. తెరుచుకోలేదు. బయటినుంచి గడియ పెట్టి వెనక్కి తిరిగాడు.

వేగంగా మెట్లెక్కి మళ్ళీ పైకి వచ్చాడు.

అతనికి తెలియకుండానే అతని కాళ్ళు షీలా గది వద్దకు చేర్చాయి. మళ్ళీ ఒక్క క్షణం సందేహం. ఆమె అరిచి అలజడిచేస్తే? తనని అసహ్యించుకుని ఇక్కడ్నించి వెళ్ళిపోతే?

సావన్ నిశ్చేష్టుడైపోయాడు. అలా జరక్కూడదు. అలా జరగదు. ఆమెని ఒప్పించాలి. ఆమె అమాయకురాలు కదూ? నచ్చజెప్పాలి.

తలుపుపైన చప్పుడు చేశాడు.

ఎవరో గుండెని నలుపుతున్నట్లు మెలికలు తిరిగాడు.

"ఎవరూ?"

"షీ...లా?" నోటిచేత బలవంతంగా పలికించాడు.

"కుమార్, మీరా?" ఆమె గొంతులో గాభరా వుంది. సావన్ సమాధాన మిచ్చేలోపున తలుపు తెరుచుకుంది.

"కుమార్, ఏమిటిలా వచ్చారు?"

ఆమె ముఖంలోకి చూశాడు. తన ముఖంలో భావాలు కన్పించకుండా జాగ్రత్తపడ్డాడు.

"నీతో ఒక ముఖ్య విషయం మాట్లాడాలి."

"లోనికి రండి."

"ఇక్కడ కాదు! నేనీ ఇంట్లో నా గదిలోతప్ప ఇంకెక్కడా వుండలేను" అన్నాడతను.

షీలా సందేహించింది. అతని ముఖంలోకి సూటిగా చూసింది. "పదండి."

ఆలోచించకుండా గబ గబా నడిచాడు సావన్ తన గది వద్దకు.

తలుపులు తెరిచి వెనక్కి తిరిగి "రా!" అన్నాడు. ఆమె లోనికడుగు వేసింది.

ధడాలున తలుపు మూశాడు.

షీలా అర్చింది, "ఏమిటిది కుమార్?"

"ష్‌ష్‌! తలుపులు మూసుకున్నాయి, మనం ఇప్పుడు భార్యాభర్తలం" ధైర్యం తెచ్చుకుని అనేశాడు సావన్.

"కుమార్! ప్లీజ్, ప్లీజ్!" ఆమె అరుస్తోంది. "మీరు తప్పు చేస్తున్నారు—తర్వాత చింతిస్తారు!"

"నాన్సెన్స్ షీలా! నన్ను నమ్మవా?" మొదటి సారిగా ఆమెను ముట్టుకున్నాడు.

"నేను నిన్ను తప్పక పెళ్ళి చేసుకుంటాను. రేపే డాడీకి ఫోన్ చేస్తాను. ఆయన అభ్యంతరం చెప్పరు కమాన్!"

ఆమె భుజం మీద చెయ్యి వేసి వెనక్కి లాగాడు. ఆమె అతని గుండెలమీద వాలింది.

"షీలా! ఇది ఆనందంగా గడపవలసిన సమయం. ఈ రోజు... ఈ రాత్రి జన్మకంతటికీ జ్ఞాపకముంచుకోవలసిన రాత్రి. మరుపురాని మధురరాత్రి షీలా, ఒక్కసారి నవ్వు!"

# 6

సూర్యకిరణాలు ముఖం మీదపడి గిలిగింతలు పెడుతున్నాయి.

కళ్ళు తెరవబుద్ధి కావటం లేదు సావన్ కి. మెలుకువ వచ్చినా అలాగే పడుకుని రాత్రి అనుభవం నెమరు వేసుకుంటున్నాడు. తృప్తి సాధించాను. ఇప్పుడు ప్రేమకి పరిపూర్ణత ఏర్పడింది. ప్రపంచాన్ని జయించే శక్తి వచ్చేసింది.

సావన్ హఠాత్తుగా దుప్పటి లాగి పారేసి పక్కకి తిరిగాడు. షీలా లేదు. ముసి ముసిగా నవ్వుకుని తన నగ్న శరీరం చూసుకుని సిగ్గుతో కళ్ళు మూసుకున్నాడు.

"సార్!" వినిపించాయి మాటలు.

సావన్ చటుక్కున దుప్పటి కప్పుకున్నాడు, "కమిన్!"

తలుపు తోసుకుని నాగేష్ ప్రవేశించాడు ట్రేతో. సావన్ గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. వీడు బయటికెలా వచ్చాడు?

నాగేష్ ట్రే టీపాయ్ మీద పెట్టి కాఫీ కప్పు అందించాడు.

"సార్, నా గది బయట తలుపు గడియ ఎవరో పెట్టారు. ఎవరు సార్?"

"నేనే."

"ఎందుకు సార్?"

"నువ్వు డిస్టర్బ్ చేస్తావని. బయటికెలా వచ్చావు?"

"కిటికీ దూకి" నాగేష్ అన్నాడు నవ్వి.

సావన్ వులిక్కిపడి "టైం ఎంతయింది?" అనడిగాడు.

"ఎనిమిది కావస్తోంది."

"షీలా ఏం చేస్తోంది?"

నాగేష్ ముఖం చిట్లించాడు. "ఆమె గదిలో లేదు సార్."

'బాత్ రూంలో వుండవచ్చు' సావన్ అనుకున్నాడు.

"సరే, నువ్వెళ్ళు."

నాగేష్ వెళ్ళిపోయాడు.

సావన్ కాఫీ తాగేసి వుత్సాహంగా ఈల వేశాడు. ఆదివారం! అయిదవ తారీకు! ఈ రోజు A B C వ్యవహారం ముగించి సాయంత్రం హైద్రాబాదుకి ప్రయాణం కట్టాలి. రేపు వుదయం డాడీకి ట్రంకాల్ చేసి షీలా గురించి చెప్పాలి. సావన్ శరీరం పులకరించింది. మరో సారి రాత్రి అనుభవం జ్ఞాపకం వచ్చింది.

స్నానం చేసి బట్టలు వేసుకుని ఆఫీసుకి ఫోన్ చేశాడు.

సమయం తొమ్మిదవుతోంది. అవతల మేనేజర్ ముకుందం పలికాడు.

“పావన్ స్పీకింగ్.”

“సార్, మీరా? ఎక్కడ్నుంచి మాట్లాడుతున్నారు?”

“ఇక్కడినుంచే.”

“వాటె సర్‌ప్రైజ్! ఎప్పుడు వచ్చారు?”

“నిన్న సాయంత్రం. మేనేజర్, నాకు ఎక్కువ సమయం లేదు. మీరు A B C డాక్యుమెంట్స్ తీసుకుని ఇక్కడికి వస్తారా?—పదకొండు గంటలకి?”

“సర్, మీరు ఓ. కే. చేశారా?”

“అవును. ఈ విషయం మన క్లయింట్స్‌కి తెలుపండి. పదకొండు గంటలకి వాళ్ళతో ఇక్కడికి రండి. దట్సాల్.”

ఫోను కట్ చేసి, బయటికి వచ్చాడు పావన్. చకచకా షీలా గదిలోకి నడిచాడు. ఆమె అక్కడ లేదు. బాత్‌రూం దగ్గరి కెళ్ళి ఆగాడు. లోన చప్పుడు లేదు.

“షీలా!” అని పిలిచాడు. సమాధానం లేదు. తలుపు నెట్టాడు. బాత్ రూంలో ఆమె లేదు.

తిరిగి గదిలోకి వచ్చాడు. “షీలా?”

రెండవసారి కూడా సమాధానం లేదు. గబగబ బయటికి వచ్చి మెట్లు దిగాడు. కిచెన్ చేరువని తొంగి చూశాడు. నాగేష్ కనిపించాడు. “షీలా ఎక్కడ?”

నాగేష్ ముఖం చిట్లించాడు, “నాకు తెలియదు సార్!”

పావన్‌కి అసహనం ఎక్కువైంది. ఆందోళనగా ఇల్లంతా గాలించాడు. షీలా ఎక్కడా లేదు, మూడు

సార్లు గొంతు చించుకుని ఆమెని పిల్చాడు. సమాధానం లేదు. బయటి కెళ్ళిందా?

సావన్ బయటికి పరిగెత్తాడు. ఆవరణలో ఆమె ఆచూకీ ఎక్కడా లేదు. బంగళా దాటి సముద్రం వెంబడి గాలించాడు.

ఎక్కడి కెళ్ళింది షీలా?

సావన్ మతిపోతోంది. ఆమెకేం సంభవించింది? రాత్రి సంఘటనకి అసహ్యించుకుని ఆత్మహత్య చేసు కుందా? ఆమె దేహం ఈ సముద్రంలో కలిసిపోయిందా? గాడ్! ఆమె చావుకి తనే కారకుడా?

సావన్ శక్తికొద్దీ బంగళాలోకి పరిగెత్తాడు. ఒక్క అంగలో నాలుగేసి మెట్లెక్కి మేడమీదికి వెళ్ళాడు. షీలా గదిలో కెళ్ళి ఆత్రతగా గాలించాడు. గుండెలు వేగంగా కొట్టుకున్నాయి.

గదిలో ఆమె సూట్ కేసు లేదు. ఆమెకి సంబంధించిన వస్తువులేవీ లేవు.

షీలా వెళ్ళిపోయింది. ఎక్కడికి వెళ్ళినా ఆమె ఈ లోకంలో మాత్రం వుంది. అదే చాలు. మళ్ళీ కన్పిస్తుందా? తను వెతకాలి. తను మోసగాడూ, నీచుడూ కాడని నచ్చచెప్పాలి! ఎక్కడ కన్పిస్తుంది? తిరిగి హైదరాబాదు వెళ్ళిందా, లేక మద్రాసా?

"సార్..." నాగేష్ గొంతు పలికింది.

సావన్ తేరుకుని చూశాడు.

"సార్...ఎవరో మనిషి వచ్చాడు, మిమ్మల్ని కలుసు కోవాలిట."

సావన్ వులిక్కిపడ్డాడు. మేనేజర్ ముకుందం గుర్తుకు వచ్చాడు. ఇప్పుడతనికి బిజినెస్‌లో ఇంట్రెస్టు

లేదు. "రమ్మను" అన్నాడు వినుగ్గా. నాగేష్ వెను దిరిగాడు.

సావన్ గడియారం చూసుకున్నాడు. 9-17. మేనేజర్ని 11-00కి రమ్మన్నాడు, అప్పుడే ఎందుకొచ్చాడు?

"గుడ్ మార్నింగ్, మిస్టర్ సావన్ కుమార్!" ఒక గొంతు పలికింది. "హౌ ఆర్ యూ?"

సావన్ తలెత్తి చూసి ముఖం చిట్లించాడు. ఎవరితను?

"మీట్ మిస్టర్ గోవింద్ రావ్ ఫ్రం హైద్రాబాద్" అన్నాడా మనిషి చెయ్యి జాపి. సావన్ పరధ్యానంగా షేకాండిచ్చాడు.

ఆ మనిషి వెనక్కి తిరిగి నాగేష్ని చూశాడు. "కుమార్, దిసీజ్ టాప్ సీక్రెట్. ఆ కుర్రాడ్ని వెళ్ళమను."

సావన్ పూర్తిగా స్పృహలోకి వచ్చి మండిపడ్డాడు. ఎవరీ మెదకులేని అగంతకుడు? తనని ఏకవచనంతో సంబోధిస్తున్నాడు?

ఆ అగంతకుడిని ఒక్క క్షణం చూసి, చెయ్యెత్తి వెళ్ళమన్నట్లు నాగేష్కి సైగ చేశాడు. నాగేష్ అదోలా చూసి వెళ్ళిపోయాడు.

ఆ అగంతకుడికి యాభై ఏళ్ళుంటాయి. వెడల్పాటి అతని ముఖం కండ బలిసి వుంది. పెదవడకి రెండు బంగారపు కట్టుడు పళ్ళున్నాయి. బట్టతల. ముదురు గోధుమ రంగు. గుండ్రటి గోధుమరంగు కళ్ళు అతను అపాయకరమైనవాడని చెప్తున్నాయి. ముఖమేగాక దేహం కూడా బాగా కండ బలిసి వుంది. తెల్లటి పాంటు, షర్టుపైన నల్లటి కోటు, బూట్లు ధరించాడు.

"నీతో పరిచయం లేదు, ఎవర్నువ్వు?" సావన్ అడిగాడు కోపంగా.

ఆగంతకుడు నవ్వాడు. "షీలా చాలా అందమైనది కదూ?"

సావన్ ముఖంలో రక్తం వేగంగా ప్రవహించింది. అతని ఎర్రబడ్డ ముఖాన్ని చూసి నవ్వుతుని ఆగంతకుడు తాపీగా సోఫాలో కూచున్నాడు.

"రాత్రి ఆమెతో ఎలా వుంది కుమార్?"

సావన్ నరాలు బిగదీసుకుపోయాయి. గొంతు పెగల్లేదు.

"ఏమిటి నువ్వనేది?"

ఆగంతకుడు కోటు జేబులోంచి ఒక కవరు తీసి టీపాయ్ పైన పెట్టాడు. సావన్ దాన్ని చటుక్కున అందుకుని తెరిచాడు. నాలుగు ఫోటోలు అందులోంచి జారి వొళ్ళో పడ్డాయి. సావన్ అదిరిపడ్డాడు. భయంకరంగా అరిచాడు.

'రాత్రి తీశాను, షీలా సహాయంతో. షేడ్స్ చక్కగా వచ్చాయి కదూ?"

"షీలా సహాయంతోనా?"

"అవును."

"అంటే—ఆమే, నువ్వూ..."

"అవును, ఈ బిజినెస్‌లో షీలా నేనూ పార్ట్‌నర్స్. మరో విషయం, ఆమె పేరు షీలా కాదు. వనజ. ఆమె వూరు మద్రాసు కాదు, వరంగల్. ఆమె తమిళియన్ కాదు, తెలుగు అమ్మాయి. ఆ సర్టిఫికెట్స్ షీలా అనే అమ్మాయి దగ్గర తస్కరించినవి. ఇంకో నిజం చెప్పా

లంటే ఆమె నా లవర్. ఇంకా పచ్చి నిజం చెప్పాలంటే ఆమె కాల్ గర్ల్."

సావన్ తటాలున లేచి ఆగంతకుని మీదికి లంఘించాడు.

"నన్ను నాశనం చేశావు! అపవిత్రుడ్ని చేశావు! నిన్ను చంపుతాను!"

ఆగంతకుడు పెద్ద పెట్టున నవ్వు ప్రారంభించాడు. సావన్ని వెనక్కి తోసి, నవ్వాపుకుని, "నువ్వు ఆడదానివి కావు, అవునా?" అన్నాడు. "మగాడివి! మగాడికి పవిత్రత ఏమిటి? శీలం ఏమిటి? కుమార్, ఈ రెండూ మగాడికి వుండనవసరంలేదు. పరువు ప్రతిష్టలుంటే చాలు."

సావన్ సోఫాలో ఆయాసంతో వగరుస్తున్నాడు.

"కుమార్! వూరికే అలా రెచ్చిపోకు. వుద్రేకం చల్లార్చుకో. ప్రశాంతంగా బిజినెస్ సెటిల్ చేసుకుందాం. ఓ. కే?" ఆగంతకుడు అన్నాడు.

సావన్ చెంపలు రుద్దుకున్నాడు. "ఆల్ రైట్, యూ బ్లాక్ మెయిలర్. ఎంత కావాలి నీకు?"

"రెండు లక్షలు."

"రెండు లక్షలు చాలా ఎక్కువ."

"నీ పరువుకంటే కాదు."

"నేను డబ్బు యివ్వకపోతే?"

ఆగంతకుడు వెనక్కి వాలాడు. "చూడు కుమార్! నేనెప్పుడూ ఫ్రాంక్ గా వుంటాను. డబ్బివ్వకపోతే ఫోటోలు మీ డాడీకి చేరతాయి ఆయన దగ్గర నాలుగు లక్షలు బిజినెస్ చేస్తాను."

సావన్ మళ్ళీ ఫోటోలందుకుని చూశాడు, షీలా!

ఎంత తెలివిగా మోసం చేసింది. ఎంత చక్కగా నటించింది!

"కుమార్, వనజ నీతో పరిచయమైనప్పటినుంచీ నేను కెమేరా పట్టుకుని తిరుగుతున్నాను" మళ్ళీ అన్నాడు బ్లాకుమెయిలర్. "ఎంతకీ నువ్వు రంగంలో దిగడంలేదు! చాలా విసిగిపోయాను కుమార్!"

సావన్ తేరుకున్నాడు. "నెగటివ్స్ యెక్కడ వున్నాయి?"

"నీచేతికి చిక్కనిచోట. బ్యాంకు లాకరులో."

"ఏ బ్యాంకులో? ఎప్పుడు దాచావు?"

"ఉదయమే పోస్టు చేశాను. నేషనల్ బ్యాంకు, ఆబిడ్స్, హైదరాబాద్. అక్కడ నాకో లాకరుంది. ఆ కవరుని అందులో భద్రపరచమని వ్రాశాను. ఈసమాచారం నీకే విధంగానూ ఉపయోగపడదు కుమార్."

సావన్ సాలోచనగా తలూపాడు.

బ్లాకుమెయిలర్ యింకా యిలా అన్నాడు. "నేను ఫ్రాంక్ గా వుంటానని ముందే చెప్పాను. నువ్వేదేనా పథకాలు వేస్తుంటే విరమించుకోవడం మంచిది. లాకర్లో వున్న ఆ కవర్ని నేను చనిపోయిన పక్షంలో తెరవమని ఆదేశమిచ్చాను."

సావన్ ఉలికిపడ్డాడు. అంతలోనే నెమ్మదిపడి, "సరే నువ్వు చచ్చాక బ్యాంకువాళ్ళు ఆ కవర్ తెరుస్తారు. తెరిచి ఏం చేస్తారు? బూతు ఫోటోలని నాశనంచేస్తారు" అన్నాడు.

బ్లాక్ మెయిలర్ నవ్వాడు. "నీకింకా స్పష్టంగా చెప్పలేదు. ఒకవేళ నేను చస్తే ఆ కవరు బ్యాంకువాళ్లు విప్పుతారు. ఆ కవర్లో ఒక ఉత్తరమూ మరో కవరూ

వుంటుంది. ఈ రెండవ కవరులో నెగటివ్ లూ, కాపీలూ వుంటాయి. ఈ రెండవకవరు వాళ్ళు విప్పరు. అర్థమయిందా? నేనా ఉత్తరంలో వ్రాసిన ప్రకారం మీ డాడీకి పోస్టు చేస్తారు.''

''ఇలా ఇంకెందరి కవర్లున్నాయి, లాకరులో?''

''నాకు తెలియదు. చాలా వున్నాయి. ఎన్నడూ లెక్కించలేదు. కుమార్, ఆ కవర్స్ లాకరులోవున్నంత వరకు నా ప్రాణాలకి రక్షణ వుంటుంది. ఒకవేళ నేను ఛస్తే ఆ కవర్స్ మీ బ్రతుకుల్ని నాశనం చేస్తాయి.''

సావన్ ఉగ్రుడయ్యాడు. ''పిచ్చిగా మాట్లాడుతూ వున్నావు! నీ క్లయింట్స్ నిన్ను చంపుతారన్న భయంతో వాటిని దాచావు. కానీ నువ్వు ఎవరూ చంపకుండానే చావచ్చు. నీ శరీరంలో చాల కొవ్వువుంది. ఏ క్షణాన అయినా గుండె ఆగి చావచ్చు! రోడ్డు దాటుతుండగా బస్సుకిందపడి చావవచ్చు. కారు డ్రయివ్ చేస్తూ ఆక్సిడెంట్ చేయవచ్చు...ఏ రూపంలోనయినా నీకు చావు ముంచుకు రావచ్చు.''

బ్లాక్ మెయిలర్ మళ్ళీనవ్వాడు. ''నీకు మరో విషయం స్పష్టం చేయాలి. నాకు యే రూపంలోనయినా చావు రావచ్చు. ఏ రూపంలో వచ్చినా దానిమీద దర్యాప్తు సాగుతుంది. అది ఆక్సిడెంట్ కాక హత్య అని తేలితే మీరంతా బజారున పడతారు.''

''ఒకడు చేసిన నేరానికి అందరూ ఎందుకు బజారున పడాలి?''

''వాళ్ళంతా అతనికిశత్రువులయ్యేందుకు! అర్థమైందా! కాబట్టి ఎవరూ నన్ను చంపే ప్రయత్నం చేయరు. ఆ

నెగటివ్స్ సురక్షితంగా వుంటాయి. నేనూ, మీరూ సుర క్షితంగా వుంటాం!"

"బాస్టర్డ్! తెలివయిన ప్లాను వేశావు!"

"పెద్దవాడ్ని అలా తిట్టకు. నా ప్లాన్లు అలాగే వుంటాయి."

"మంచిది. ఒక వేళ నేను డబ్బివ్వకపోతే, పోలీసులకి తెలియజేస్తే?"

"అలా చేస్తావా? ఈ ఫోటోలు మీ డాడీ చేతిలో పడతాయని తెలిస్తే చేయవనుకుంటాను."

సావన్ నిట్టూర్చాడు.

"కుమార్, ఇక బయటపడే మార్గాలు లేవు—డబ్బు చెల్లిస్తే తప్ప!"

"బాస్టర్డ్ డబ్బు ముట్టాక వూరుకుంటావని గ్యారంటీ ఏమిటి? నెగటివ్స్ నీ దగ్గరే వుంటాయి. మళ్ళీ మళ్ళీ రావని నమ్మక మేమిటి?" సావన్ అడిగాడు ఆవేశంగా.

"నా వృత్తికి కొన్ని నియమాలున్నాయి. వాటిని కచ్చితంగా పాటిస్తాను. నన్ను పూర్తిగా నమ్మవచ్చు కుమార్, ఈ విషయంలో పొరపాటులేదు. నేను ఒకే సారి డబ్బు తీసుకుంటాను" మృదువుగా అన్నాడు బ్లాక్ మెయిలర్.

"కానీ నువ్వు అత్యాశకి పోతున్నావు. అంతడబ్బు నేనివ్వలేను!"

బ్లాక్ మెయిలర్ లేచి టైం చూసుకున్నాడు. "సరే, కుమార్ ఇప్పుడు పదిన్నర అవుతోంది. ఈవూళ్ళో నేను సాయంత్రం అయిదు గంటలవరకూ వుంటాను. ఈలోపు ఆలోచించి ఏ విషయిం తెలియచెయ్. హోటల్ నర్తకి,

రూం నెంబర్ ట్వెంటీఫోర్."

బ్లాక్ మెయిలర్ చకచక బయటకి నడిచాడు.

## 7

పదకొండు గంటలకు ఏ బి సి వ్యవహారం ఎలాగో ముగించి తిరిగి ఆలోచనల్లో పడ్డాడు సావన్.

రెండు లక్షలు.

బయటపడే మార్గాలు లేవు—డబ్బు చెల్లిస్తేనే తప్ప! సావన్‌కి మతిపోతోంది. బ్లాక్ మెయిలర్‌కు డబ్బు ఎక్కడనుంచి తేవాలి? డాడీకి తెలియకుండా ఎలా ఇవ్వాలి? ఒకవేళ ధైర్యంచేసి ఇస్తే లెక్కలెలా చూపించాలి? తప్పుడు లెక్కలు చూపించాలా? సావన్ ఉలికి పడ్డాడు. డాడీ దగ్గర కొమ్ములు తిరిగిన ఆడిటర్సున్నారు! సావన్‌కి అసహనం ఎక్కువైంది. ఇప్పుడేం చేయాలి? ఇలాటి చిక్కులో పడతాడని తానెన్నడూ అనుకోలేదు. ఇంత ఘోరంగా మోసపోతాడని అసలు వూహించలేదు.

నెవర్ లవ్ ఎ స్ట్రేంజర్! నాగేష్ చెప్పిన మాటలు, చేసిన హెచ్చరికలూ ఒక్కొక్కటి జ్ఞాపకం వస్తూంటే ఏడుపు ముంచుకు రాసాగింది. తన ఉన్నత ఆశయాలను నియమాలనూ, సాంప్రదాయాలనూ కేవలం ఒకే ఒక్క రాత్రి ఒక కాల్ గర్ల్ దగ్గర కడిగేసుకున్నాడా!

ఇలాటి పరిస్థితుల్లో చావుతప్ప మరో గత్యంతరంలేదు. ఇంత ఘోరంగా ఓడిపోయాక బ్రతకడానికి ఆత్మాభిమానం ఒప్పుకోడంలేదు!

బెడ్ మీద రెండు నిముషాలుకూచుని ఆలోచించాడు. ఆ తర్వాత ఫోటోల్ని తగలబెట్టాడు. అప్పుడే ఒక మెరుపు మెరిసింది మెదడులో. గుండె వేగంగా కొట్టుకుంది...

గోవిందరావ్ బ్లాక్ మెయిల్ కోసం ఆ లాకర్ ఉప యోగించుకుంటున్నాడని బ్యాంక్‌కి ఉత్తరం వ్రాస్తే? గోవిందరావ్ గుట్టు బయటపడుతుంది. బ్యాంక్ వాళ్ళు అతన్ని పోలీసుల కప్పగిస్తారు!

మరుక్షణం సావన్ కొయ్యబారి పోయాడు.

అతను బ్లాక్ మెయిల్ చేస్తున్నాడని ఆధారమేమిటి? ఫోటోలు! కానీ...కానీ...క్షణం క్రితం ఆ ఫోటోల్ని తను తగులబెట్టేశాడు. లాకర్‌లోవున్న కవర్లని బ్యాంకు వాళ్ళు గోవింద్ చచ్చేవరకూ తెరవరు!

ఇక లాభంలేదు! తనకంటే వాడికి చాలా తెలివుంది. వాడి పథకంలో లోపం తను కనిపెట్టలేదు. తను ఓట మిని అంగీకరించాలి. అంటే రెండు లక్షలు యివ్వాలి. లేదా వాడీ విధించే శిక్షకు సిద్ధంకావాలి. కానీ, ఈ రెండూ తనవల్లకావు. తనవల్ల ఈ పరిస్థితిలో సాధ్య మయ్యేది ఒక్కటే ఒకటి: ఆత్మహత్య.

"సార్" విన్పించాయి మాటలు.

సావన్ విసురుగా తలెత్తిచూశాడు. గుమ్మంలో నాగేష్.

"సార్, మీరేమి భయపడకండి. అంతా సవ్యంగా జరుగుతుంది."

సావన్‌కి మతిపోయింది. నాగేష్! బ్లాక్ మెయిల్ గురించి వాడికి తెలిసిపోయింది.

తేరుకుని, "ఏమిటి సవ్యంగా జరుగుతుంది?" అని గొణిగాడు.

నాగేష్ లోనికి వచ్చాడు. "సార్, నా దగ్గర ఒక పథకం వుంది."

"ఏమిటి నాగేష్ నువ్వానేది?"

నాగేష్ నవ్వాడు. "నేను అంతా విన్నాను సార్, క్షమించండి."

సావన్ జుత్తు పీక్కున్నాడు. "ఇప్పుడే ప్రథకమూ పనికిరాదు నాగేష్! ఆ నెగటివ్స్ మన అందుబాటులో లేవు."

"బ్లాక్ మెయిలర్ మన అందుబాటులో వున్నాడుకదా సార్?"

సావన్ విసురుగా తలెత్తి చూశాడు. నాగేష్ గొంతులోని గాంభీర్యం అతన్ని గాభరా పెట్టింది. "ఏమిటి నాగేష్?"

"నెగటివ్స్ ఇచ్చేయమని వాడ్ని ఒప్పిస్తాను సార్" నిర్లక్ష్యంగా అన్నాడు నాగేష్.

సావన్ మరింత కంగారు పడ్డాడు. "ఏమిటి వాగుతున్నావ్? వాడ్ని ఒప్పిస్తావా? వాడేం పసివాడుకాదు నాగేష్ బుజ్జగించడానికి."

నాగేష్ సీరియస్‌గా అన్నాడు. "నేను సహాయం చేయాలంటారా లేదా"

"ఎలా సహాయం చేస్తావు నాగేష్? నీకు మతి పోయింది!"

నాగేష్ తన దృఢమైన చేతులు చాచాడు. "వీటి సహాయంతో. ఈ చేతులతో. వాడివొళ్ళు కొవ్వుబలిసి వుంది. బలంలేదు. నా చేతులు వాడి వొంటిమీద పడ్డాయంటే ఏ పనయినా చేస్తాడు సార్!"

సావన్ గుండెలు అదిరాయి. గోవింద్ మాటలు గుర్తొచ్చాయి.

'నేను ఛస్తే మీరు బజారున పడతారు!'

"నాగేష్, ఆ ఫోటోలు, నెగటివ్స్ ఇప్పుడు పోస్టులో వున్నాయి."

నాగేష్ తల యెగిరేశాడు. "బ్యాంకికు ఉత్తరం వ్రాయమని చెప్తాను. ఆ నెగటివ్స్ ఇక్కడికి వస్తాయి."

నాగేష్ గొంతులో ధైర్యానికి సావన్ తేరుకున్నాడు "సరే, నీ పథకం ఏమిటో చెప్పు. ఆలోచిస్తాను."

"సార్, బ్యాంకువాళ్ళకి గోవింద్ వ్రాస్తున్నట్లు ఒక ఉత్తరం టైప్ చేయండి. ఆ ఉత్తరంలో తను ఈరోజు ఒక కవరు పోస్టుచేసినట్టూ, అది అందిన వెంటనే విప్పకుండా మీ పేర్న ఈ అడ్రసుకు తిప్పి పంపమనీ రాయండి. కింద ఈ బంగళా అడ్రసు ఇవ్వండి ఆ తర్వాత గోవింద్‌ని పిలవండి. నేను సంతకం చేయించి పోస్టుచేస్తాను, ఆ నెగటివ్స్ మనకి అందేవరకూ వాడ్ని యిక్కడ బంధించి వుంచుతాను."

"అంత సులభమా?"

"వాడిచేత సంతకంచేయించడం సమస్య కాదుసార్," నాగేష్ అన్నాను నిర్లక్ష్యంగా. "యాభయ్యేళ్ళ ముసలి వాడు! నాచేతి దెబ్బలు పది పడ్డాయంటే వరసగా వంద సంతకాలు చేస్తాడు."

"నాగేష్, వాడు సంతకం చేయకపోతే లేదా, దెబ్బలాటలో ఛస్తే పరిస్థితి మరింత తీవ్రమవుతుంది. నీ ప్లానులో చాలా రిస్కువుంది. లేదు నాగేష్ లేదు, ఇదంతా—"

"సార్-సార్-సార్! ఇదంతా సవ్యంగా జరుగుతుంది! వాడు నా చేతులో తన్నులు మాత్రమే తింటాడు. చావడు. వాడి వయసు యాభై, నా వయసు యిరవై. వాడి దగ్గర బుద్ధిబలం వుంది, నా దగ్గర కండబలంవుంది.

సంతకం చేయిస్తాను. చేసి తీరతాడు! మీరు వాడ్ని పిలవండి."

సావన్ ఇక ఆలోచించకుండా వెళ్ళి ఆ తరం పైపు చేశాడు. ఆ తర్వాత హోటల్ నరకికి ఫోనుచేసి రూం ట్వంటీఫోరుకి కనెక్ట్ నిమ్మని అడిగాడు. ఒక నిముషం తర్వాత గోవింద్ గొంతు పలికింది.

"సావన్ మాట్లాడుతున్నాను. ఈ బిజినెస్ నేను గెలవలేనని నువ్వు చెప్పావు. యూ ఆర్ కరెక్ట్. ఓటమి నంగీకరిస్తున్నాను' ఎంతో బాధగా అన్నాడు సావన్.

"ఓ. కే." గోవింద్ అన్నాడు. "నువ్వలా ఫ్రాంకుగా మనస్ఫూర్తిగా ఓటమిని అంగీకరిస్తున్నందుకు సంతోషిస్తున్నాను. డబ్బెలా చెల్లిస్తావు?"

"చెక్కు ఇస్తాను."

"నిజం? ఈ విషయంలో మోసం లేదుకదా? కుమార్ అనుభవంగలవాడ్ని నేను చెప్తున్నాను--ఎలాంటి ఎత్తులూ వేయక! చాలా చాలా చింతిస్తావు!"

"చెక్కు ఇస్తాను."

"ఆల్ రైట్. అరగంటలో వచ్చేస్తాను రూం ఖాళీ చేసి. నీ దగ్గర చెక్కు తీసుకుని హైదరాబాద్ వెళ్ళి పోతాను." లైను కట్ అయింది.

సావన్ నిట్టూర్చి వెనక్కి తిరిగాడు. నాగేష్ కన్పించాడు. "ఏమన్నాడు సార్?"

"అరగంటలో వస్తానన్నాడు" బలహీనంగా అన్నాడు సావన్.

నాగేష్ తన చేతుల్ని చూసుకున్నాడు. "సక్సెస్ అవుతుంది సార్!"

సావన్‌కి ఏమాత్రం నమ్మకంలేదు. రెండే రెండు సంభవాలున్నాయి. మునగడం లేదా, తేలడం. ఈలాంటి వ్యవహారాల్లో తనకి అనుభవంలేదు కాబట్టి తేలడానికి కనీసం ఈతకూడా రాదు. నాగేష్ ధైర్యంచూస్తోంటే ఆశ్చర్యమేస్తుంది. తనకంటే చిన్నవాడు, తెలివి తేటలు అంతంత మాత్రం కానీ ధైర్యం మాత్రం తనకి మించింది వుంది.

'...పది దెబ్బలు పడ్డాయంటే వరసగా వంద సంతకాలు చేస్తాడు.'

ఈ నాగేష్ మాటలు సావన్‌కి జ్ఞాపకంవచ్చి అతన్ని చూశాడు. నిజంగా నాగేష్ ఈ సమస్యని సాధిస్తాడని నమ్మకం ఏర్పడింది.

సరిగ్గా మూడుగంటలకి బయట కారాగిన శబ్దం విన్పించింది.

సావన్ తేరుకుని గాభరాగా అన్నాడు "వచ్చేడు!"

నాగేష్ తలుపు దగ్గరికెళ్ళి చేతులు కట్టుకుని నిలబడ్డాడు. సావన్ అటూ యిటూ చూసి నాగేష్‌ని చూశాడు వణుకుతున్న కాళ్ళతో గాభరాగా.

"ధైర్యం సార్, ధైర్యం!"

బయట అడుగుల అలికిడయింది. సావన్ లోతుగా వూపిరి పీల్చి వదిలాడు. రెండునిముషాల్లో గోవింద్ గదిలో ప్రత్యక్షమయ్యాడు.

"హల్లో కుమార్! ఐయామ్ వెరీ గ్లాడ్! కమాన్! లెటజ్ సెటిల్ ది బిజినెస్!" సోఫాలో తాపీగా కూచోని అన్నాడతను.

సావన్ అతని కెదురుగా కూచున్నాడు. గోవింద్

వెనక్కి తిరిగి నాగేష్‌ని చూసి, "కుమార్, దిసీజ్ టాప్ సీక్రెట్! ఆ కుర్రాడ్ని వెళ్ళమను!" అన్నాడు.

సావన్ చిన్నగా నవ్వాడు. "అవసరంలేదు. గోవింద్, ఇప్పుడు పరిస్థితి మారింది. ఈ వుత్తరం మీద నువ్వు సంతకం చెయ్యాలి. నేను చెక్కు ఇవ్వడం లేదు."

గోవింద్ ముఖంలో వేగంగా రంగులు మారాయి. కళ్ళు చీల్చి చూశాడు.

"ఏమిటి కుమార్! నీ మెదడు సరిగా వుందా? యూ డర్టీ రోగ్! నేను ఎవర్ననుకుంటున్నావు? నా షరతులేమిటనుకుంటున్నావు? గుర్తు తెచ్చుకో!"

సావన్ గట్టిగా నవ్వాడు. "పరిస్థితి మారింది గోవింద్! ఆ వుత్తరంమీద సంతకం చేసెయ్. క్షేమంగా వుంటావు, లేదా—"

"లేదా...?" వ్యంగ్యంగా అడిగాడతను.

"ఆ కుర్రాడు రంగంలో దిగుతాడు. నువ్వు చావకుండా బ్రతకకుండా కొడతాడు. హింస నాకు నచ్చదు గోవింద్. గెలుపు నాది, ఓటమి అంగీకరించి సంతకం పెట్టేయ్!" అర్చాడు సావన్.

అతని అరుపుకి కొయ్యబారిపోయి చూశాడు గోవింద్. ఆ తర్వాత ఉత్తరం అందుకుని చదివాడు.

"ఓ. కే. కుమార్! పరిస్థితి అర్థమైంది. నువ్వు నాకు లొంగకుండా ఎత్తులు వేస్తున్నావు. ఇక నా పని ఆ నెగెటివ్స్‌ని మీ డాడీకి..."

"షటప్! సంతకం చెయ్యి!"

గోవింద్ లేచి వాచీ చూసుకున్నాడు. "నాకు టైం అవుతుంది. వెళుతున్నాను. సావన్, మీ డాడీతోనే బిజినెస్ మాట్లాడతాను..."

విచారంగా తల వంచుకుని బయటికి అడుగు లేశా డతను.

"ఎక్కడికి?" నాగేష్ అడిగాడు అడ్డువచ్చి.

"గెటవే!" అతన్ని పక్కకు తోసి ముందుకి నడిచాడు గోవింద్.

వెనక నుంచి నాగేష్ అతని చెయ్యి పట్టుకుని వేగంగా గిరగిర తిప్పి వదిలేశాడు. గోవింద్ విసురుగా వెళ్ళి గోడకి గుద్దుకున్నాడు. కెవ్వుమని అరిచి ముఖం పట్టుకున్నాడు. అతని రెండు బంగారపు కట్టుడు పళ్ళు వూడి కింద పడ్డాయి. రక్తం వస్తోంది.

సావన్ కంగారుగా బయటికి వచ్చాడు. "నాగేష్! అతన్ని కొట్టకు!"

"సార్, మీరు లోనికి వెళ్ళండి. కమాన్, ఏయ్ బ్లాక్ మెయిలర్! సంతకం! సంతకం ప్లీజ్!" నాగేష్ గోవింద్ దగ్గరికి నడిచాడు.

గోవింద్ తల ఎత్తి చూసి, "మొగాడ్! నన్ను కొట్టావు. నీ అంతు చూస్తాను!" అనరిచాడు.

నాగేష్ నవ్వాడు. "అలాగే...అలాగే...ముందు లేచి ఆ పళ్ళు ఏరుకో! గెటప్! మర్యాదగా వచ్చి సంతకం పెట్టు. లేదా..."

గోవింద్ హఠాత్తుగా లేచి నాగేష్ దవడ మీద గుద్దాడు. నాగేష్ కీచుమని అరిచి వెనక్కి పడ్డాడు. గోవింద్ మెట్ల వేపు దూకి గబగబ దిగసాగాడు.

సావన్ కొయ్యబారిపోయి చూస్తున్నాడు.

పరిస్థితి గ్రహించి నాగేష్ తటాలున మెట్లమీద గోవింద్ పక్కన దూకాడు. ఇద్దరూ కింద హాల్లోకి దొర్లారు. నాగేష్, గోవింద్ ఛాతీమీద కూచుని పిడికిళ్ళ

బిగించి అతని ముఖం మీద బాదసాగాడు. గోవింద్ ప్రాపిరాడక తన్నుకుంటున్నాడు.

"నాగేష్! నాగేష్! ఆపు! వాడు ఛస్తాడు!" సావన్ అరుపుకి తెలివిలోకి వచ్చాడు నాగేష్. అతని మీదనుంచి లేచి కాలితో తన్నాడు. "లే!"

గోవింద్ లేవలేదు. బాధగా మూల్గుతున్నాడు. నాగేష్ అతని కాలరు పుచ్చుకుని లేపి నిలబెట్టాడు. సావన్ అక్కడికి పరిగెత్తి వచ్చాడు.

"గోవింద్! ముందే చెప్పాను, నీ దగ్గర బలం లేదు. అనవసరంగా దెబ్బలెందుకు తింటావు! సంతకం చేసేయ్" సావన్ నచ్చచెప్పాడు.

గోవింద్ అడ్డంగా తలూపాడు. "నో! ఆ నెగటివ్స్ నాకు రక్షణ కల్పిస్తాయి. కుమార్, నీకు మరో విషయం చెప్పాలి. నాకు గుండెజబ్బు వుంది. మూడుసార్లు స్ట్రోక్ వచ్చింది. దేహానికి శ్రమ ఇవ్వకూడదన్నాడు డాక్టరు. ఈ కోతిగాడు నన్ను కొట్టాడు. ఆల్ రైట్! నేనుచావా లనుకుంటే కొట్టమను!"

నాగేష్ చెయ్యి లేపాడు. సావన్ చటుక్కున నాగేష్‌ని ఆపాడు. "ప్లీజ్ గోవింద్, సంతకం చెయ్. నిన్ను వదిలేస్తాం."

గోవింద్ నవ్వాడు. "నేను సంతకం చేయను. మీరేం చేస్తారో చేసుకోండి. కొట్టండి, చంపుకోండి, చావండి! సంతకం మాత్రం చేయను. కానీ ఒక చిన్న సలహా ఇస్తాను, నా సంతకం ఫోర్జ్ చేయండి దమ్ములుంటే!"

సావన్ నాగేష్‌ని చూశాడు.

నాగేష్ తలూపి గోవింద్ దగ్గరికి వెళ్ళి కోటు విప్పి జేబులు గాలించాడు. కుడి జేబులోంచి ఒక బ్లాంక్

చెక్కు తీసి సావన్ కి అందించాడు. ఆ తర్వాత గోవింద్ ని ముందుకు నెట్టి "నువ్వు మేం వదిలేస్తే తప్ప వెళ్ళలేవు, నడువ్!" అని కసిరాడు.

నాగేష్ దెబ్బలకి ఆయాసంగా వగరుస్తూ, మూల్గుతూ బ్లాక్ మెయిలర్ నాగేష్ వెంట బయటికి నడిచాడు.

సావన్ ఆ చెక్కును చూశాడు. దానిమీద గోవింద రావు సంతకం వుంది. ఇక ఫోర్జరీ మిగిలిందన్నమాట! ఓహ్...ఏమిటీ అడుగడుగున ఆటంకాలు!

నాగేష్ తిరిగి వచ్చాడు. "వాడిక లేవలేడు సార్, రెస్టు తీసుకోమన్నాను."

"ఎక్కడున్నాడు?"

"గ్యారేజిలో. తప్పించుకోలేడు సార్. ఇనప తలుపులు తెరవలేడు. వెంటిలేటర్ వూచలు వంచలేడు. వంచినా అందులో ఇరుక్కుంటాడు!" నవ్వాడు నాగేష్ గర్వంగా. "సార్, వాడ్ని కొడుతూ కాలం వృధా చేసే కంటే ఆ వుత్తరం మీద వాడి సంతకం ఫోర్జరీ చేయడం మంచిది. ఇది చాలా డేంజరు. అయినా ప్రయత్నించక తప్పదు. నేను ఆచారి దగ్గరి కెళతాను సార్."

సావన్ మాట్లాడలేదు.

"భయం లేదు సార్. ఆచారి నమ్మకమైనవాడు. ఆ వుత్తరం ఇలా ఇవ్వండి. అతనికి కొందరు ఫోర్జర్స్ తెలుసు. గోవింద్ సంతకం ఫోర్జ్ చేయడం కష్టం కాదు. రెండు వేలకి చెక్కు ఇవ్వండి."

ఇక మాట్లాడలేదు సావన్. చెప్పినట్లు చేశాడు.

"నాగేష్ త్వరగా వచ్చేయ్. నేనిక్కడ ఒంటరిగా వుండలేను."

"అలాగే సార్, భయపడకండి. అంతా సవ్యంగా జరుగుతుంది."

సావన్ మెరుస్తున్న నాగేష్ కళ్ళల్లోకి చూశాడు.

"సార్, ఈ గ్యారేజి తాళాలు మీ దగ్గర వుంచండి" నాగేష్ వెనక్కి తిరిగి వెళ్ళిపోయాడు.

## ౮

సాయంత్రం ఏడుగంటలయినా నాగేష్ జాడ లేదు.

కిటికీ దగ్గర కూచున్న సావన్ కి బయట ఏమీ కన్పించడం లేదు. చంద్రుడు ఇంకా రాలేదు. గుండెలు హడలెత్తించే సముద్రపు హోరు తప్ప బంగళాలో భయంకరమైన నిశ్శబ్దం తాండవిస్తోంది.

రకరకాలుగా అనుమానాలూ, భయాలూ సావన్ ని ఆవహించుకున్నాయి. నాగేష్ ఇంకా ఎందుకు రాలేదు? ఆచారి కలవలేదా? ఇప్పుడు తన ఆశలన్నీ ఆ ఫోర్జరీమీదే వున్నాయి. ఈ ఫోర్జరీ గనుక బెడిసికొడితే తన సర్వనాశనం తప్పదు.

గోవింద్ జ్ఞాపకం వచ్చాడు. నాగేష్ అతన్ని కొట్టిన దెబ్బలు జ్ఞాపకం వచ్చాయి. సావన్ నిలువునా వణికిపోయాడు. నిజంగా వాడికి గుండెజబ్బు వుందా? లేక దెబ్బలు తప్పించుకోడానికి బుకాయించాడా? లేదు, నిజంగా వాడికా జబ్బు వుండి వుంటుంది. ఆ విషయం వాడు చెప్పకపోతే చచ్చేవాడే!

సావన్ ఉలిక్కిపడ్డాడు. గ్యారేజిలో గోవింద్ ఏం చేస్తున్నాడు? తప్పించుకునే ప్రయత్నం చేస్తున్నాడా? సావన్ గభాల్న లేచి తలుపు లోపల గడియపెట్టాడు.

వాడు తప్పించుకుంటే తన దగ్గరికే వస్తాడు. నాగేష్ లేకుండా తను వాడ్ని ఎదుర్కోలేడు. నాగేష్ ఎప్పుడు

వస్తాడు? ఈ భయంకరమైన ఒంటరితనం నుంచి విముక్తి కలిగే దెప్పుడు?

అకస్మాత్తుగా బయట రకరకాల చప్పుళ్ళు పెద్ద పెట్టున ప్రారంభమయ్యాయి.

సావన్ నిశ్చేష్టుడయ్యాడు.

గ్యారేజి తలుపులు శబ్దం చేస్తున్నాయి. గోవింద్ తన శక్తికొద్దీ వాటిమీద బాదుతున్నాడు! పగలగొట్టి బయటకి వచ్చేస్తాడు.

చప్పుళ్ళు ఇంకా ఎక్కువయ్యాయి. సావన్ తేరుకుని గ్యారేజి వేపుకు పరిగెత్తాడు.

వాడ్ని బయటకి రానీయకుండా చేయాలి. వాడి ప్రయత్నాలు మాన్పించాలి. గ్యారేజి తలుపులు ముందుకీ వెనక్కీ వూగుతున్నాయి.

"గోవింద్! గోవింద్, ఏం చేస్తున్నావ్?"

"నన్ను బయటికి రానీయ్! తలుపు తెరువ్!"

"లేదు గోవింద్। నువ్వక్కడే వుండాలి. తలుపులు విరగ్గొట్టకు!"

శబ్దాలు ఇంకా ఎక్కువయ్యాయి "కుమార్, నన్ను బయటకి రానీయ్!"

"గోవింద్, నా మాట విను! నువ్విలా గొడవ చేస్తే నా గేష్ని పిలుస్తాను. నిన్ను వాడు కొట్టడం సహించలేను గోవింద్!"

"వాడెక్కడ వున్నాడు?"

"నిద్రపోతున్నాడు. ఈ చప్పుళ్ళకి మేల్కొన్నాడంటే నీ వొళ్ళు హూనమవుతుంది."

"అబ్బా! కుమార్! గుండె...నాగుండె"

"గోవింద్!"

"కుమార్...హాల్లో సోఫాలో కోటు జేబులో టాబ్లెట్స్ సీసావుంది. ప్లీజ్, ప్లీజ్ కుమార్! తీసుకురా!"

సావన్ పిచ్చివాడిలా ఇంట్లో కురికాడు. హాల్లోసోఫా మీద గోవింద్ కోటు కన్పించింది. జేబులు వెతికాడు. ఒకసీసా దొరికింది. దాన్ని చూశాడు. లేబిల్ లేదు. లోన తెల్లటి మాత్రలు వున్నాయి. అవి ఏ మాత్రలైనా కావచ్చు...నిద్ర మాత్రలు...అజీర్తి మాత్రలు.

సావన్ మాటాతుగా తేరుకున్నాడు. ఇదేదో ట్రిక్ కాదు కదా? వాడికి నిజంగా స్ట్రోకువచ్చిందా? బుకాయిస్తున్నాడా? ఈసీసా అందించడానికి తనుడోర్స్ తెరిస్తే దాడి చేస్తాడా? అవును! ఇందులో మోసంవుంది. వాడికి స్ట్రోక్ రాలేదు. ఎత్తులు వేస్తున్నాడు.

గబగబ గ్యారేజి చేరుకున్నాడు. "గోవింద్, సీసా కోటులో లేదు, కారులో వుందా?"

"కోటులో వుంది! సరిగా చూడు! కుమార్ క్విక్! టాబ్లెట్స్!" గోవింద్ పెద్దగా మూల్గడం ప్రారంభించాడు. సావన్ తన చేతిలో సీసాని చూశాడు. ఆ తర్వాత గ్యారేజి తాళాల్ని చూశాడు. నో! తాళం తెరవకూడదు! సీసా అందివ్వకూడదు!

"కుమార్! ప్లీజ్ టాబ్లెట్స్."

సావన్ లో చలనం లేదు.

"కుమార్, త్వరగా! నాప్రాణం–అబ్బా. టాబ్లెట్స్ ప్లీజ్, టాబ్లెట్స్."

గోవింద్ మాటల్లో ఏడుపు ముంచుకువచ్చింది. ఉన్నట్టుండి గట్టిగా ఏడుపు ప్రారంభించాడు.

సావన్ కి పిచ్చి ఎక్కింది. భయంతో వేగంగా ఇంట్లో పురికాడు. తన గదిలో దూరి తలుపులు బిడాయించాడు.

బుకాయింపులు. వాడివన్నీ బుకాయింపులే. అంతా నటన. మోసం. ఒక వేళ నిజమైతే? వాడు స్ట్రోక్ వచ్చి ఛస్తే? చావనీ. కసిగా అనుకున్నాడు సావన్. సమాజానికి బ్లాక్ మెయిలర్స్ చీడపురుగులు.

ఆ రాత్రి క్షణికావేశానికి లొంగిపోయి తనెలాగూ నాశనమయ్యాడు. ఇప్పుడీ గోవింద్ లాటి చీడపురుగుని ఏరి పారేయడానికి తానేమైపోయినా ఫరవాలేదు. తృప్తి వుంటుంది. వాడు ఛస్తే భవిష్యత్ లో వాడి వలలో ఎవరూ చిక్కుకుండా రక్షించిన వాడవుతాడు.

హఠాత్తుగా సావన్ కి షీలా జ్ఞాపకం వచ్చింది. తనను వంచించిన ఈ కాల్ గర్ల్ ఇప్పుడెక్కడవుంది? ఏం చేస్తోంది? గోవింద్ కోసం ఎదురు చూస్తోందా? గోవింద్ ఆమెను కలుసుకోకపోతే పోలీసు రిపోర్టు యిస్తుందా? అప్పుడు...అప్పుడు...అకస్మాత్తుగా గోవింద్ యేడుపు ఆగిపోయింది. సావన్ చెవులు రిక్కించాడు. ఎలాటి అలికిడీ లేదు. వాడు చచ్చాడా? సావన్ వూపిరి బిగబట్టి కాచుకున్నాడు. ఒక నిముషం...రెండు నిముషాలు... మూడు నిముషాలు. నిశ్శబ్దం...నిశ్శబ్దం...నిశ్శబ్దం.

అంతలో నాగేష్ వచ్చాడు అక్కడికి.

“నాగేష్ ఇక లాభంలేదు. వాడు చచ్చాడు. నేనే చంపాను” ఆందోళనగా అన్నాడు.

నాగేష్ సూటిగా చూశాడు. “ఏం చేశారు సార్?”

“వాడికి స్ట్రోక్ వచ్చింది. టాబ్లెట్స్ ఇవ్వమన్నాడు. తలుపు తెరిస్తే పారిపోతాడు. నేనివ్వలేదు. వాడు చచ్చాడు.”

“పదండి, చూద్దాం.”

“నాగేష్, శవాలంటే నాకు భయం.”

నవ్వాడు నాగేష్, "వాడంత సులువుగా బకెట్ తన్నేయడు సార్. ఎత్తులు వేస్తున్నాడు, ఎత్తులు. పదండి, టార్చి ఎక్కడవుంది?"

టార్చి తీసుకుని ఇద్దరూ గ్యారేజి చేరుకున్నారు. చలీ భయం రెండూ కలిసి సావన్‌ని విపరీతంగా వణుకు పుట్టిస్తోన్నాయి.

తలుపు తాళం తీశాడు నాగేష్.

టార్చి వెలిగించి నెమ్మదిగా తలుపు నెట్టాడు. లోనికి వెలుగు వేశాడు. ఒక అడుగు లోనికి వేసి తలుపుకి యిరు పక్కలా చూశాడు. గోవింద్ లేడు. లోనికి వెళ్ళి సావన్‌ని పిల్చాడు.

టార్చి వెలుగు గ్యారేజిలో చుట్టూ ప్రసరించాడు. గోవింద్ లేడు. గ్యారేజి మూల పీపాలు, చెక్కడబ్బాలూ వున్నాయి. వాటిమీద టార్చి వేసి పరీక్షగా చూశాడు.

సావన్ వూపిరి బిగబట్టాడు. "నాగేష్, వెంటిలేటర్ చూడు."

చటుక్కున వెంటిలేటర్ మీద టార్చి వేశాడు నాగేష్. చువ్వలు వంచివున్నాయి.

హఠాత్తుగా నాగేష్ కడుపు పట్టుకుని అర్చి క్రింద పడ్డాడు. గోవింద్ రెచ్చిపోయిన ఆంబోతులా పీపాల చాటునుంచి పరిగెత్తివచ్చి నాగేష్ కడుపులో కుమ్మి గ్యారేజి బయటకి వురికాడు.

సావన్ కవ్వుమన్నాడు.

నాగేష్ లేచి బయటకి వురికాడు. ఆరడుగులదూరంలో గోవిందు వురుకుతున్నాడు.

నాగేష్ ఎగిరి అతనిమీదకి దూకి మెడపట్టుకున్నాడు. ఇద్దరూ కింద పడ్డారు. నాగేష్ చటుక్కునలేచి గోవింద్

రెండుకాళ్ళు పట్టుకుని గ్యారేజిలోకి ఈడ్చుకొచ్చేశాడు.

కళ్ళుప్పగించి చూస్తూన్నాడు సావన్.

"గోవిందు, కాచుకో. ఈ దెబ్బతో నీపని గోవిందా" నాగేష్ అరిచి గోవిందుమీదకి లంఘించాడు.

"నాగేష్, అతన్ని వదిలెయ్" సావన్ అరిచాడు గొంతు చించుకుని.

"ఏమీ కాదుసార్, వీడికి గుండెజబ్బులేదు. వొళ్ళు తిమ్మిరెక్కిందని" అని నాగేష్ గోవిందు మూతిమీద రెండు గుద్దులూ, వీపుమీద పదిగుద్దులూ, కడుపులో మూడు గుద్దులూ గుద్ది వదిలేశాడు.

గోవిందు వెల్లికిలా పడిపోయి రొప్పసాగాడు. ముఖం వాచింది. నాలిక బయట పెట్టాడు.

సావన్ గట్టిగా కళ్ళుమూసుకున్నాడు.

"హా...హా...మంచినీళ్ళు ... మంచి—" గోవిందు గొణుగుతున్నాడు.

"మంచిది" నాగేష్ అడ్డుతగిలాడు. "ఆ మాత్రం అడుగుతున్నావు, అదేచాలు."

## 9

ఆ రాత్రంతా సావన్‌కి నిద్రపట్టలేదు.

మర్నాడు ఉదయం ఎనిమిది గంటలకి మేల్కొని సిగరెట్ వెల్గించి ఆలోచించడం ప్రారంభించాడు.

రాత్రి నాగేష్ ఆ ఉత్తరంమీద గోవిందు సంతకం ఫోర్జ్ చేయించి తీసుకువచ్చాడు. ఆ సంతకంలో ఏ మాత్రం తేడా లేదు. బ్యాంకువాళ్ళు నమ్ముతారు.

ఆ ఉత్తరాన్ని ఈరోజే రిజిస్టరు పోస్టులో పంపివ్వాలి. రేపు అందుతుంది. వెంటనే బ్యాంకువాళ్ళు చర్య తీసు

వుంటారు. ఆ మర్నాడో లేక అవతలిరోజో నెగెటివ్స్ కవరు తనకి అందుతుంది. అంటే గురువారం వరకు నాలుగు రోజులు వేచివుండాలి. గోవిందుని బంధించి వుంచాలి. నెగెటివ్స్ అందాక వాడ్ని వదిలేసి హైద్రాబాదు చేరాలి బ్రతుకుజీవుడా అనుకుంటూ.

నాలుగు రోజులు! సావన్ చటుక్కున లేచి కూచు న్నాడు. నాగేష్ ట్రేతో గదిలోకి వచ్చాడు. "నాగేష్, రాత్రినుంచీ వాడేమీ తినలేదు. ఆకలితో చంపకు!" అన్నాడు సావన్.

నాగేష్ నవ్వాడు. "వాడ్ని బాగా మేపుతానుసార్!"

సావన్ కాఫీ తాగి స్నానం చేశాడు. ఆ తర్వాత ఒక కవరు మీద బ్యాంక్ అడ్రసు టైపు చేశాడు. గోవింద రావ్ వుత్తరం అందులో పెట్టి సీల్ చేశాడు. ఆ తర్వాత టిఫిన్ చేసి, తొమ్మిదిన్నరకి పోస్టాఫీసుకి బయలుదేరాడు.

పోస్టాఫీసులో ఆ ఉత్తరం రిజిస్టర్ చేయించి హోటల్ వరకి చేరుకున్నాడు. గతరోజు రూం ట్వంటీ ఫోర్లో ఎవరెవరు వున్నారో అడిగి తెలుసుకున్నాడు. గోవింద్ ఒక్కడే వున్నట్టు తెలిసింది. అయితే షీలా ఎక్కడుంది?

హైద్రాబాదు కెళ్ళి పోయిందేమో__మరో అమాయ కుడ్ని గాలించేందుకు!

సరిగా పదకొండున్నరకి తిరిగి బంగళా చేరుకున్నాడు సావన్.

పోర్టికోలో కారాపి దిగాడు. ఓ చెట్టుకింద గోవిందు ఎర్ర అంబాసిడర్ కనిపించింది.

గ్యారేజి దగ్గరికి వెళ్ళి చూశాడు. తాళంవేసి వుంది. ఇంట్లోకి ప్రవేశించి నాగేష్ కోసం కిచెన్లోకెళ్ళాడు.

కిచెన్ నిశ్శబ్దంగా వుంది. తరిగిన కూరగాయిలూ, గాలించిన బియ్యం అలాగే వున్నాయి. సావన్‌కేమీ తోచ లేదు. నాగేష్ ఎక్కడికి కెళ్ళాడు?

"నాగేష్!" సమాధానం లేదు.

సావన్ గాభరా పడ్డాడు. మళ్ళీ ఏం జరిగింది? ఆచారి దగ్గరి కెళ్ళాడా? ఎందుకు? గబగబ మెట్లెక్కి తన గది చేరుకున్నాడు.

తలుపు నెట్టి అప్రయత్నంగా ఆగిపోయాడు.

కులాసాగా సోఫాలో జారగిలబడి సిగరెట్ కాలుస్తున్నాడు గోవిందరావు.

# 10

సావన్ తల తిరిగింది. గుండెలు జారిపోయాయి.

గోవిందు నవ్వి, "కమాన్ కుమార్! ఇలా వచ్చి కూచో" అన్నాడు.

మంత్రముగ్ధుడిలా సావన్ లోనికి నడిచాడు. గోవిందు ఫకాలున నవ్వాడు.

సావన్ తెలివిలోకొచ్చాడు. పరిస్థితి గ్రహించాడు. ముఖం ఎర్రబడి పెదవులు వణకసాగాయి. "నాగేష్ ఎక్కడ?" అర్చాడతను.

గోవిందు నవ్వాడు. "పరిస్థితి మారింది, కుమార్. అలా కూచో. మాట్లాడుకుందాం."

"నాగేష్ ఎక్కడ?"

"గ్యారేజిలో. కుమార్! వాడు తెలివిగలవాడనుకోను. ఉదయం టిఫిన్ ఇవ్వడానికి వచ్చినప్పుడు తలుపుపక్కన నక్కి ఇనపరాడుతో వాడి నెత్తిమీద కొట్టి బయటికి వచ్చేశాను" తాపీగా అన్నాడు గోవిందు.

సావన్ ప్రాణాలెగిరిపోయాయ్. తానిప్పుడు ఒంటరి వాడు!

"వాడ్ని కొట్టావా?"

"గట్టిగా కాదు—కుమార్, కోతుల్ని కొట్టకూడదు! పాపం!"

సావన్ కుమార్ ఆందోళన చెందాడు.

"కుమార్! పరిస్థితి మారిందని గ్రహించే వుంటావు. ఇప్పుడు గెలుపు నా చేతిలో వుంది. నువ్వు నా షరతులు ఒప్పుకోలేదు. పైగా నన్ను డబుల్ క్రాస్ చేశావు. నిన్ను నాశనం చేయాలి. వెంటనే బ్యాంక్‌కి ఫోన్ చేసి ఆ కవర్ని మీ డాడీకి పంపివ్వమని చెప్పేయాలనుకున్నాను.

"కానీ నీమీద జాలి వేసింది. నీకు భవిష్యత్తు చాలా వుంది. నిన్ను నాశనం చేయడం మంచిది కాదను కున్నాను.మరొక్కసారి మాట్లాడి ఒప్పిద్దామనుకున్నాను. ఓ. కె. కుమార్! ఇప్పుడు చెప్పు, డబ్బిస్తావా? ఫోన్ చెయ్యమంటావా?"

సావన్ వెంటనే జాగ్రత్తపడ్డాడు. "బాస్టర్డ్! నువ్వు బ్యాంకికి ఫోన్ చేస్తే, నేను పోలీసులకి ఫోన్ చేస్తాను."

గోవిందు కొయ్యబారిపోయాడు. సావన్ అతన్ని సూటిగా చూశాడు.

"ఓహ్, కుమార్ నువ్వు ఆలోచించకుండా మాట్లాడు తున్నావు. ప్లీజ్ శాంతించు. మనం మెదడు వున్న మనుషుల్లా మాట్లాడుకుందాం. నువ్వు పోలీసుల్ని పిలిస్తే నాకెలాంటి కీడు జరగదు. చిక్కుల్లో పడేది నువ్వే. నాశనమయ్యేది నువ్వే. చెప్పు! ఎంత డబ్బిస్తావు?"

"ఇవ్వను గోవింద్!"

గోవిందు మౌనంగా కాస్సేపు సిగరెట్ పీల్చాడు.

"ఓ. కే. కుమార్! నీకు బాగా ఆలోచించడానికి టైం యిస్తున్నాను. రెండు రోజుల్లో ఏవిషయం తెలియజేయ్. నేనిప్పుడే హైద్రాబాదు వెళుతున్నాను."

"నేనింకేమీ ఆలోచించేదిలేదు గోవింద్! నువ్విప్పుడు హైద్రాబాదు వెళ్ళలేవు! బ్యాంక్‌కి ఫోన్ చెయ్, లేదా ఆ కబురు నాకందేవరకు ఆగు!"

"ఉత్తరం పోస్టు చేశావా కుమార్?"

"అవును. నాలుగు రోజుల్లో నెగెటివ్స్ కబురు వస్తుంది. అప్పటివరకు నువ్వు నా బందీవి" అన్నాడు సావన్.

సావన్ కిప్పుడు ధైర్యం కలిగింది. గోవిందు ఫోన్ జెయ్యడానికి భయపడుతున్నాడన్నది నిజం. ఇక వాడ్ని ఇక్కడ నుంచి కదలకుండా చేస్తే ఆ కబురు తనకు దక్కుతుంది.

గోవిందు కాస్సేపు ఆలోచించాడు. ఆ తర్వాత సావన్‌ని చూసి ఫకాలున నవ్వాడు.

"నువ్వెంత ఫూల్‌వి కుమార్! ఆ నెగెటివ్స్ బ్యాంక్‌లో వున్నాయనుకుంటున్నావా? నాకే బ్యాంక్‌లోనూ లాకర్ లేదు! బుకాయించాను. ఇంతకాలమూ ఆ నెగెటివ్స్ బయట నా కారులో, బ్రీఫ్ కేసులో వున్నాయి— భద్రంగా. హాహాహా హా!"

గోవిందరావు వదిలిన ఒక్కొక్క మాట సావన్ గుండెలో ఒక్కొక్క బాంబులా పేలాయి.

గోవిందు నవ్వులో వున్న వెటకారం వెన్నులోంచి చలి పుట్టుకవచ్చేలా చేసింది. సావన్‌లో చలనం లేదు. వూపిరి అందడం కష్టమైంది. క్రితంరోజు జరిగిన సంఘటనలు ఒక్కొక్కటీ కళ్ళ ముందు మెదులుతున్నాయి.

ఈ దుర్మార్గుడ్ని నాగేష్ కొడుతుంటే అన్నిసార్లూ తాను రక్షించాడు. వాడ్ని కొడితే స్ట్రోక్ వస్తుందని భయపడి ఫోర్జరీకి తలబడి రెండువేల రూపాయలు తగలేశాడు! ఇంతవరకూ బ్యాంకులో వున్నాయనుకుంటున్న నెగెటివ్స్ కోసం ఇంత తాపత్రయపడ్డాడు. చివరికి... చివరికి...ఆ నెగెటివ్స్ దిక్కుమాలిన చోట కార్లోనే పడివున్నాయి.

సావన్ కళ్లు చీకట్లు కమ్మాయి. ఏం చేయాలిప్పుడు?

హఠాత్తుగా తేరుకున్నాడు. ఆ నెగెటివ్స్ తన అందుబాటులో వున్నాయి. అదృష్టం తనవేపు వుంది. తన సూట్ కేసులో పిస్తోలు వుంది.

సావన్ తలపట్టుకుని మూల్గాడు, "అబ్బా...తల నెప్పి, ఆస్పిరిన్ ..."

గోవిందు తాపీగా నవ్వాడు. "నువ్వు శక్తికి మించి ఆలోచిస్తున్నావ్ కుమార్."

సావన్ సూట్ కేసు వేపు కదిలాడు. మూత తెరిచి పిస్తోలు తీసి గుండెల దగ్గర పెట్టుకుని అలాగే వెను తిరిగి నిలబడ్డాడు. వాడ్ని చంపెయ్యాలి! ఆ నెగెటివ్స్ తన వశమవుతాయి.

"ఏమిటి కుమార్, నెప్పి ఎక్కువైందా?"

"ఆ...వు...ను."

"నాకు చాలా విచారంగా వుంది కుమార్. ఈ బిజినెస్‌లో నువ్వు గెలవలేవని మన పరిచయం ప్రారంభమైనప్పుడే చెప్పాను. అయినా నాతో పోటీకి దిగావు. నాతో పోటీకి దిగినవారు నాశనమవుతారు. నిన్ను ఒకసారి క్షమించాను. ఇప్పుడు క్షమించేది లేదు.

నేను కోరిన డబ్బు నువ్వివ్వలేదు—ఇవ్వవు. కాబట్టి

ఆ కవరు మీ డాడీకి అందివ్వాలి. నువ్వు నాశనమవు తావు. ఈ నెగెటివ్స్ మీ డాడీ దగ్గర బేరంపెట్టి కెట్టింపు డబ్బు సంపాదిస్తాను. ఫోర్ లాక్స్! డబ్బివ్వక పోతే ఈ నెగెటివ్స్ కాపీలు తీసి అమ్ముకుంటానని బెది రిస్తాను. అప్పుడు నీతోపాటు మీ డాడీ పరువుకూడ నాశనం అవుతుంది. కాబట్టి డబ్బిస్తాడని నా నమ్మకం.''

చకచకా అడుగులేసి బయటికి నడిచాడు గోవింద రావు. ఒక్క క్షణం ఆలస్యం కాకుండా సావన్ తటా లున వెనక్కి తిరిగి పిస్తోలు గురిపెట్టి ట్రిగ్గర్ లాగాడు. గుళ్ళు లేవు.

గోవిందు తిరిగి చూసి నవ్వాడు. ''మిత్రమా, గుళ్ళు తీసేశాను. ఇక నన్నెవరూ అడ్డగించలేరు.''

సావన్ కాళ్ళకింద నేల చీలిపోయింది. పాతాళం లోకి జారిపోయాడు. ఏమిటిదంతా! అడుగడుగున ఆటం కాలు! చేయి జారిపోతున్న అవకాశాలు! ఏమిటి మార్గం? చావు ఒక్కటే మార్గమనుకుంటే పిస్తోలు ఖాళీగా...

సావన్ తల బద్దలవుతోంది. ఇక చేయవల్సిందేమీ లేదు.

బయట కారు స్టార్ట్ అయిన శబ్దం అయింది. తేరుకుని కిటికీ దగ్గరికి వురికాడు.

గోవిందరావ్ కారులో గేటు వేపుకి దూసుకు పోతున్నాడు.

సావన్ కొయ్యబారిపోయాడు. కళ్ళు రెప్పపడ్డంలేదు కాళ్ళు నేలకతుక్కుపోయాయి. మెదడు మొద్దుబారి సరీరం చెమటలు కక్కుతోంది.

''సార్!''

ఆ పిలుపుకి సావన్ వంటిమీద వేళ్ళు జెర్రులూ పాకాయి.

"సార్! భయపడకండి! అంతా సవ్యంగా జరిగి పోయింది..."

తటాలున వెనక్కి దూకాడు సావన్. "నాగేష్! నన్ను పిచ్చివాడ్ని చెయ్యకు. దయచేసి వెళ్ళిపో దూరంగా."

నాగేష్ చిన్నగా నవ్వాడు. "సార్, ఇది చూడండి" జేబులోంచి ఒక సీలుచేసిన కవరుతీసి చూపించాడు.

సావన్ చటుక్కున దాన్ని అందుకుని సీలు చించాడు. ఫోటోలూ, నెగటివ్‌లూ కిందపడ్డాయి.

నాగేష్ ముఖం తిప్పుకున్నాడు. "సార్! వెంటనే కాల్చేయండి."

సావన్ చటుక్కున సిగార్ లైటర్‌తో వాటిని తగల బెట్టాడు.

"నాగేష్: ఏమిటిది? ఎక్కడ తెచ్చావ్?"

చిన్నగా నవ్వాడు నాగేష్. "వెంటిలేటర్ లోంచి దూకి బయటకి వచ్చాను సార్. ఈ గది దగ్గరికి వచ్చి వాడి మాటలు విన్నాను. నెగటివ్స్ కారులో వున్నట్లు చెప్పాడు. తీసుకు వచ్చేశాను."

సావన్ అతని భుజాలు పట్టుకుని కుదేశాడు, "నాగేష్! నాగేష్! నిన్నెలా అభినందించాలి!"

"ఆదరించండి. నాపైన విశ్వాసముంచండి, సార్!"

"యూ ఆర్ గ్రేట్! నాగేష్, యూ ఆర్ గ్రేట్! నువ్వు లేకపోతే నేను..."

"సార్! ఏమీ దిగులుపడకండి! అనుక్షణం మిమ్మల్ని అంటిపెట్టుకుని వుంటాను."

## 55

"నాగేష్! ఇదంతా నమ్మమంటావా?"

"సార్! ఏమీ ఆలోచించకండి. అదృష్టం మనవేపు వుంది, మనం గెలిచాం! ఇదొక పీడకలగా మర్చిపొండి! విశ్రాంతి తీసుకోండి-బ్రహ్మాండమైన వంట చేస్తాను!" ఒక్క క్షణం ఆలశ్యం చేయకుండా వంటింట్లోకి పరిగెత్తాడు నాగేష్.

—: ఐపోయింది :—

# కాలభైరవస్వామి!

## శ్రీరాజ్

"డ్రైవర్!" బిగ్గరగా కేక వేశాడు విశ్వనాథరావు వరండా మెట్లు దిగుతూ.

ఓ ప్రక్కగా కూర్చుని బీడి తాగుతున్న డ్రైవర్ బీడి అవతల పారేసి, గబగబా కారు దగ్గరకు వచ్చి బాక్ డోరు తెరచి పట్టుకు నుంచున్నాడు.

విశ్వనాథరావు కారులో కూర్చోగానే డ్రైవర్ కారు స్టార్టు చేసి మెయిన్ గేటు వైపు తిప్పాడు.

కారు గేటు దాటుతూండగా కాషాయ వస్త్రాలు ధరించి, చేతిలో కమండలం, మెడలో రుద్రాక్షమాల, పొడుగాటి గడ్డంతో గంభీరంగా వున్న ఒక సాధువు కారుకి ఎదురుగా వచ్చి, ఆపమని సంజ్ఞ చేశాడు.

కారు ఆగగానే సాధువు, విశ్వనాథరావు కూచున్న వెనక సీటు దగ్గరకు వచ్చి, "మీరు యింకొక అరగంట దాకా బయటకు పోకూడదు" అన్నాడు.

'ఏం' అన్నట్లు చూశాడు చిరాగ్గా విశ్వనాథరావు.

"ఇప్పుడు సమయం ఎంత?" ప్రశ్నించాడు సాధువు.

"గం. 10-05 లు" అన్నాడు విసుగ్గా వాచీ వంక చూస్తూ.

"సరిగ్గా గం. 10-28 లకు మీ కారు ఏక్సిడెంటు అవుతుంది" అన్నాడు అతను తాపీగా.

"ఇది చెప్పటానికా కారు ఆపింది. పోయి రోడ్డు ప్రక్కన కూర్చొని చిలక జోస్యం చెప్పుకో. నాలుగు డబ్బులయినా వస్తాయి. ఫో, ఫో" అని డ్రైవర్ వైపు తిరిగి "డ్రైవర్ పోనియ్యి" అన్నాడు.

## 2

కారు స్పీడుగా వెళ్తోంది.

సమయం గం. 10-25 ని.లు అయింది.

"డ్రైవర్, ఎందుకయినా మంచిది కొంచెం మెల్లగా పోనియ్యి. వెధవ శకునపక్షిలా వచ్చి అపశకునం మాట్లాడాడు" అన్నాడు విశ్వనాధరావు చికాకుగా.

"ఏం సార్! వాడి మాటలు మీరు నమ్ముతున్నారా! పన్నెండేళ్ళనుంచి మీ దగ్గర పని చేస్తున్నాను. కారుకి చిన్న గీతయినా పడనిచ్చానా. వాడి మాటలు గురించి మీరేమీ బాధపడకండి సార్!" అన్నాడు డ్రైవర్.

"అది కాదు డ్రైవర్, నీ డ్రైవింగ్‌లో లోపం వున్నదని కాదు. వాడి చెడు మాటలు నిజంగానే పని చేస్తాయేమోనని ముందు జాగ్రత్త కోసం చెపుతున్నాను, అంతే" అన్నాడు.

విశ్వనాధరావు మాట్లాడుతుండగానే డ్రైవర్ టర్నింగ్ తిప్పాడు కారుని.

అంతే! అప్పుడే అటునుంచి వస్తున్న రిక్షా కారు ముందు రెండు చక్రాలకి అతుక్కుపోయింది. విశ్వనాధ

రావు ఒక్కసారిగా కళ్ళు బైర్లు కమ్మినట్లయిపోయినాయి.

నిమిషంలో కారు చుట్టూతా జనం గుమిగూడి పోయారు.

అంతలో సాధువు చెప్పిన మాటలు గుర్తుకు వచ్చి గడియారం వంక చూసుకున్నాడు. సరిగ్గా 10-28 అయింది.

రోడ్డుమీద జనం ఎక్కువమంది పోగవటం చూసి కారులోంచి దిగి బయటకు వచ్చాడు. ఏక్సిడెంటు అయిన రిక్షా వంక చూశాడు. ఇంకానయం రిక్షా ఒక్కటే పాడయిపోయింది. రిక్షా డ్రైవరుకు ఎక్కువగా దెబ్బ లేమీ తగల్లేదు.

ఇంతలో ట్రాఫిక్ పోలీసు వచ్చి తన పని చేసుకు పోసాగాడు.

విశ్వనాథరావు పోలీసు దగ్గరకు వచ్చి కాసేపు ఏదో మాట్లాడాడు. అక్కడ గుమిగూడిన జనాన్ని తరిమేశాడు పోలీసు.

రిక్షా రిపేరు కోసం, రిక్షా అతనికి తగిలిన కొద్దిపాటి గాయాలను నయం చేసుకోవటానికిగాను నాలుగు వందలు అతని చేతిలో పెట్టి బయట పడ్డాడు విశ్వనాథరావు.

## 3

వారం రోజుల తర్వాత విశ్వనాథరావు కుటుంబ సమే తంగా గ్రామంలో వున్న తమ్ముడి కొడుకు పెళ్ళికిబయలు దేరాడు.

కారు సరిగ్గా మెయిన్ గేటు దగ్గరకు రాగానే మళ్ళీ సాధువు ఎదురు వచ్చాడు.

సాధువుని చూడగానే డ్రైవర్ తనంతట తానే కారుని ఆపాడు.

సాధువు విశ్వనాధరావు దగ్గరకు వచ్చాడు.

"ఏం, మళ్ళీ ఈసారి ఏ ఏక్సిడెంటు తీసుకువచ్చావు?" అడిగాడు విశ్వనాధరావు సాధువు వంక కోపంగా చూస్తూ.

సాధువు చిరునవ్వు నవ్వి "నేను తీసుకువచ్చేది ఏమీ లేదు నాయనా! అంతా విధిలీల. శివుని ఆజ్ఞలేనిదే చీమ అయినా కుట్టదు. కాని ఆ చీమ ఎప్పుడు కుడుతుందో, ఎప్పుడు ఏం జరుగుతుందో సాధారణంగా ఎవరికీ తెలియదు.

కాని నేను కొన్ని ఏళ్ళ తరబడి శివధ్యానం చేస్తూ, శివుడే లోకంగా స్మరిస్తూ ఉండడంవలన నాకు కొద్దిగా దైవాంశ ప్రాప్తించింది. నాకు తెలిసినదానివల్ల ప్రజల కోసం పాటుపడమని శివుడు నన్ను ఆదేశించాడు. చేస్తున్నాను. అంతేగాని మీరనుకున్నట్లు సాధారణ సాధువుని కాదు.

ఇకపోతే మీరు ఎక్కడకు పోతున్నారో నాకు తెలుసు. వెళ్ళేవాళ్ళని ఆపటం నాకు యిష్టం లేదు. కాని మీరు వెళ్ళేచోట మీకు వూహించని ఆపద ఎదురవుతుంది. ప్రాణాపాయం కలుగుతుంది..." అంటూ సాధువు ఒక పొట్లం విశ్వనాధరావు చేతిలో పెట్టేసి వడివడిగా వెళ్ళిపోయాడు.

డ్రైవర్ కారును ముందుకు పోనిచ్చాడు.

సాధువు యిచ్చిన పొట్లం బయటకు విసరబోయాడు విశ్వనాధరావు. కాని అంతలో పొట్లం మీదున్న అక్షరాలు చూసి ఆగిపోయాడు.

"విషహారిణి" అని వ్రాసి, దానిక్రిందగా "కొద్దిగా మంచినీళ్ళలో చిటికెడు 'విషహారిణి' కలిపి తాగితే ఎటు

వంటి విషాన్ని అయినా హరిస్తుంది'' అని వ్రాసి వుంది.

అది చదివిన తరువాత ఆలోచనలో పడ్డాడు విశ్వనాధరావు.

ఈ విషహారిణి తనకు ఎందుకు యిచ్చాడు సాధువు? అసలు ఈ సాధువు ఎవరు? ఎందుకు నా గురించి ప్రత్యేకంగా పని కట్టుకొని వచ్చి, జరగబోయేవి చెపుతున్నాడు? దీని వెనక ఏమన్నా కుట్ర వున్నదా? లేకపోతే నన్ను మంచి చేసుకొని నా ఆస్థి కాజేయాలని చూస్తున్నాడా!

విశ్వనాధరావుకి కారుతోపాటు ఆలోచనలు కూడ ఆగిపోయినాయి.

కారు దిగి పెళ్ళి యింట్లోకి నడిచారు అందరూ.

ఎందుకయినా మంచిదని సాధువు యిచ్చిన పొట్లాన్ని జాగ్రత్తగా దాచిపెట్టుకొన్నాడు విశ్వనాధరావు.

## 4

పెళ్ళి హడావిడి తగ్గగానే తిరుగు ప్రయాణమవసాగాడు విశ్వనాధరావు.

అంతలో విశ్వనాధరావు తమ్ముడు వచ్చి ''అన్నయ్యా ద్రాక్షతోటను చూసి చాలారోజులయింది కదూ నువ్వు! కాసేపు అలా తోటదాకా వెళ్ళి, వచ్చేటప్పుడు ద్రాక్షపండ్లు కోయించి తీసుకు వద్దాము పద'' అన్నాడు.

తోట దగ్గరకు అనగానే కాస్త తటపటాయించాడు విశ్వనాధరావు. సాధువు యిచ్చిన విషహారిణి జ్ఞాపకం వచ్చింది. అంటే తనకు 'విషపురుగు' వాని ఏమన్నా కలుగుతుందా?

ఏమో! ద్రాక్ష తోటలో పెద్ద పాము పుట్ట కూడ

ఒకటి వున్నది. కాదు. కూడదు రానంటే తమ్ముడు ఏమను కుంటాడో!

అయినా తనకు భయం దేనికి? తోట దగ్గరకు వెళ్ళ గానే తోట కాపలావాళ్ళు మా ప్రక్కనే వుంటారు గదా! అని తనలో తనే ధైర్యం చెప్పుకొని తమ్ముడితో పాటు తోటకు బయలుదేరాడు విశ్వనాథరావు.

వీళ్ళిద్దర్నీ చూడగానే తోట కాపలావాళ్లు యిద్దరూ పరుగెత్తుకొని వచ్చారు.

"అరే అప్పన్నా! మంచి పండ్లుకోసి బుట్టల కెత్తండి. అన్నయ్య పట్నం తీసుకువెళతాడు" అని పురమాయిం చాడు విశ్వనాథరావు తమ్ముడు కాపలావాళ్ళకి.

కాపలావాళ్ళు అలా వెళ్ళిపోగానే విశ్వనాథరావుకి జంకు ప్రారంభమయింది. తనచుట్టూ వేయి కళ్లు చేసుకుని చూసుకుంటూ నడవసాగాడు.

అతని తమ్ముడు తోట గురించి చెప్పుకుపోతున్నాడు కాని అవేమి చెవికి ఎక్కటం లేదు. ఏ వైపునుంచి ఏమి వస్తుందో అని జాగ్రత్తగా చూసుకోసాగాడు.

అలా మాట్లాడుకుంటూ తోటంతా తిరగసాగారు.

"చీకటి పడకముందే బయలుదేరాలి మేము" అన్నాడు విశ్వనాథరావు.

"అదేమిటన్నయ్యా! అలా తొందరపడుతున్నావు ఈ సారి. ఎప్పుడొచ్చినా కనీసం వారం రోజులన్నా వుండి పోయేవాడివి. ఈసారి వచ్చినప్పటినుండి వెళ్తా, వెళ్తా నంటున్నావు" అన్నాడు తమ్ముడు ఆశ్చర్యంగా అన్న వంక చూస్తూ.

తోటంతా తిరిగివచ్చి వరండా బయట వేసిన కుర్చీలో కూర్చున్నారు. ఎదురుగా టీపాయ్‌మీద రెండుద్రాక్ష పండ్ల గుత్తులు పెట్టివున్నాయి.

"తీసుకో అన్నయ్యా! ఈ రెండు పండ్లూ నోట్లో వేసుకుని బయలుదేరదాము" అన్నాడు.

అప్పటికే సంధ్య చీకట్లు అలుముకొంటున్నాయి.

తోటవాళ్ళు పళ్ళ బుట్టలను కారు డిక్కీలో పెట్టి వచ్చారు.

ఇద్దరూ కారువేపు నడవసాగారు.

అంతలో విశ్వనాధరావు ఉలిక్కిపడుతూ పెద్దగా కేక వేసి కూలబడిపోయాడు.

అతని తమ్ముడుకి ఏమి అర్థంకాక, కంగారుగా యేమిటని అడుగుతూ అటుయిటు చూసేడు.

ఆ మసక చీకటిలో అతనికి ఏమీ కనిపించలేదు. కాని ఏదో పాకుతున్నట్లు శబ్దం వినిపించింది.

"ఒరేయి, అప్పన్నా! త్వరగా టార్చి, కర్ర తీసుక రండ్రా. పాము వచ్చింది" పిచ్చిగా కేకేశాడు విశ్వనాధరావు తమ్ముడు.

పనివాళ్ళిద్దరూ పరుగెత్తుకుంటూ వచ్చారు.

ఈలోపల తనపై ఉత్తరీయాన్ని తీసి పాము కరచిన చోటుకి కొద్దిగా పైభాగాన గట్టిగా బిగించికట్టాడు. అదే విధంగా కిందభాగాన్ని కూడా కట్టాడు.

"ఒరేయి, ముందు అన్నయ్యని కారులో చేర్చండిరా. పాముల నరసయ్య దగ్గరకు తీసుకువెళ్దాము" అన్నాడు తమ్ముడు.

మంచినీళ్ళు తెమ్మన్నట్లుగా సైగ చేశాడు విశ్వనాధరావు.

క్షణంలో మంచినీళ్ళ గ్లాసుతో ప్రత్యక్షమయ్యాడు అప్పన్న.

జేబులో చేయిపెట్టి సాధువు యిచ్చిన పొట్లాన్నివిప్పి ఆ పొడుము కొద్దిగా గ్లాసులో వేసి కలుపుకొని గడగడా తాగేశాడు.

రెండు నిముషాల్లో ఎంతో 'ఫ్రీ'గా ఉన్నట్లయింది విశ్వనాధరావుకి.

"తమ్ముడూ! పాముల నరసయ్య అవసరంలేదు" అన్నాడు లేచి సర్దుకు కూర్చుని.

"ఏమిటన్నయ్యా! ఇందాకట్నించి చూస్తూన్నాను. ఏదో వింతగా ప్రవర్తిస్తోన్నావు?" అన్నాడు తమ్ముడు తన అనుమానాన్ని బయట పెడుతూ.

అప్పుడు చెప్పాడు, అంతకుముందు సాధువు తనకు చెప్పినదాన్ని గురించి.

ఈ సంఘటనతో విశ్వనాధరావుకి సాధువుమీద గౌరవభావం కలగసాగింది.

# 5

విశ్వనాధరావు గ్రామంనుంచి తిరిగివచ్చి నాలుగు రోజులయింది. సాధువు మళ్ళీ కన్పించలేదు.

ముందర తను అతనిని ఒక సామాన్య సాధువుగా చూశాడేగాని, యింత మహత్తువున్న సాధువుగా తెలుసుకోలేక పోయాడు. ఒకవేళ అతనికి నా నిర్లక్ష్యం వల్ల నామీద కోపం వచ్చిందేమో. ఏది ఏమయినా ఆ సాధువును కలుసుకోవాలి.

'ఎలా కలుసుకోవాలి? ఎక్కడ కలుసుకోవాలి?' ఆలోచించ సాగాడు.

'ఆఁ! అవును. సామాన్యంగా సాధువులు గుళ్ళదగ్గర ధర్మసత్రాల దగ్గర వుంటారు. అక్కడకు వెళ్ళి వెతికితే?

అనుకున్నాడు. కానీ యింతలో మళ్ళీ యింకో అనుమాన మొచ్చింది.

'అతను సామాన్య సాధువుకాదు, గుళ్ళదగ్గర, సత్రాల దగ్గర ఉండడానికి? ఏంచేయాలి?'

'అయినా ఒక్కసారి పూళ్ళోవున్న గుళ్ళదగ్గరకి, సత్రాల దగ్గరకు పోయి తిరిగొస్తే పోయేదేముంది?' అనుకొని లేచి తనొక్కడే కారులో బయలుదేరాడు.

రెండు గంటలసేపు తిరిగాడు. కాని ఎక్కడా ఆ సాధువు కనిపించలేదు.

ఆ రాత్రంతా సాధువుగురించి ఆలోచిస్తూ సరిగా నిద్ర కూడా పోలేదు.

మర్నాడు ఉదయం తొమ్మిదికల్లా తయారై డ్రైవరుతో సహా మళ్ళీ సాధువును వెతకటానికి బయలుదేరాడు. అప్పుడే పోస్ట్‌మాన్ వచ్చి, ఆరోజు 'పోస్ట్' యిచ్చి వెళ్ళాడు.

వరుసగా ఒక్కొక్క ఉత్తరంతీసి చదవసాగాడు విశ్వనాథరావు. అన్నీ చదివిన తరువాత చివరలో ఓ కవరు మిగిలిపోయింది. అదికూడా చించి చదవసాగాడు.

ఒక్కసారిగా విశ్వనాథరావు ముఖంలో ఆనందరేఖలు వెల్లివిరిశాయి.

"విశ్వనాథరావుకి,

ఆశీర్వచనములతో —

నేను రెండుసార్లువచ్చి నీకు మేలు చేద్దామనుకుంటే నన్ను చీదరించుకున్నావు. త్వరలో నీకు శుభం జరుగుతుంది. శుభవార్త వింటావు. ఆ విషయం విపులంగా చెప్పటానికివస్తే ఈసారి నన్ను మెడపట్టి గెంటిస్తావేమోనని నేను రాకుండా ఈ ఉత్తరం ద్వారా తెలియపరుస్తున్నాను.

నీ ఆస్తి తాలూకు కేసు ఒకటి కోర్టులో నడుస్తున్నది. దాని తాలూకు ఆఖరి వాయిదా రేపున్నది. రేపు కోర్టులో న్యాయం నీ ప్రక్కన వున్నది. నీ దాయాదులు ఓడిపోతారు. అంటే నీకు అయిదు లక్షల ఆస్తి అదనంగా నీకున్న ఆస్తిలో చేరుతుంది.

రేపు నువ్వు కోర్టుకు వెళ్ళేటప్పుడు ఈ కవర్లో పంపిస్తున్న విభూదిని నొసట పెట్టుకొని వెళ్ళు. నీకు జయం కలుగుతుంది!

ఇట్లు,

"కాలభైరవస్వామి"

ఆ ఉత్తరం చదవగానే అది ఎవరు వ్రాశారో అర్థమయింది విశ్వనాథరావుకి. క్రింద అడ్రసు కోసం చూశాడు. కాని కాలభైరవస్వామి తన అడ్రసు ఏమీ వ్రాయలేదు.

నిజంగా రేపు కోర్టులో గెలుపు తనదేనా? ఆ సాధువు కాలభైరవస్వామి చెప్పినట్లు అదృష్టం తననే వరిస్తుందా! నిజంగా రేపు సాధువు చెప్పినట్లు జరిగితే, ఆయనకు మంచి ఆశ్రమం కట్టించి, ఆయన శిష్యుడిగా చేరిపోయి ఆయన సలహాలు తీసుకుంటూ జీవితం నిశ్చింతగా గడపాలి.

కాని సాధువు అడ్రసు తనకు ఇవ్వలేదే! ఎట్లా కలుసుకోవాలి? ఆయనకు తన క్షమాపణ ఎట్లా తెలుపుకోవాలి?

మర్నాడు ఉదయమే లేచి, స్నాన సంధ్యాదులు ముగించుకొని సాధువును స్మరించుకొంటూ, ఆయన పంపిన విభూతిని నొసట పెట్టుకొని, తొమ్మిది గంటల కల్లా కోర్టుకి బయలుదేరాడు.

మధ్యాహ్ననికల్లా కోర్టు తీర్పు చెప్పింది.

కోర్టు తీర్పు విన్న తర్వాత విశ్వనాథరావు ఆనంద డోలికల్లో వూగిపోయాడు. ఆ సమయంలో గనక సాధువు అక్కడే వుంటే పూలవర్షంతో ముంచెత్తే వాడు. ఆయన అడిగింది కాదనకుండా యిచ్చేవాడు! కాని ఏడి? ఆయన జాడ తెలియదే! ఆలోచిస్తూ యథా లాపంగా వచ్చి కారులో కూర్చున్నాడు.

డ్రైవర్ కారు స్టార్టుచేసి పోనివ్వసాగాడు.

కారు రోడ్డుమీదకు వచ్చేసరికి భగవన్నామ సంకీ ర్తన చేస్తూ, చిన్న సాధువుల గుంపు పోసాగింది.

ఆ గుంపును చూడగానే విశ్వనాథరావు కారును ఆపించి దిగివెళ్ళి ఆ గుంపులో సాధువు గురించి వెదకసాగాడు.

ఒక్కసారి విశ్వనాథరావు కళ్ళు ఆనందంతో మెరి కాయి. ఆనందం పట్టలేక "స్వామీజీ" అని బిగ్గరగా అరిచాడు. సంకీర్తన ఒక్కసారిగా ఆగిపోయింది.

కాలభైరవస్వామి మెల్లగా తల తిప్పి విశ్వనాథరావు వంక చూశాడు.

విశ్వనాథరావు చేతులు జోడించి స్వామీజీకి నమస్క రిస్తూ "స్వామీ! నన్ను క్షమించండి! మీ మహిమ గ్రహించలేని మూర్ఖుడినై మిమ్మల్ని, మీ మాటల్ని తిరస్కరించాను. నా తప్పులు క్షమించండి స్వామీ" అని రోడ్డుమీదనే స్వామీజీ కాళ్ళపై బడ్డాడు.

"లే నాయనా! అంతా భగవంతుని లీల. ఆనాడు నీకు జ్ఞానోదయం అవలేదు. ఈనాడు నీకు జ్ఞానోదయం అయింది. కళ్ళు తెరచి 'నేను' ఎవరో తెలుసుకున్నావు.

యిక వెళ్ళు. నీకు అంతా మంచి జరుగుతుంది'' అని చెప్పి స్వామీజీ ముందుకు కదిలాడు.

''లేదు స్వామీ! మీ వెంట నేనూ వస్తాను. మీ శిష్యగణంలో చేరిపోతాను'' అన్నాడు విశ్వనాథరావు.

''నీకా అర్హత లేదు. నువ్వు యింకా పరిపూర్ణత పొందలేదు. ఆ రోజు వచ్చినప్పుడు తప్పకుండా నేనే పిలిచి నా శిష్యగణంలో చేర్చుకుంటాను'' అన్నాడు స్వామీజీ..

కాసేపు ఏం మాట్లాడాలో తెలియలేదు విశ్వనాథ రావుకి. కొద్దిసేపటి తర్వాత ''పోనీ! అప్పటిదాకా మీ దర్శన భాగ్యం కలిగించండి ప్రతిరోజూ'' వేడుకున్నాడు.

''అలాగే. రోజు ఉదయం ఎనిమిది గంటలలోపు అయితే నేను నీకు కనిపిస్తాను. ఆ తరువాత పరమేశ్వర సాంగత్యంలో వుండిపోతాను.''

''అలాగే స్వామీ! ప్రతిరోజూ ఉదయమే వచ్చి మీ దర్శనం చేసుకుంటాను'' అని చెప్పి స్వామీజీ వుండేది ఎక్కడో తెలుసుకుని వెనక్కి తిరిగాడు విశ్వనాథరావు.

కాలభైరవస్వామి శిష్యగణంతో మళ్ళీ భగవన్నామ సంకీర్తనం చేస్తూ కదలి వెళ్ళిపోయాడు.

## 6

ఇప్పుడు విశ్వనాథరావులో మార్పు కనపడసాగింది.

అంతకు ముందు సాధువులంటే ఎంత నిర్లక్ష్యం చేసేవాడో యిప్పుడు అంత గౌరవిస్తున్నాడు. ప్రతిరోజూ వుదయాన్నే లేచి కాలభైరవస్వామి దర్శనం చేసుకొని వస్తున్నాడు.

వ్యాపారం కొడుకులకు అప్పజెప్పి, ఎక్కువ కాల
భగవన్నామ స్మరణలో కాలం గడపసాగాడు.

రోజులు, వారాలు గడవసాగాయి.

ఒకరోజు వుదయం ఆశ్రమంలో కాలభైరవస్వా
సన్నిధానంలో ఉండగా ఒక పదిమంది యువకు
వచ్చారు. వారిని చూస్తూనే ఆయన చిరునవ్వు నవ్వి
ఆహ్వానించాడు.

ఆ పదిమంది వచ్చి అక్కడ సమీపంలో క్రిం
పరచిన చాపలమీద కూర్చున్నారు.

"ఊc! యిప్పుడు చెప్పండి! అంతదూరం నుంచి ప
గట్టుకుని ఎందుకు వచ్చారు మీరు? మన ఆశ్రమం బా
నడుస్తున్నది కదా! విద్యార్థుల సంఖ్య పెరుగుతున్న
కదా! అందరూ క్రమం తప్పకుండా విధులు నిర్వహి
న్నారా?" స్వామీజీ వరుసగా అడగసాగాడు ఆ వచ్చి
వారి వంక చూస్తూ.

"స్వామీ! మీరున్నంతకాలం మన ఆశ్రమం ఎంతో
కళకళలాడేది. మీరు ఆశ్రమ బాధ్యతలు మాకు అ
గించి యిక్కడకు వచ్చేసిన తరువాత కొంత కాలం వ
విధులు మేము క్రమం తప్పకుండా నిర్వహిస్తూ వచ్చావ

కాని రాను రాను దాతలు విరాళాలు యివ్వటం త
చేశారు. మీరున్న రోజుల్లో అయితే మీరు వె
కుండానే వారు తమ తమ విరాళాలను పూవులలో పె
తెచ్చి యిచ్చేవాళ్ళు. ఇప్పుడు మేము వెళ్ళి పదిసా
అడిగినా పది పైసలు రాల్చటం లేదు.

ఆశ్రమం నడపాలంటే చాలా బాధగా వున్న
ఉన్న విద్యార్థులకు అన్న పానాదులు లేక అలమటి

న్నారు. కొంతమంది ఆకలిబాధ భరించలేక చదువు మానుకుని దేశంమీద పడ్డారు.

మళ్ళీ మీరు ఆశ్రమం గురించి శ్రద్ధ వహిస్తేగాని, మంటుపడ్డ ఆశ్రమం మళ్ళీ నాలుగు కాళ్ళమీద నడవదు" అని తాము చెప్పదలుచుకున్నదంతా వివరంగా స్వామీజీకి చెప్పారు వాళ్ళు.

స్వామీజీ కాసేపు కళ్ళు మూసుకుని ఏదో ఆలోచించసాగాడు.

ఇదంతా విశ్వనాథరావుకి ఏమీ అర్థంగాక స్వామీజీనే అడిగాడు.

స్వామీజీ కళ్ళు తెరచి విశ్వనాథరావువంక చూశాడు. తను అంతకు ముందు స్థాపించిన ఆశ్రమం, దానిలో పేద విద్యార్థులకు వసతి సౌకర్యాలతో విద్యాబోధనం చేయటం అన్నీ వివరంగా చెప్పాడు.

"ఇప్పుడు వచ్చినవాళ్ళు నా ముఖ్యానుచరులు. వీళ్ళ మీద ఆశ్రమ భారం వదలి, శివుడు ఆజ్ఞమీద యిలా తిరుగుతున్నాను" అన్నాడు.

విశ్వనాథరావు ఆసక్తిగా వింటున్నాడు.

"ఇప్పుడు నా ఆశ్రమం నడక కుంటుపడింది. దాన్ని మళ్ళీ కళకళలాడేట్లు చేయాలి. దాని గురించే ఆలోచిస్తున్నాను. మళ్ళీ నా ఆశ్రమం కళకళలాడాలంటే డబ్బు కావాలి. డబ్బు కావాలంటే సంపాదన వుండాలి. నేను అన్నిటి మీద వ్యామోహం చంపుకుని యిలా వచ్చాను" సాధువు చెప్పుకుపోతున్నాడు.

మధ్యలో విశ్వనాథరావు అందుకుని "స్వామీ! మీరు అనుగ్రహిస్తే ఆ ధన సహాయం నేను చేస్తాను" అన్నాడు.

స్వామీజీ చిరునవ్వు నవ్వి, "ఇది నువ్వనుకున్నంత తేలిక కాదు. వందలు వేలతో యిది పునరుద్ధరణ కాదు. మళ్ళీ నా ఆశ్రమం కళకళలాడాలంటే కొన్ని లక్షలు కావాలి. వందలు, వేలు అయితే నువ్వు సర్దగలవు. కాని లక్షలలో యివ్వాలంటే నీకు సాధ్యపడదు. ఒకవేళ అది నీకు సాధ్యమవుతుందనుకున్నా నీ వారసులు అందుకు ఒప్పుకోరు" స్వామీజీ అన్నాడు.

విశ్వనాథరావు ఆలోచనలో పడ్డాడు. స్వామీజీ చెప్పింది నిజమే. వందలు, వేలు అయితే తను తెచ్చి యివ్వగలడు. లక్షలమీద యివ్వాలంటే కొడుకులతో సంప్రదించాలి, అందుకు వాళ్ళు ఒప్పుకోవాలి.

అసలు యిప్పటికే తనను హేళనగా చూస్తున్నారు తన కొడుకులు. స్వామీజీ దైవాంశగలవాడంటే, వాళ్ళు నమ్మడం లేదు.

"వృధా ఆలోచనలు చేయకు నాయనా! యిప్పుడు నువ్వు నీ కొడుకుల గురించి ఆలోచిస్తున్నావు. అందుకు వాళ్ళు ఏమాత్రం ఒప్పుకోరు" అన్నాడు స్వామీజీ విశ్వనాథరావు ఆలోచనలకు అడ్డు తగులుతూ.

"లేదు స్వామీ! ఏవిధంగానయినా మీకు డబ్బు సర్దుతాను."

"చూడు నాయనా! నా గురించి నువ్వు అప్పుచేసి, అనవసరంగా కష్టాలు కొని తెచ్చుకోవద్దు. జరగాల్సింది ఏదోవిధంగా జరుగుతుంది," అన్నాడు కాలభైరవస్వామి సౌమ్యంగా.

అంతలో బయట మైకులో ఏదో చెప్పుకుపోతున్నారు.

స్వామీజీ మాటలు ఆపి, శ్రద్ధగా ఆలకించసాగారు.

"కర్నాటక స్టేట్ లాటరీ బంపర్ ప్రయిజు 10 లక్షలు.

ఎల్లుండే డ్రా. ఒక్క రూపాయతో లక్షాధికారులుకండి. ఆలసించిన ఆశాభంగం. ఎల్లుండే డ్రా'' పెద్దగా అరుస్తూ పోతున్నాడు లాటరీ టిక్కెట్ల సేల్సుమాన్.

విశ్వనాథరావు స్వామీజీవంక చూశాడు.

''ఏం చేయమంటారో సెలవివ్వండి స్వామీ!'' అన్నాడు విశ్వనాథరావు.

బయట మైకులో చెప్పేది వినమన్నట్లుగా సైగ చేశాడు ఆయన గంభీరవదనంతో.

''పదిలక్షలు లాటరీ తగిలితే గదా వస్తుంది'' అన్నాడు విశ్వనాథరావు అదివిని.

స్వామీజీ నవ్వి, ''చూడు విశ్వనాథరావు, నువ్వు నాకు ఏదో విధంగా డబ్బు సమకూర్చాలనుకుంటున్నావు. నీకు నామీద వున్న ప్రేమాభిమానాలకు చాలా కృతజ్ఞుడిని. కాని నువు యిస్తానన్న డబ్బు నాకు పూరక నేవద్దు. నీకొక అదృష్టసంఖ్యవున్న టికెట్టు యిప్పిస్తాను. ఆ సంఖ్యమీద మొదటి బహుమతి అంటే దాదాపు పది లక్షలు వస్తుంది.

కాకపోతే నువు వారం రోజులు ఓపిక పట్టాలి. అప్పటికి నువు నాకు యిచ్చిన దానికి రెండింతలు మళ్ళీ నీకు తిరిగి చేరుతుంది. బహుశా నీకు అనుమానం రావచ్చు. అదే టికెట్టుకి బహుమతి వస్తుందని నమ్మకం ఏమిటని? కాని నేను సంఖ్య గుణించివేస్తే అదితప్పక వచ్చితీరాలి'' చెప్పుకుపోతున్న స్వామీజీ మాటలకు విశ్వనాథరావు అడ్డువస్తూ ''మీరు అంతమాట అనవద్దు. మీశక్తిని నేను తక్కువ అంచనా వేయలేదు'' అన్నాడు విశ్వనాథరావు.

ఆమాట అన్నాడేగాని నిజంగా అనుమానం రాసాగింది విశ్వనాథరావుకి. కొన్ని లక్షల టిక్కెట్లలో ఆ టిక్కెట్టుకే వస్తుందని గ్యారంటీ ఏమిటి?

విశ్వనాథరావు ఆలోచనలు ఆపి తనని తానే తిట్టుకున్నాడు. స్వామీజీ అంత సామాన్యుడు కాడు. దైవాంశ సంభూతుడు. భవిష్యత్‌లో జరిగేవి ఆయనకు బాగా తెలుసు. దానికి రుజువులు కావాలంటే యింతకు ముందు ఆయన తనకు చేసిన ఉపకారాలే.

అసలు స్వామీజీకి యిప్పుడు ఎన్ని లక్షలు కావాలి? నాలుగు అయిదు లక్షలయితే రేపు ఉదయం బాంకినుంచి 'డ్రా' చేసి యివ్వగలడు. మళ్ళీ లాటరీలో ప్రయిజు రాగానే ఆ డబ్బు బ్యాంకిలో జమ చేయవచ్చు యెవరికీ తెలియకుండా.

"ఏమంటావు నాయనా! నువుచేసిన సహాయానికి ప్రతిఫలం ఉండాలనే ఆ విధంగా చెప్పాను" అన్నాడు స్వామీజీ మధ్యలో.

"అలాగే స్వామీ! ఇంతకీ తమకెంత కావాలి?"

"అయిదు లక్షలు. ఇంకో వారంలో అయిదుకుఅయిదు కలుపుకొని పదిలక్షలు నీకు ముడతాయి."

'అలాగే'నని సంతోషంగా ఒప్పుకున్నాడు.

విశ్వనాథరావు ఒప్పుకోగానే స్వామీజీ లాటరీ టిక్కెట్లతన్ని పిలిపించారు. ఏదో సంఖ్యలు లెక్క వేయసాగాడు కళ్ళుమూసుకుని. కొద్దిక్షణాల అనంతరం కళ్ళు తెరిచి లాటరీ టిక్కెట్ల అతనివంక చూసి—

"345785 నెంబరు టిక్కెట్టు వుందా?" అని అడిగాడు.

అతను స్వామీజీని విచిత్రంగాచూసి, గబగబా టిక్కెట్ల నంబర్లు వెతకసాగాడు.

ఒక్క నిముషం తరువాత, "ఆఁ! ఉన్నదండీ! 345785" అంటూ మరింత ఆశ్చర్యపోయాడతను.

"మంచిది. ఆ టిక్కెట్టుతీసి ఆయనకివ్వు" అన్నాడు స్వామీజీ విశ్వనాథరావువంక చూపిస్తూ.

టిక్కెటు విశ్వనాథరావుకి యిచ్చి, డబ్బులు తీసుకుని వెళ్ళిపోయాడతను.

"చూడు విశ్వనాథరావు. నిన్ను అదృష్టం తప్పక వరిస్తుంది. ఇంకో వారంలో నువు నీ ఆస్తికి యింకో ఐదు లక్షలు తప్పకుండా కలుపుకుంటావు" అన్నాడు.

"అంతా మీ దయ. రేపు ఉదయం 11 గంటలకు మీకు నేను అయిదులక్షలు అందచేస్తాను."

"అలాగే!" స్వామీజీ విశ్వనాథరావును ఆశీర్వదించి పంపాడు.

# 7

మర్నాడు 11 గంటలకు విశ్వనాథరావు డబ్బులు స్వామీజీకి అందజేశాడు.

అలవాటు ప్రకారం ఆ మర్నాడు స్వామీజీ దర్శనం కోసం వచ్చాడు. కాని అక్కడ యెవరూ లేరు.అక్కడే చిన్నబోర్డు వ్రేలాడగట్టి వుంది.

"స్వామీజీ, బృందంతో సహా పక్కవూరు వెళ్ళారు. రెండురోజులదాకా రారు. భక్తులు గమనించ ప్రార్థన" అని వ్రాసివుంది.

వారం రోజులు గడిచాయి.

స్వామీజీ రాలేదు.

ఆరోజు ఉదయం పోస్టుమాన్ ఉత్తరాలు అందించి వెళ్ళిపోయాడు. అందులోంచి ఒక కవరుతీసి చింపి చదవసాగాడు.

"పిచ్చి విశ్వనాథరావూ!

ఈ ఉత్తరం వ్రాసింది ఎవరో తెలియక ఆశ్చర్య పోతున్నావు కదూ! మానవత్వంతో మనుషులను నమ్మ లేక, కేవలం పాపభీతితో దొంగసాధువులను నమ్మే నీ లాంటి వ్యక్తులకు గుణపాఠం చెప్పటానికే 'స్వామీజీ' అవతారం ఎత్తిన 'కుమార్'ని నేను.

ఆరోజు మీకు గుర్తుందనుకుంటాను. స్వయం ఉపాధి పథకం కింద ఒక షెడ్యూల్డు బ్యాంకువారు నాకు ఇరవై వేలు అప్పుగా మంజూరు చేశారు. అయితే సంఘంలో ఒక పెద్దమనిషి నాకు 'రిఫరెన్సు' యివ్వాలన్నారు.

పెద్దమనుషులతో పరిచయాలుంటే బ్యాంకు లోన్లు ఎందుకు? అయినా ఆశ ఊరుకోదుగదా! అయిదేళ్ళబట్టి ఎదురు బొదురు యిళ్ళల్లో ఉంటున్నాం. ఆమాత్రం 'రిఫరెన్సు' యివ్వలేరా అని వచ్చి మిమ్మల్ని అడిగాను.

కానీ, నీవేమన్నావో గుర్తుందా! తెల్లవారి లేచిన తరువాత వందల మందిని చూస్తూంటాను. అందులో నువ్వొకడివి! అంటూ నిరసనగా మాట్లాడావు. 'నీలో ఏంచూసి నమ్మి నీకు రిఫరెన్సు యివ్వమంటావు?' అంటూ అవహేళనగా మాట్లాడావు.

ఆనాడే అనుకున్నాను. నీనుండి గొప్ప రిఫరెన్సు పొందాలని.

పథకం వేసుకొన్నాను. పటిష్టంగా అమలు జరిపాను.

నీకు యింకా ఆశ్చర్యంగా వుండవచ్చు. నా యింటి ఎదురుగా గుడిసెలో వుండే కుమార్, స్వామీజీగా మారటం భవిష్యత్ చెప్పటం, నేను నిజంగా స్వామీజీ నని నిన్ను నమ్మించటం.

ఇవన్నీ ఎలా జరిగిందీ నీకు యింకా అర్థంకాకపోవచ్చు. అవన్నీకూడా వివరిస్తున్నాను. చదివి జన్మ తరింపచేసుకో!

మొదటిది కారు ఏక్సిడెంటు. ప్రతిరోజూ నువు యింటిలో బయలుదేరినప్పట్నించి రోజూ నిన్నూ, నీ కారుని సెకండ్లతో సహా గమనించేవాడిని. నువు సరిగ్గా ఏక్సిడెంటు జరిగిన టర్నింగు దగ్గరకు రావడానికి సరిగ్గా ఇరవై మూడు నిమిషాలు పడుతుంది.

సరిగ్గా అదే సమయంలో అక్కడ ఒక రిక్షా అతనితో ఒప్పందం కుదుర్చుకుని, నీ కారుతో ఏక్సిడెంటు జరిపించాను. ఆ సంఘటనతో నీలో బీజం నాటగలిగాను.

రెండవది పాముకాటు! నిజానికి నేను, నీకు యిచ్చినది విషహారిణి కాదు, తలనొప్పి మాత్రలపొడి! ఆ పొడినే నువ్వు విషహారిణి అనుకొని నీళ్ళలో వేసుకుని తాగావు.

నేను ప్రతిరోజూ నిన్ను గమనిస్తూనే వున్నాను. నీవు యింటో రెండురోజులలో పెళ్ళికి వెళ్తావని తెలుసుకొని, వెంటనే పాములవాడితో సంప్రదించి, కోరలు లేని పాముతో నిన్ను కరిపించాను.

మూడవది కోర్టుకేసు! నీ ఆస్తివిషయం కోర్టులో నడుస్తున్నదని తెలుసుకున్నాను. జడ్జిదగ్గర టైపిస్ట్-కం-పి.ఏ.గా పనిచేసే అతనితో స్నేహం సంపాదించాను. మెల్లమెల్లగా నీ కేసు సమాచారం అతనినుంచి సేకరించాను.

ఆ తరువాత మొన్న లాటరీటిక్కెట్ల వాడినికూడా నేనే ఏర్పాటు చేశాను.

ఇంతకుమించి నాలో ఏ దైవాంశ లేదు. నేను యే దేముడ్ని గురించి తపస్సుచేయలేదు.

నాలో ఏంచూసి మీరు అయిదులక్షలు యిచ్చారో తెలియదుగాని, ఒకటిమాత్రం మీకు హామీ ఇవ్వగలను.

ఈ అయిదులక్షలు ఏదో ఒకనాడు తిరిగి మీకు చెల్లించగలను. సెలవు!

—కుమార్."

ఉత్తరం చదవటం పూర్తికాగానే నెత్తి నోరుబాదుకున్నాడు విశ్వనాథరావు.

"ఏం జరిగిందండీ, ఎవరు పోయారు? కొంపదీసి మీ నాన్నగారు పోలేదుకదా ఏడుస్తున్నారు." లోపలనుంచి హడావుడిగా బయటకు వచ్చింది విశ్వనాథరావు భార్య.

"నాన్న పోతే ఏడుపెందుకే పిచ్చి మొహమా! అయిదు లక్షలు పోయాయి" అంటూ ఏడుస్తూనే జరిగింది చెప్పాడు విశ్వనాథరావు.

"అయ్యో! అయ్యో! మీ తెలివి మండిపోను. వెంటనే పోలీసులకు వెళ్ళిచెప్పండి" అరుపులు ప్రారంభించింది ఆమె.

గబగబ బయటకు పరుగుతీయబోయిన విశ్వనాథరావుకి గుమ్మంలోనే ఎదురయ్యాడు మెసెంజర్.

"సార్! మీకు టెలిగ్రామ్" అని యిచ్చి వెళ్ళిపోయాడు.

వణుకుతున్న చేతులతో టెలిగ్రాంవిప్పి చదివాడు విశ్వనాథరావు.

"345785—నంబర్ వన్ ది బంపర్ ప్రయిజు టెన్ లాఖ్స్ ఇన్ కర్ణాటక స్టేట్ లాటరీ"

—: అయిపోయింది :—

# ఎదురుచూడని ప్రమాదం!

## ఏ. వీ. మోహన్‌రావు

ఆదివారం.

సాయంత్రం ఆరుగంటలైంది.

మెరినా బీచ్ నిండా జనం.

మెరీనా కాంటీన్ ముందు నిలుచున్న నిరంజనరావు కళ్ళు రెండు మిత్రుడు మధుమూర్తి కోసం ఆతృతగా వెతకటం మొదలెట్టాయి.

నిరంజనరావు పెద్ద రేడియోలమ్మే షాపులో మానేజర్‌గా పని చేస్తున్నాడు. మధుమూర్తి లాయర్‌గా బోర్డు కట్టుకుని వున్నాడు.

మధుమూర్తి రేడియో కొన్నాడు ఐదు సంవత్సరాల క్రింద. అప్పుడేర్పడింది పరిచయం నిరంజనరావుతో. అది మొదలుకొని ఇద్దరూ ప్రతి ఆదివారం బీచ్‌లో కలుసుకోవడం మొదలెట్టారు. రాత్రి పదింటిదాకా పిచ్చాపాటీ మాట్లాడుకోవడం అలవాటు.

నిరంజనరావుకు పెళ్ళి పెటాకులు లేవు. మధుమూర్తికి భార్యా పిల్లలు వున్నారు. అందువల్ల అయిష్టంగానే విడిపోయేవారు.

వాళ్ళు కలుసుకున్నప్పుడల్లా చర్చించేది ఒకే ఒక్క విషయం. అది డబ్బు సులభంగా ఎలా సంపాదించటం అన్నదే! ఎన్ని రకాల, ఎంతమంది, ఎంత త్వరగా, ఎవ్వరికీ తెలీకుండా డబ్బుగలవాళ్ళవుతున్నారో తర్జన భర్జన చేసుకొంటూ వుంటారు.

"నిరంజన్!" దూరం నుంచే పిలుస్తూ వచ్చాడు మధు.

"ఏం లేటయింది?" అడిగాడు నిరంజనరావు.

"నీకేం! బ్రహ్మచారివి! నాకలా కాదుగా! ఇంటి గొడవలు వొదిలించుకొని రావాలిగా! అందుకని..." అన్నాడు నవ్వుతూ.

ఇద్దరూ కాంటీన్‌లోకి వెళ్ళి కాఫీలు త్రాగి వెలుపల కొచ్చారు. జనానికి దూరంగా వెళ్ళి సముద్రపు టంచున కూర్చున్నారు.

"ఏమిటి విశేషాలు?" సిగరెట్ పాకెట్‌పైనున్న సిల్‌ఫోన్ పేపరు చించుతూ అడిగాడు లాయరు మధుమూర్తి.

"ఏమున్నాయి? మామూలే! కాకుంటే ఒక విచిత్రమైన విషయం తెలుసుకున్నాను."

"ఏమిటది?"

"మనం మామూలు మనిషనుకునేవాడికూడా ఫారిన్‌లో బాంక్ అకౌంటులు వుంటున్నాయి" అన్నాడు నిరంజనరావు.

"ఎవరా మామూలు మనిషి?"

"నువ్వు వినివుంటావు. లాయరు చంద్రశేఖరం.

గోపాలపురంలో వుంటున్నాడు. అతను ఒకే రోజున ఆరు టెలివిజన్ సెట్‌లు ఆరుగురు ఆడవాళ్ళ పేర్లమీద కొన్నాడు. వాటి ఖరీదు ఫారిన్ బ్యాంక్ పైన చెక్ ఇచ్చాడు" అంటూ ఆగి సిగరెట్ అందుకున్నాడు నిరంజన్.

"అయితే..." సిగరెట్ కాలుస్తూ అడిగాడు మధుమూర్తి.

"దాదాపు పాతిక వేల రూపాయల చెక్ ఇచ్చాడు అది స్విట్జర్లాండ్‌లో వున్న బాంక్ పైన."

"ఏ మతనికి అకౌంటు వుండకూడదా?"

"అని కాదు."

"మరి ఏమిటి నీ అనుమానం?"

"లైసెన్సులు తీసుకోనేందుకు అతను రాసిచ్చినవన్నీ ఆడవాళ్ళ పేర్లే! అందులో ఇద్దరు శరీరం అమ్ముకునే రకమని నాకు తెలుసు. దాన్నిబట్టి మిగిలినవాళ్ళు కూడా ఆ బాపతేననిపిస్తుంది."

"అనిపించినంతమాత్రాన ఏమయింది. అతనికి డబ్బుంది, అనుభవిస్తున్నాడు. అందుకు నీ అభ్యంతర మేమిటి?" అడిగాడు మధుమూర్తి.

"చంద్రశేఖరం దగ్గర దాన్నిబట్టి ఎంతో డబ్బు వుండవచ్చుననిపిస్తుంది. అందులో కొంత మనం ఎందుకు అందుకోగూడదు?" అన్నాడు నిరంజనరావు.

మళ్ళా అందుకొని "అతనికి ఏ బ్యాంక్‌లో అకౌంటు వుంది మనకు తెలుసు. అందువల్ల అదేమంత పెద్ద కష్టం కాదనిపిస్తుంది. నేను దీనికో పథకం కూడా ఆలోచించాను" అన్నాడు.

"ఏమిటది?" వుత్సాహంగా అడిగాడు మధుమూర్తి

"మనలో ఒకరం ఏదో ఒక మారు పేరుమీద మధురలో అకౌంటు ఓపెన్ చేద్దాం. ఆ తర్వాత చంద్రశేఖరం రాసినట్లుగా ఉత్తరం రాసి ఒక లక్ష రూపాయలు మనం ఓపెన్ చేసిన అకౌంటుకు వెంటనే ట్రాన్స్‌ఫర్ చేయ మందాం. డబ్బు రాగానే అది తీసుకుని అకౌంటు మూసేద్దాం," అన్నాడు నిరంజనరావు.

"ఒకవేళ ఆ బ్యాంక్ వాళ్ళు డబ్బు ట్రాన్స్‌ఫర్ చేస్తున్నట్లు చంద్రశేఖరంకు రాస్తే!"

"మామూలుగా ఇతర దేశాల్లో వున్న బ్యాంకులు సంవత్సరానికి ఒక్కసారి మాత్రమే లెక్కలు పంపు తాయి. ఈలోగా మన పని అయిపోతుంది. మనకిందులో ఏవిధమైన ప్రమాదంగానీ, ఆపదగానీ వుండదు."

మధుమూర్తి ఆలోచించసాగాడు మౌనంగా. అతని ఆలోచనలకు అడ్డం పోకుండా, నిరంజనరావు సిగరెట్ కాల్చసాగాడు.

"ఇందులో రెండు విషయాలున్నాయి. చంద్రశేఖరం అసలు అలాటి ఉత్తరాలు బ్యాంకుకు రాస్తాడా లేదా అన్నది తెలుసుకోవాలి. ఎలాంటి పేపరు వాడతాడు? ఎలాటి కబుర్లుపయోగిస్తాడో తెలుసుకోవాలి. రెండవది: అతని సంతకం ఫోర్జరీ చెయ్యాడం మనవల్ల కాదుకాబట్టి అందుకో మనిషిని వెతకాల్సి వుంటుంది. అందువల్ల మన పథకం మరికొందరికి తెలిసే అవకాశం వుంది" అన్నాడు మధుమూర్తి.

ఫోర్జరీ యెవరితోనయినా తంటాలుపడి చేయిద్దాం. పోతే చంద్రశేఖరం దగ్గర కాగితాలు, కవర్లు, దొంగి లించే మరోమనిషి కావాలి. ఆ ఇద్దరికి మనం ఈపథకం చెప్పవలసిన అవసరం నాకు కనిపించడం లేదు. ఏదో

కొంత ముట్టచెప్పి సంపాదించవచ్చు ననిపిస్తుంది''
అన్నాడు నిరంజనరావు.

మధుమూర్తి ఆలోచనల్లో పడ్డాడు.

''తొందరేం లేదు. నువ్వుకూడా ఆలోచించు. నేనూ ఆలోచిస్తాను. పథకం పకడ్బందీగా తయారుచేద్దాం. మనకు అన్నివిధాలా నచ్చితేనే అమలు జరుపుదాం. లేకుంటే మానేద్దాం!'' అన్నాడు నిరంజనరావు.

## 2

మధుమూర్తి ఇల్లు చేరేసరికి పిల్లలు నిద్రపోయారు. భార్య ఏదో వారపత్రిక చదువుకుంటూ కూర్చుంది. భర్త రావడంచూసి లేచివచ్చి తలుపు తీసింది.

''అయినాయా ఆదివారపు సరసాలూ సరదాలూ?'' అంది విసుగ్గా.

''ఏమిటే ఆ మాటలు. నేనెళ్ళేది పాత స్నేహితుడిని కలుసుకునేందుకు మాత్రమేనని ఎన్నిమార్లు చెప్పినా నమ్మవేం?''

''స్నేహితుడయితే అతన్ని యింటికి తీసుకురారేం?''
''అతనే రాడు.''
''ఏం? ఎందుకని?'' నిలదీసింది భార్య.
''మనకు ఇబ్బందిగా వుంటుందని.''

''మనకు అనకండి. మీకు అనండి. ఆడ స్నేహితులు కాబట్టి మీరు తీసుకురారు. ఆమె రాదు. అయినా మీకేం బుద్ధులండీ! సంసారంచేసే లక్షణమేనా యిది?'' అంది కోపంగా.

"నోర్ముయ్! నా అందం, అధికారం, ఐశ్వర్యం చూసి ఎవతి నావల్లో పడుతుంది?"

"మీవంటివారే మనుషులుంటారు. పదండి భోజనం చేద్దురు గాని" అంది కాస్త మెత్తబడి.

"ఇంటికి ఎవరో వచ్చినట్లున్నారు? ఆ బ్యాగ్ యెవరిది?" అడిగాడు భార్యను.

"మా తమ్ముడు."

"ఎవరు? చంద్రమా?" అన్నాడు మధుమూర్తి.

"అవును."

"ఎందుకొచ్చినట్లో."

"ఏదో కేసు పెట్టాలిట" అంది కంచాలు పెడుతూ.

ఇద్దరూ ఆమాటా ఈమాటా మాట్లాడుకుంటూ భోజనాలు కానిచ్చారు. అంతలో చంద్రం వచ్చాడు.

"బాగున్నావా బావా?" అడిగాడు చంద్రం.

"ఆఁ! వచ్చీరాగానే వెళ్ళావెక్కడికోయ్?" అడిగాడు మధుమూర్తి.

"సినిమా చూద్దామని."

"ఏం మీవూళ్ళో లేవా?"

"ఉన్నాయి. ఇక్కడ క్రొత్తవి వుంటాయిగా. అందుకని" అంటూ కూర్చున్నాడు చంద్రం.

"తమ్ముడూ, ముందు భోజనానికిలే! తర్వాత బావతో కబుర్లు చెప్పొచ్చు" అంది మధుమూర్తి భార్య.

"నాకువద్దు. నేను బైటే తిన్నాను"

"అదేం రోగంరా!"

"ఇంటతిండి తిని తిని విసిగిపోయాను. అందుకని హోటల్లో భోజనం చేసొచ్చాను, మార్పుకోసం" అన్నాడు చంద్రం.

"అయితేనువ్వు వినుగత్తితే పెళ్ళాన్నికూడా మార్చే లాగున్నావ్?" అన్నాడు మధుమూర్తి.

"వాడు మీ బావమరిదేగా?" అంది మధ్యలో అందుకుంటూ మధుమూర్తి భార్య.

"నువ్వువెళ్ళి పడుకోవే! చంద్రం ఇంతకూ అసలు పనేమిటి?"

"కోర్టులో కేసొకటి పెట్టాలి. ఒకతనికి డబ్బిచ్చాను. అతనీవూళ్ళో వుంటున్నాడు. అందుకని ఇక్కడ ఫైల్ చెయ్యాలి." అన్నాడు చంద్రం.

"సరేలే! వెళ్ళిపడుకో. పొద్దున్నే మాట్లాడుకుందాం" అన్నాడు మధుమూర్తి తనుకూడా నిద్రకుపక్రమిస్తూ.

అంతకుముందు స్నేహితుడు నిరంజనం చెప్పిన విషయం గుర్తుకొచ్చింది. దాన్ని గురించే అతని ఆలోచనలు మొదలయినాయి. చంద్రం రాకతో అతని మెదడులో క్రొత్త మెరుపొకటి మెరిసింది.

చంద్రంకూడా కేసుపెట్టేందుకొచ్చాడు. అతన్ని లాయర్ చంద్రశేఖరం వద్దకు పంపించి, కేసు అతనికి వకాల్తా ఇవ్వమంటే బాగుంటుందనిపించింది. తమపథకం వివరించి, చంద్రంచేతే కావలసిన వస్తువులు రహస్యంగా దొంగతనం చేయిస్తే క్షేమంగా జరిగిపోతుందనిపించింది.

చంద్రంకు పని అప్పగించబోయే ముందు ఒకమారు స్నేహితుడ్ని సంప్రదించడం మంచిదనిపించింది. తెల్లవారాక నిరంజనరావును కలుసుకుని మాట్లాడాలని తీర్మానించుకున్నాడు. తాను ఆలోచించిన పథకంలో ఒక ఘట్టం దాటినట్లుగా తోచి హాయిగా నిద్ర పట్టేసింది.

ఆ రాత్రంతా కలలతోనే గడిచిపోయింది. ఉన్నపళాన మధుమూర్తికి తను లక్షాధికారి అయినట్లు, కారు

కొన్నట్లు, బంగళా సంపాదించినట్లు, ఏవేవో వ్యాపారాలు ప్రారంభం చేసినట్లు, కళ్ళముందు వంద రూపాయల నోట్ల కట్టలు దొర్లుతున్నట్లు అనిపించింది.

# 3

తొమ్మిదికొట్టినా ఆలశ్యంగా నిద్రలేచాడు ఆరోజు. భార్య గునుస్తూనే వుంది. పిల్లలు స్కూళ్ళకు తయారవుతున్నారు. చంద్రం కాఫీ టిఫిను సేవించి తీరిగ్గా పేపరు చదువుతూ కనిపించాడు.

"బావగారు బాగా పొద్దెక్కేదాకా పడుకున్నారే!" అన్నాడు చంద్రం నవ్వుతూ.

"ఆఁ! బావమరది వచ్చాడన్న సంతోషం మరి!" అంటూ కాలకృత్యాలు తీర్చుకునేందుకు వెళ్ళిపోయాడు.

"బావా! మా కేసు ఇవాళ ఫైలు చేద్దామా?" అడిగాడు చంద్రం.

"చూద్దాం! నాకీమధ్య కేసులు ఎక్కువయ్యాయి. వేరే లాయరుకు వకాల్తా చేద్దామని చూస్తున్నాను" అన్నాడు మధుమూర్తి.

"వేరే వాళ్ళంటే ఫీజు యిచ్చుకోవద్దూ..."

"అక్కర్లేదులేవోయ్. అదంతా నే చూసుకుంటాగా. నువ్వు తయారుకా. నాతోపాటు కోర్టుకు తీసుకెళతాను" అన్నాడు మధుమూర్తి.

పదింటికల్లా ఇద్దరూ బైట పడ్డారు.

హైకోర్టు దగ్గర ఆటో దిగాక చంద్రంను అక్కడే వుండమని, మధుమూర్తి పబ్లిక్ టెలిఫోన్ బూత్‌లో కెళ్ళాడు. నెంబరు త్రిప్పి, అవతల వేపునుండి 'హలో' అన్న శబ్దం రాగానే డబ్బులు పడేశాడు.

"ఎవరు నిరంజనా?"

"ఆఁ! నేనే! మధు మాట్లాడుతున్నాడా?" అవతల వేపునుండి వినిపించింది.

"అవును" అంటూ రాత్రి కష్టపడి తను ఆలోచించిన దంతా వివరంగా చెప్పాడు.

నిరంజన్ అంతా ఓపిగ్గా విని "నీ ప్లాను బాగుంది. చంద్రం నీ బావమరది గాబట్టి, అతనితో ఉత్తరోత్తరా ఏవిధమైన కోరికలు కూడా వుండకపోవచ్చు. శుభస్య శీఘ్రం. అలాగే పని ప్రారంభం చెయ్యి."

"సరే! అవసరమైతే ఫోన్ చేస్తాను. లేకుంటే మళ్ళీ ఆదివారం రాత్రే మనం కలుసుకోవడం!" అంటూ ఫోన్ పెట్టేసి వెలుపలకు వచ్చాడు మధుమూర్తి.

చంద్రం, మధుమూర్తి హైకోర్టు ఆవరణలో ప్రవేశించారు. నిర్మానుష్యంగా వున్న ప్రాంతానికి తీసుకెళ్ళాడు చంద్రాన్ని.

ఇద్దరూ కూర్చున్నారు అక్కడ.

"చంద్రం! నీతో ఒక పనిపడింది. చాలా రహస్యంగా తెలివిగా చెయ్యాలి. అందుకు తగిన ప్రతిఫలం కూడా వుంటుంది చేస్తావా?"

"ప్రతిఫలం వుందంటే చేస్తాను."

"నే చెప్పేది విను. చెయ్యగలిగితే సరే! చేసేందుకు ఇష్టం లేకున్నా, భయం వేసినా, ఆ విషయాలు ఇక్కడే మరచిపో. సరేనా?"

"సరే బావా! చెప్పు."

"లాయర్ చంద్రశేఖరమని ఒకతను వున్నాడు. అతనికి మంచి ప్రాక్టీసు వుంది. నీ కేసు అతనికిస్తానని వెళ్ళాలి. అతను ఫీజు కాస్త ఎక్కువే అడుగుతాడు.

అయినా ఫరవాలేదు. అది నేనిస్తాను. అతనికి వకాల్తా ఇవ్వు. అతని దగ్గరనుండి కొన్ని కాగితాలు దొంగిలించి తెచ్చివ్వాలి నాకు" అన్నాడు మధుమూర్తి తాపీగా.

"దొంగతనమా?"

"ఆఁ! అదేం డబ్బు కాదు. అతని లెటర్ హెడ్ కాగితాలు కొన్ని కావాలి. అతను ఎవరికన్నా ఉత్తరాలు రాసేప్పుడు ఎలాంటి కవర్లు వాడతాడో అలాంటివి రెండు మూడు తస్కరించాలి. అతని సంతకం వున్న కాగితాలేవన్నా దొరికితే అవి కూడా తీసుకురావాలి!" అన్నాడు.

"అవి అంత సులభంగా దొరుకుతాయా?"

"దొరకవు. నువ్వు ఎలాగయినా నీ తెలివితేటలన్నీ వుపయోగించి దొరకబుచ్చుకోవాలి. నువ్వేటూ కేసు అతనికి అప్పగిస్తావు కాబట్టి అతని ఆఫీసుకు నాలుగయిదు సార్లు వెళ్ళే అవకాశం వుంటుంది. ఆ అవకాశం అదనుగా పెట్టుకుని ఈ కార్యం సాధించుకు రావాలి!" అన్నాడు మధుమూర్తి.

చంద్రం కాసేపు ఆలోచించాడు.

"ఈ పని చేసినందుకు నాకేమి ప్రతిఫలం యిస్తారు?" అడిగాడు చంద్రం.

"నీ కేసు ఫీజు యిస్తాను. అదిగాక ఐదువేలురూపాయలిస్తాను."

"అంతేనా?"

"అంటే నువ్వు చేసేపని విలువ అంతకన్నా ఎక్కువ విలువయిందని అనుకుంటున్నావా?" అడిగాడు మధుమూర్తి.

"కాకుంటే మీరు ఐదువేలు యిస్తారా?"

"కాదు; ఒక క్లయింటుకి సాయం చెయ్యడం కోసం మాకీ సరంజామా కావలసి వచ్చింది. అతను పదివేలిస్తానన్నాడు. అందులో సగం నీకు ఇస్తున్నాను. మిగిలింది నాకు" అన్నాడు మధుమూర్తి.

"మీరు చెప్పిందంతా నిజమేనా?"

"ఆఁ!"

"అయితే ఒప్పుకుంటున్నాను" అన్నాడు చంద్రం.

"థాంక్స్! నీ మేలు ఈ జన్మలో మరచిపోను" అన్నాడు మధుమూర్తి.

"అలాగే నా కిస్తామన్న ఐదువేల సంగతి కూడా మరచిపోకుండా వుంటే చాలు" అన్నాడు చంద్రం అక్కడ్నుంచి లేస్తూ.

మధుమూర్తి ఒక కాగితంపైన వివరంగా రాసిచ్చాడు లాయరు చంద్రశేఖరం అడ్రసు. దాన్ని తీసుకుని ఆటోఎక్కి వెళ్ళిపోయాడు చంద్రం. ఆటో కనుమరుగవగానే, హైకోర్టు ఆవరణలోంచి వెలుపలకొచ్చి, ఫోన్ బూత్‌లో కెళ్ళి నిరంజనరావు నెంబరు త్రిప్పాడు.

"నేను మధును మాట్లాడుతున్నాను" అన్నాడు అవతలి వేపునుండి నిరంజనరావు మాట్లాడగానే—

"ఏమిటి?" అడిగాడు నిరంజన్.

"మా చంద్రంతో మాట్లాడాను. అతను ఒప్పుకున్నాడు. మన పథకం అతనికేమాత్రం చెప్పలేదు. వేరే కబుర్లు కల్పించి చెప్పాను."

"గుడ్! అతనికేమాత్రం ఇస్తానన్నావ్?"

"ఐదు వేలు."

"అలాగే! సాయంత్రం మనం మెరీనాబీచ్‌లో కలుసుకుందాం."

"ఓ. కే."

అవతలి వేపునుండి ఫోన్ పెట్టిన శబ్దం కాగానే, తను కూడా ఫోన్ కట్ చేసి, వెలుపలకి వచ్చేశాడు.

చంద్రశేఖరం సంతకం ఫోర్జరీ చేసేదెలాగాని ఆలో చించసాగాడు. అతనికి తెలిసి చాలా కేసులు జరిగాయి. ఫోర్జరీ నేరాలపైన చాలామందిని కోర్టులో శిక్షించారు. అలాటి శిక్ష అనుభవించినవాళ్ళలోంచి ఎవరినన్నా ఒకర్ని ఏరుకుని, వాళ్ళచేత చేయిస్తే బావుంటుందేమో ననిపించింది.

కోర్టు లైబ్రరీలోకి వెళ్ళి కూర్చున్నాడు. పాత కేసుల తాలూకూ రికార్డులు కొన్ని తీసుకుని ముందేసుకున్నాడు. అందులోంచి ఫోర్జరీ కేసుల కట్టలు వేరుగా పెట్టుకు న్నాడు మధుమూర్తి. మూడు పేర్లు దొరికాయి. ముగ్గురికీ కఠినశిక్ష విధింపబడింది. ఇద్దరు ఇంకా జైల్లో వున్నారు. ఒక వ్యక్తి మాత్రం విడుదలయివుండాలనుకున్నాడు. అతని పేరు శ్రీనివాసరావు. వూరు ఏలూరు.

అడ్రసు నోట్ చేసుకున్నాడు.

# 4

సాయంత్రం మెరీనాబీచ్‌లో నిరంజన్, మధు ఇద్దరూ కలుసుకున్నారు.

ఫోర్జరీ సంతకం గురించి తను ఆలోచించిన విషయం చెప్పాడు మధుమూర్తి.

"ఈ పని చెయ్యడానికి డబ్బు కావాలి. సంతకం చేయించుకున్నాక అతను డబ్బు కోసం ఆగమంటే ఆగడు" అన్నాడు మధుమూర్తి.

"ఏమాత్రం అవసరం వుంటుంది?"

"రెండు వేలన్నా కావాల్సి వుంటాయి."

"మీ బావమరది సంగతి ఏమిటి?"

"వాడికి తర్వాత యివ్వవచ్చు."

"అంటే మనం దాదాపు ఐదారు వేలు పెట్టుబడి పెట్టాల్సి వుందన్నమాట! నా దగ్గర అంత డబ్బులేదు. నువ్వేమన్నా సర్దగలవా?"

"నాది అసలు కుంటి నడక" అన్నాడు మధుమూర్తి.

"ఆ విషయం నాకూ తెలుసు. అయితే ఏం చేద్దాం?"

"ఏం చెయ్యాలన్నా నువ్వే చెయ్యాలి. నావల్ల ఏమీ కాదు."

"సరే! ఎలాగో సర్దుతాను. చంద్రం ఇవాళ నువ్వు చెప్పిన కాగితాలని తెస్తాడంటావా?"

"వాడు అఖండుడు. తెచ్చినా తెస్తాడు. ఇవాళ గాకున్నా రెండు మూడు రోజుల్లో సాధించుకురాగలడు."

"అయితే ఈలోగా నేను మధుర వెళ్ళి రావటం మంచిది. అక్కడకు వెళ్ళి బ్యాంక్‌లో అకౌంట్ ఓపెన్ చేసి వస్తాను. ఆ కాగితాలు దొరికితే నువ్వు లెటర్ టైప్ చేయించి ఏలూరు వెళ్ళి, చంద్రశేఖరం సంతకం ఫోర్జరీ చేయించుకుని రా!" అన్నాడు నిరంజనరావు.

"అలాగే!" అన్నాడు మధుమూర్తి.

"నేను మధురకు రేపు రాత్రికి వెళ్తాను. వెళ్లేలోగా నీకు రెండువేలు ఇచ్చిపోతాను."

"సరే."

"నువ్వు ఫోర్జరీ సంతకం చేయించే ముందే లెటర్ హెడ్ పైన విషయం రాయటం మంచిది కాదనిపిస్తూంది. మేటర్ ఎంతవరకు వస్తుందో వూహించుకుని సరిగా ఆ క్రింద ఖాళీ కాగితంపైన చేయించు. వీలయినంతవరకు

రెండు మూడు కాగితాలపైన చేయించడం మంచిది. మనం టైప్ చేసుకొనేటప్పుడు ఏదయినా చెడిపోయినా రెండో కాగితం వాడుకోగలుగుతాం. ఏమంటావ్?'' అడిగాడు నిరంజన్.

''అవును. నీ ఐడియా బావుంది'' అన్నాడు మధుమూర్తి.

''ఇదంతా సవ్యంగా జరిగిపోతే మనం ఈ వూర్నించి వెళ్ళిపోయి ఏదయినా మంచి వ్యాపారం చేసుకుందామని పిస్తూంది'' అన్నాడు నిరంజనరావు.

''వద్దు! అలా వెళ్ళిపోతే మనల్ని అనుమానించవచ్చు. అందువల్ల మనం ఇక్కడ వుండటమే మంచిది''అన్నాడు మధుమూర్తి.

''మీ బావమరది ఏం చేసుకొచ్చిందీ రేపు నాకు ఫోన్ చేసి చెప్పు!'' అన్నాడు నిరంజన్.

''సరే!'' అని కదిలాడు మధుమూర్తి.

# 5

భోజనాలయ్యేసరికి రాత్రి పదయింది.

చంద్రం, మధుమూర్తి ఇద్దరూ చొక్కాలు తగిలించుకుని వీధిన పడ్డారు. మాటా పలుకూ లేకుండా మౌనంగానే చాలాదూరం వెళ్ళారు. వీధి చివర్న పేవ్‌మెంటు పైన కూర్చున్నారు.

''బావగారూ! ఆ లాయరు చంద్రశేఖరాన్ని చూశాను. అతని దగ్గర క్లయింటులు లేరు. గుమాస్తా అసలే లేడు. అతనుంటున్న ఇల్లు చాలా చిన్నది. నేను వెళ్ళగానే అతనే నన్ను రమ్మని పిలిచాడు.'' అంటూ ఆగాడు బీడి వెలిగించుకునేందుకు.

"అయితే ఏమంటావ్?" అడిగాడు మధుమూర్తి.

"అలాంటి మామూలు మనిషి లెటర్ హెడ్స్‌తో మీ కొచ్చిన పని ఏమయి వుంటుందాని నాకు అర్థంగాలేదు. అందుకు మీరు దాదాపు ఐదు వేలు ఇవ్వ చూపారు. అతను మనిషే అంత ఖరీదయినవాడులా కనిపించలేదు. మరి అతని లెటర్ హెడ్స్‌కు మీరంత డబ్బు పెట్టదలుచుకోవటం నాకు విచిత్రంగానూ, కుతూహలంగానూ వుంది" అన్నాడు చంద్రం.

"అదంతా నీ కనవసరం. నీకు చిన్న పని అప్పగించాను. అది చేసినందుకు తగినదానికన్నా ఎక్కువ పారితోషికం ఇస్తానన్నాను. నీకిష్టముంటే చెయ్యి. లేదంటే మానెయ్యి" ఖండితంగా చెప్పాడు మధుమూర్తి.

"బావగారూ! అలాగనకండి. నాకు చెప్పిన పని చిన్నదే ననుకుంటున్నారు మీరు. కాని నిజానికి అదే పెద్దది. ఉత్తరోత్తరా ఏదయినా నేరానికా కాగితాలు ఉపయోగింపబడ్డట్టు ఋజువు కావచ్చు. అప్పుడా కాగితాలు దొంగిలించిం దెవరన్న ప్రశ్న వేస్తారు. నన్ను పట్టుకొంటే మీరు అడ్డువచ్చి రక్షించగలుగుతారా?" అడిగాడు చంద్రం.

"ఒకవేళ నీకు చెబితే మాత్రం, నువ్వు నిన్ను అలాంటి ఆపదనుండి ఎలా తప్పించుకోగలుగుతావు?" అడిగాడు మధుమూర్తి.

"ఎలాంటి ఆపద రాగలదో కనీసం వూహించుకో గలను. అందుకు సన్నద్ధంగావుండే వీలుంటుంది. అదృష్టం బాగుంటే తప్పించుకోగలుగుతాను."

"ఇది నీకు చెప్పడం వీలుకాదు. నే చెప్పింది మరచి

పో. వేరే ఎవర్నన్నా చూసుకుంటాను'' అన్నాడు మధుమూర్తి కోపంగా.

''అయితే రేపే వెళ్ళి ఆ చంద్రశేఖరంగారితో మీ రేదో కుట్ర తలపెట్టినట్లు చెపుతాను. అతని కాగితాలు జాగ్రత్తగా పెట్టుకోమని చెపుతాను. దాంతో మీ ఆట కట్టవుతుంది.''

''అతను నమ్మడు.''

''నీ బావమరదిని స్వయానా వెళ్ళి వివరంగా చెప్తూంటే, నమ్మకపోవడానికి అతనేం వాజమ్మ కాదు'' అన్నాడు చంద్రం.

మధుమూర్తి ఆలోచనలో పడ్డాడు.

అసలే చంద్రం పెద్ద లిటిగెంటు. మడత పేచీలు వెయ్యడంలో పెద్ద దిట్ట. అతని బ్రతుకు తెరువు కూడా అదే. అతనితో అనిలీ వ్యవహారం కదలించకుండా వుండి వుంటే బాగుండేదేమోననిపించింది.

''ఏంటి బావా ఆలోచనలో పడ్డావ్?'' హెచ్చరించాడు చంద్రం.

''ఏం లేదు! నాకో స్నేహితుడున్నాడు. అతనే ఈ పని నాకు అప్పగించాడు. అసలీ కాగితాలెందుకో నాకూ తెలీదు. రేపు అతన్ని కలుసుకొని అడిగి తెలుసుకుంటాను. ఆ తర్వాత నీకు చెపుతాను'' అన్నాడు మధుమూర్తి.

''ఈ మాట నేను నమ్మను. లాయరువై వుండి అన్ని సంగతులూ తెలుసుకోకుండా, ఈ పనిలోకి నీలాంటి మనిషి దిగడు'' అన్నాడు చంద్రం ఖండితంగా.

''నీ నమ్మకంతో నాకు పనేమీ లేదు. నిజం చెప్పాను'' అన్నాడు మూర్తి.

"అయితే ఎల్లుండి ప్రొద్దుటదాకా ఆగుతాను. ఆ తర్వాత నాకు నిజం చెప్పకపోతే, అన్నంతపనీ చేస్తాను" అన్నాడు చంద్రం.

"అలాగే చేద్దువుగాని. పద ఇంటికె పోదాం!" అన్నాడు మూర్తి లేచి నిలుచుని. చంద్రం కూడా అతన్ని అనుసరించాడు.

## 6

అంతా విన్నాడు నిరంజనరావు, మధుమూర్తి చెప్పిందంతా.

"మన ఇద్దరికన్నా చంద్రం తెలివిగలవాడులా వున్నాడు" అన్నాడు కాఫీ తాగి.

"ఏం తెలివో! మధ్య నా ప్రాణాలు తీస్తున్నాడు" నిస్పృహతో నిట్టూర్చాడు మధుమూర్తి.

"అలాగనకు. అతన్ని కూడా మనలో భాగం కలుపుకుందాం."

"నువ్వీ మాట మనస్ఫూర్తిగా చెప్తున్నావా?" ఈ

"ఆc! మనస్ఫూర్తిగానే చెపుతున్నాను. సాయంత్రం ఇద్దరూ బీచ్‌కి రండి. అక్కడ మాట్లాడుకుందాం. అతని మొత్తం నేనే చెపుతాను" అన్నాడు నిరంజనరావు.

"అలాగే!" అని మధుమూర్తి వెళ్ళిపోయాడు.

సాయంత్ర బీచ్‌లో ముగ్గురూ కలుసుకున్నారు. మధుమూర్తి చంద్రాన్ని పరిచయం చేశాడు. అంతా ఇసుకలో కూచున్నారు.

నిరంజనరావు తన పథకం మొత్తం చెప్పాడు. చంద్రం చప్పుడు చెయ్యకుండా, మధ్య మధ్య ప్రశ్న

లేవీ అడగకుండా విన్నాడు. అంతా ముగిశాక "ఇదీ మా పథకం. ఎలా వుంది?" అడిగాడు నిరంజనరావు.

"చాలా బాగుంది. కానీ లాయరు చంద్రశేఖరం ఇంటికి వెళ్ళాను. చూశాను. అతని కంత డబ్బు వుంటుందని నాకనిపించడం లేదు" అన్నాడు చంద్రం.

"ఆ విషయంలో నాకు అనుమానం లేదు. ఒకవేళ అలా లేదనుకుందాం. అందువల్ల జరిగే ప్రమాదమేమీ లేదు. మన ప్రయత్నం అక్కడే ఆగిపోతుంది. మనం సురక్షితంగానే వుంటాం. కాకుంటే ఖర్చుల క్రింద కొంత మన డబ్బు పోతుంది" అన్నాడు నిరంజనరావు.

"అలాగనుకుంటే మనం ప్రయత్నం ప్రారంభించచ్చు" అంటూ చంద్రం చొక్కా లోపలనున్న బనీను వెనుకనుంచి ఒక ప్లాస్టిక్ కవరు వెలుపలకు తీశాడు.

"ఏమిటది?" అడిగాడు మధుమూర్తి.

జవాబు చెప్పకుండా దాన్ని తెరిచాడు. అందులోంచి కొన్ని కాగితాలు, కవర్లు వెలుపలకు లాగాడు.

"అయితే సాధించుకొచ్చావన్నమాట!" అన్నాడు నిరంజనరావు ఆనందంగా.

"ఆఁ! నాలుగు లెటర్ హెడ్స్, నాలుగు కవర్లు. అతను సంతకం చేసిన వకాల్తా కాగితం పట్టుకొచ్చాను. ఇవి చాలనుకుంటాను" అన్నాడు చంద్రం.

"నువ్వు అఖండుడివి. ఎలా తెచ్చావ్?"

"ఆ వివరాలు అనవసరం. ఇక జరగవలసింది చూడండి. చంద్రశేఖరంగారింట్లో పాత గాడ్రేజ్ టైప్ మిషనుంది. అతని ఉత్తరాలు దానిపైనే టైపు చేస్తూ వుండవచ్చు" అన్నాడు చంద్రం.

"అచ్చా! అది కూడా చూశావన్న మాట! మనం సెపు చేయించేటప్పుడు ఆ మోడల్ మిషన్ మీద నే చేయించవచ్చు."

"అన్ని వివరాలు ఒకేసారి తెలుసుకోవటం మంచిది. పదే పదే వెళ్తే పదిమంది కంట్లో పడతాం" అన్నాడు చంద్రం.

"ఇప్పుడు ఇక జరగవలసింది, చంద్రశేఖరం సంతకం ఈ కాగితాలపైన ఫోర్జరీ చేయించడమే" అన్నాడు నిరంజనరావు.

"మీకు తెలిసినవాళ్ళున్నారా?"

"నాకు తెలిసినతనున్నాడు ఏలూరు దగ్గర. అతని దగ్గరకు వెళ్దామనుకుంటున్నాను" అన్నాడు మధుమూర్తి.

"అంటే మన వ్యవహారం నాలుగో మనిషితో పంచుకోవటమన్నమాట అది నాకిష్టం లేదు" అన్నాడు చంద్రం.

"మరెలా?"

"ఫోర్జరీ చెయ్యడం ఒకరకంగా విద్యే. అది పెద్ద సాధించలేని విద్య కాదు. అభ్యాసం కావాలి. ఎవరైనా పట్టుదలతో ఒకటికి పదిసార్లు లేదా పదివేలసార్లు ప్రయత్నం చేస్తే, ఎవరి సంతకమయినా ఫోర్జరీ చెయ్యవచ్చు. మనం ముగ్గురం వున్నాము. అందరం ప్రయత్నం చేద్దాం. ఎవరు చెయ్యగలిగినా సరిపోతుంది. నాలుగో మనిషి అవసరం వుండదు" అన్నాడు చంద్రం.

"నీ అభిప్రాయం బాగానే వుంది. కానీ మనవల్ల అవుతుందా?" అనుమానం వ్యక్తపరచాడు మధుమూర్తి.

"మనం ప్రారంభించిన పని మాత్రం ఎటువంటిది?

ఇంతకు ముందు మీరు చేసిందేమీ గాదుగా. మీ మేధస్సులు పని చేశాయి. ఈమారు, చేతులు పని చేస్తాయి. అంతే!'' అన్నాడు చంద్రం.

''చంద్రం చెప్పిందే బాగుంది. మనమే ప్రయత్నిద్దాం! మనవల్ల కాదని తేలిపోతే అప్పుడే వేరే ప్రయత్నం చేద్దాం!'' అన్నాడు నిరంజనరావు.

''అందరూ అవసరం లేదు. నేనే ప్రయత్నిస్తాను. రెండ్రోజులు టైమివ్వండి చాలు!'' అన్నాడు విశ్వాసంగా చంద్రం.

''రైట్! ఆ బాధ్యత నీదే!'' అన్నాడు నిరంజనరావు.

''మీరు రేపు మధురకు వెళ్ళండి. అకౌంట్ ఓపెన్ చేసి రండి. మీరు వచ్చేసరికి నేను సంతకం చెయ్యడం నేర్చుకుంటాను. మనముగ్గురం కూర్చుని వుత్తరం తయారు చేద్దాం. ఆ తర్వాత పంపుదాం'' అన్నాడు చంద్రం నిరంజనరావుతో.

''ఓ. కే.'' ఒప్పుకున్నాడు నిరంజనరావు.

''మరో విషయం. ఆశకు అంతుండదంటారు. మనకు పది లక్షలు దొరికినా మరో పది లక్షలు దొరకలేదే అనుకుంటాం. మన పథకం దిగ్విజయంగా జరగాలంటే మన ఆశకు ఒక అంతం పెట్టుకోవాలి!'' అన్నాడు చంద్రం.

''అంటే?'' అడిగాడు మూర్తి.

''మీరు లక్ష రూపాయలు ట్రాన్స్‌ఫర్ చెయ్యమని రాద్దామని నిర్ణయించుకున్నారు. అంత డబ్బు అతని అకౌంటులో లేకపోవచ్చు. ఉన్నా అంతంత మొత్తం ట్రాన్స్‌ఫరు చేయటంలో ఏవైనా జాగ్రత్తలు బ్యాంకు తీసుకోవాలన్న నియమం వుండవచ్చు. కాబట్టి మనం అనుకున్న మొత్తాన్ని తగ్గించడం మంచిది'' అన్నాడు చంద్రం.

"ఎంత మొత్తం అడుగుదాం?" నిరంజనరావు అడిగాడు.

"ముందు పదిహేను వేలు పంపమందాం. తలా ఐదు వేలు వస్తాయి. ఖర్చులు కూడా ముగ్గురం పంచుకుందాం. అది జయప్రదంగా జరిగిపోతే ఆ తర్వాత మరో వుత్తరం పంపుదాం!" అన్నాడు చంద్రం.

"గుడ్! నీ తలలో వున్నదంతా మెదడేనోయ్! మాకు ఇక నువ్వే నాయకుడివి. నువ్వు చెప్పినట్లు మేమిద్దరం చేస్తాం" అన్నాడు నిరంజనరావు.

మధుమూర్తి అవాక్కయి చూడసాగాడు.

చంద్రం బావగార్ని చూసి చిరునవ్వు నవ్వాడు.

## 7

"ఇవాళ ఆరో రోజు!" అన్నాడు చంద్రం.

"ఏమిటి?" అనడిగాడు నిరంజన్.

"మనం ఉత్తరం పోస్టు చేసి" అన్నాడు మధుమూర్తి.

"ఉత్తరం చేరేందుకు మూడు రోజులు పడుతుంది. ఆ తర్వాత బ్యాంక్‌లో కనీసం మరో మూడు రోజులు తీసుకొంటుంది. డబ్బు ఇండియాకు బదిలీ చేసినట్లు పంపే ఉత్తరం ఇక్కడకు రావడానికి మరో మూడు రోజులు పడుతుంది. అంటే ఇంకొక నాలుగు రోజులన్నా మనం ఆగి చూడాలి ఓపిగ్గా!" అన్నాడు నిరంజనరావు.

"మూడు రోజులా? నాకు మూడు యుగాల్లా వుంది" అన్నాడు మధుమూర్తి.

"పోలీసులకు చిక్కామంటే మన ముగ్గురం కనీసం మూడేళ్ళన్నా జైలు కమ్మీలు లెఖ్ఖపెట్టిస్తారు. అంత ఆగలేకపోతే ఎలా?" కోపంగా అన్నాడు చంద్రం.

"మీ బావమరదుల సరసాలు ఆపండి. ఆ డబ్బు డ్రా చెయ్యటం ఎలా?"

"సెల్ఫ్ చెక్ రాయండి. నేను తీసుకెళ్ళి కాష్ తెస్తాను" అన్నాడు చంద్రం.

"వద్దులే! నేను తెస్తాను. చెక్ నాకు రాసివ్వు" అన్నాడు మధుమూర్తి.

"ఏం నేను డబ్బు తీసుకుని మీకు భాగం ఇవ్వననేగా నీ భయం! అలాంటి అనుమానాలు పెట్టుకోవద్దు" అన్నాడు చంద్రం.

"ఛ! అందుక్కాదు. నేనూ నిరంజనరావూ మధుర వెళ్ళి డబ్బు తెస్తాం. నువ్వు ఇక్కడే వుండి, లాయర్ చంద్రశేఖరంకు ఆ బ్యాంక్ నుంచి డబ్బు అతను కోరిన ప్రకారం బదిలీ చేస్తున్నట్లు ఉత్తరం వస్తుందేమో గమనించి దాన్ని చిక్కించుకోవాలి.

"నువ్వు నీ కేసు విషయంలో వెళ్ళినట్లుగా వెళ్ళి, పోస్టు వచ్చేసమయానికి అలాంటి వుత్తరం వస్తే ఎలాగయినా అతనికి అందకుండా చూడు. అది వీలుగాక పోతే మధురలో మేమున్న హోటల్ కు ట్రంకాల్ చెయ్యి. డబ్బు డ్రా చెయ్యకుండా ఆగిపోతాం!" అన్నాడు మధుమూర్తి.

"ఇది బాగానే వుంది. ఈ పని నీవల్లే అవుతుంది" అన్నాడు నిరంజనరావు.

# 8

మూడు రోజులు గడిచిపోయాయి.

నిరంజనరావు, మధుమూర్తి మధుర వెళ్ళి హోటల్

మీనాక్షిలో బస చేశారు. చంద్రం మద్రాసులో గోపాల పురం చుట్టూ తిరగటం మొదలెట్టాడు.

నిరంజనరావు బ్యాంకుకు ఫోన్ చేసి, యస్. ఆర్ముగం అకౌంట్‌లో డబ్బేదయినా క్రెడిట్ అయిందాని అడిగాడు. అవతలనుండి మేనేజరు అయిందని చెప్పాడు.

నిరంజనరావు గదిలో ఎగిరి గంతులు వెయ్యసాగాడు.

"ఏమయింది?" అడిగాడు పట్టుకుని మూర్తి.

"డబ్బు వచ్చిందట" చెప్పాడు నిరంజనరావు.

"అబ్బ! మన ప్లాను మిల్లిమీటరు తేడా లేకుండా అమలు జరిగింది. సరే చెక్ రాయి" అన్నాడు మూర్తి.

నిరంజనరావు రాసిచ్చాడు.

చెక్ అందుకుని చిందులు వేసుకుంటూ వెళ్ళిపోయాడు మధుమూర్తి. ఆటో మాట్లాడుకున్నాడు బ్యాంక్‌దాకా. బ్యాంక్ దగ్గర దిగగానే అతనికి భయం వేసింది. చెక్ మార్చుకోను వచ్చిన మామూలు మనిషిలా గాకుండా, దొంగతనం చెయ్యడానికి వచ్చిన వాడిలా ఫీలయ్యాడు.

సంతకం చేసిన చెక్ ఇవ్వగానే, కౌంటర్‌లో వున్న గుమాస్తా టోకన్ ఇచ్చాడు. ఆ తర్వాత పది నిముషాలకు నూటయాభై వందరూపాయల నోట్లు తీసుకుని బ్యాంక్ వెలుపలకు వచ్చాడు మూర్తి. క్షణం ఆగకుండా, కనుపించిన ఆటో ఎక్కి మీనాక్షి హోటల్‌కు పోనిచ్చాడు.

రెండేసి మెట్లు ఒక్కసారే ఎక్కుతూ పైకి వెళ్ళాడు. గదిలోకి దూరి తలుపులు బిగించి, వందరూపాయల నోట్లు నడిమంచంమీద వేశాడు.

ఎవరో తలుపు తట్టిన చప్పుడయింది.

ఇద్దరూ కర్రల్లా బిగుసుకుపోయారు. అంతకు ముందు దాకా పురకలు వేసిన ఆనందం, ఒక్కసారిగా అంతర్ధానమైపోయింది.

గబగబ డబ్బు పోగుచేసి, పరుపు క్రిందకు తోశాడు మూర్తి.

"ఎవరది?" అడిగాడు నిరంజనరావు.

జవాబు రాలేదు. కానీ తలుపు చప్పుడైంది.

లాభం లేదని వెళ్ళి తలుపు తీశాడు. ఎదురుగా చంద్రం కనుపించాడు.

"నువ్వా? ఎందుకొచ్చావ్?" అడిగాడు మూర్తి.

"ఏం రాకూడదా?"

"నీకు ఒప్పగించిన పని వదలిపెట్టి ఇలా రావడం ప్రమాదం కదూ!" అడిగాడు మూర్తే మళ్ళీ.

"నేనేం పసిపిల్లాడ్ని కాదు. అతని కలాంటి ఉత్తరాలు రాలేదు, రావు. ఆ విషయం రూఢి చేసుకున్నాక వచ్చాను" అన్నాడు చంద్రం,

"ఎలా రూఢి అయింది?" అడిగాడు నిరంజన్.

"పోస్టుమేన్‌నుపట్టుకున్నాను.అతన్ని వాకబుచేశాను. ఆ ఏరియాలోనే అతను రెండేండ్లుగా పని చేస్తున్నాడట. ఇతర దేశాల నుండి అతనికి అంతగా ఉత్తరాలు రావట. ఏటా ఒక్కసారి మాత్రం లావుపాటి కవరొకటి బ్యాంక్ నుండి వస్తుందట. అందువల్ల వచ్చేశాను" అన్నాడు చంద్రం.

"నయం. ఆ మాత్రం కనుక్కున్నావ్" అన్నాడు మధుమూర్తి.

"ఇంతకూ ఏమయింది?" అడిగాడు చంద్రం.

నిరంజనరావు పరుపు పైకెత్తి చూపించాడు. క్రింద వందరూపాయల నోట్లు చెల్లాచెదురుగా పడి వున్నాయి. వాటిని చూడగానే చంద్రం కళ్ళు గర్వంతో మెరిశాయి.

ముగ్గురూ తలో ఐదువేలు పంచుకున్నారు.

"మళ్ళీ వుత్తరం పంపుదాం" అన్నాడు మూర్తి.

"చంద్రం ఎంత డబ్బు బదిలీ చెయ్యమందాం?" అడిగాడు నిరంజనరావు.

"తక్కువ తక్కువగా రాస్తే మన దగ్గరుండే మూడు కాగితాలతో మరో యాభైవేలు వస్తుంది. అవతల వాళ్ళ క్కూడా అనుమానం రావచ్చు. పెద్ద మొత్తం రాస్తే, అంత డబ్బు వుంటుందో, వుండదో మనకు తెలీదు. కాబట్టి, అకౌంటులో వున్న మొత్తం డబ్బు బదిలీ చెయ్య మంటే సరిపోతుంది" అన్నాడు చంద్రం.

"బ్రహ్మాండమైన ఐడియా!" అన్నాడు నిరంజనరావు మెచ్చుకుంటూ.

"ఈ దెబ్బతో లాయరు చంద్రశేఖరం దివాలా తీస్తాడు" అన్నాడు మూర్తి.

అక్కడికక్కడే కూర్చొని లెటర్ తయారు చేశారు. అంతకు ముందే సంతకాలు చేసివున్న కాయితాలు తీసు కుని, చిన్న టైప్ ఇన్‌స్టిట్యూట్‌లోకి వెళ్ళి తమకు కావలసిన మెషిన్ మీద ఉత్తరం టైపు చేసుకుని, అందుకు ప్రతిఫలంగా పదిరూపాయలు ఇచ్చి బైటపడ్డారు. ఆ ఉత్తరం మధురనుండే పోస్టు చేశారు. రాత్రి రైలుకు టిక్కెట్లు కొనుక్కుని మద్రాసుబయులుదేరారు ముగ్గురూ.

# 9

మళ్ళా తొమ్మిది రోజులు గడచిపోయాయి.

ముగ్గురూ మధురకు టాక్సీలో బయలుదేరారు. అంతకు ముందులాగే మీనాక్షి హోటల్‌లో రూమ్ తీసుకుని దిగారు.

నిరంజనరావు ఫోన్ చేశాడు బ్యాంకికి. మేనేజర్ ఫోనందుకుని "హల్లో" అన్నాడు.

"మేనేజరుగారేనా?" అడిగాడు నిరంజనరావు.

"అవును. మీరెవరు?"

"యస్. అర్కుగాన్ని. నా అకౌంటు నెంబరు ఆరు వందలా ఆరు. నా అకౌంటుకు కొంత డబ్బు జమ కావల్సి వుంది. అది అయిందో లేదో చూసి చెపుతారా?" అడిగాడు.

"చూడనవసరం లేదు. జమ అయింది. మీరెక్కడ నుంచి మాట్లాడుతున్నారు?" అడిగాడు అవతలివేపు నుండి మేనేజర్.

"ఇప్పుడే ఈ వూరొచ్చాను. పబ్లిక్ టెలిఫోన్ నుంచి మాట్లాడుతున్నాను" అన్నాడు తప్పకన ఎందుకయినా మంచిదని.

"ఓసారి మీరు బ్యాంక్‌కి రాగలరా?"

"ఎందుకు?"

"మిమ్మల్ని చూడాలంటూ మద్రాసునుంచో మనిషి వచ్చాడు. మీతో పనుందట. మిమ్మల్నింతకు ముందు చూడలేదట. వస్తారా?"

"చాలా బిజీగా వున్నాను. ఇంతకూ నా అకౌంటు కెంత జమయిందో చెప్పలేదు."

"ఇరవై రెండు లక్షల రూపాయలు" అన్నాడు మేనేజర్.

ఫోన్ చేతిలో నుంచి జారి క్రిందపడిపోయింది.

చంద్రం తక్షణ ఫోన్ కట్ చేసి పారేశాడు. నిరంజనరావు మంచంపైన కూలబడ్డాడు.

"ఏమయింది?" అడిగాడు చంద్రం ఆత్రుతగా.

"ఇరవై రెండులక్షల రూపాయలు ట్రాన్స్‌ఫర్ చేశారట."

"అయితే అలా నీరుగారిపోయారేం?"

"నన్ను చూడాలంటూ ఒకమనిషి తిష్టవేసుకుని కూర్చున్నాడుట. అతను మద్రాసునుండి వచ్చాడుట. మేనేజర్ చెప్పాడు" అన్నాడు నిరంజనరావు.

"అంటే మనంచేసిన మోసం చంద్రశేఖరంకు తెలిసిపోయింది. ఇక మనం ఆ బ్యాంకుజోలికి పోయి లాభం లేదు" అన్నాడు చంద్రం.

"ఎలా తెలిసుంటుంది?" అడిగాడు మూర్తి.

"ఏమో? నా ఊహాప్రకారం అతనుకూడా కొంత డబ్బు పంపమని బ్యాంకుకు లెటర్ పంపివుంటాడు. అతని ఉత్తరంకన్నా మన ఉత్తరం ముందు చేరివుంటుంది. డబ్బు మొత్తం ఆర్యోగం అకౌంటుకు ట్రాన్స్‌ఫర్ చేసివుంటారు. రెండో ఉత్తరం చేరగానే లాంగ్ డిస్టన్స్ కాల్ చేసి జరిగింది చంద్రశేఖరంకు చెప్పివుంటారు. అతను రెండు దినాలనుండే ఇక్కడ వుండివుంటాడని నా అనుమానం" అన్నాడు చంద్రం.

"అదే అయివుండాలి!" అన్నాడు నిరంజనరావు.

"ఇప్పుడేమిటి చెయ్యడం?"

"మనం దాని జోలికి పోకూడదు. గుట్టుగా మద్రాసు వెళ్ళిపోదాం. చంద్రశేఖరం ఆ డబ్బు తాకలేదు. ఎప్పటి కయినా అది మనదే. అతను ఎన్నిరోజులు అలా కని

పెట్టుకుని వుండగలుగుతాడో చూద్దాం'' అన్నాడు చంద్రం.

''ఐడియా బాగానేవుంది. అయితే వెళ్ళిపోదామా?'' అడిగాడు మూర్తి.

''ఊఁ!'' అన్నాడు నిరంజనరావు.

ముగ్గురూ గది ఖాళీచేసి మద్రాసు వెళ్ళేందుకు టాక్సీ మాట్లాడుకున్నారు.

టాక్సీ స్పీడుగా పోతోంది.

''ఇంతడబ్బు అతనికెక్కడనుండి వచ్చి వుంటుంది?'' అడిగాడు చంద్రం నోరుమూసుకుని కూర్చోలేక.

''అదే నాకు అర్థంగావటంలేదు. ఏదయినా స్మగ్లింగ్ వ్యాపారం చేస్తున్నాడేమో?'' అనుమానం వ్యక్తం చేశాడు నిరంజనరావు.

''ఈడబ్బు అతనిదయి వుంటుందని నేననుకోను. టి. వి. లు కొన్నప్పటినుంచే నాకు అనుమానంగావుంది'' అన్నాడు మధుమూర్తి.

''టి. వి. లేమిటి?'' అడిగాడు చంద్రం.

నిరంజనరావు వివరంగా చెప్పాడు.

''ఇక ఈ విషయాలు చర్చించవద్దు. మద్రాసుకెళ్ళాక మాట్లాడుకుందాం''అంటూ ఇద్దరికీ డ్రయివరును చూపించి సైగచేశాడు.

నాలుగోమనిషి ముందు యీ విషయం చర్చించటం క్షేమం కాదన్న సంగతి వాళ్ళకు అర్థమయింది.

టాక్సీ వేగంగా పరుగెత్తుతూ నేవుంది. రాత్రి పన్నెండుకి మద్రాసు చేరారు.

# 10

నిరంజనరావు, చంద్రం వేరే టాక్సీ చేసుకొని మాంబళం వెళ్ళారు.

ఒక ఇంటిముందాగింది టాక్సీ. దిగి లోనికి వెళ్ళారు. కాలింగ్ బెల్ నొక్కగానే తలుపు తెరచుకుంది. ఎదురుగా అందమైన అందాల భరిణె వయ్యారాలు ఒలకపోస్తూ కనుపించింది.

"బిజీగావున్నావా?" అడిగాడు నిరంజనరావామెను.

"లేదు ఖాళీగానే వున్నాను వారంనుంచి. రండి" అంది నవ్వుతూ.

"ఇతను నా ఫ్రెండు చంద్రం. హిందీ సినిమా తీస్తున్నాడు" అన్నాడు ముందుగా నిర్ణయించుకున్నట్లుగా నాటకం నడుపుతూ.

చంద్రంకు నమస్కారం పెట్టింది ఆమె.

"ఈమె పేరు జ్యోతి. ఈవిడగురించే చెప్పింది మీకు" అన్నాడు నిరంజనరావు.

"ఏం చెప్పారు?"

"అందమయిన క్రొత్తమ్మాయిని హీరోయిన్‌గా బుక్ చేద్దామనుకుంటున్నాడట. నిన్ను సజెస్టు చేసాను" అన్నాడు నిరంజనరావు.

"థాంక్స్! హీరో ఎవరు?"

"అమితాబ్-బచ్చన్‌ని పెట్టాలనుకుంటున్నాను" అన్నాడు చంద్రం.

"ఐ లైక్ హిమ్! ఐ లైక్ హిమ్! అతనితో హీరోయిన్‌గా వేయటం అదృష్టంగా భావిస్తాను. నాకు యీ అవకాశం ఖచ్చితంగా కలిగించాలి" అంది జ్యోతి.

"అలాగే! కానీ మీవల్ల నాకో చిన్న సాయంకావాలి. మా నిరంజనం మాటల్లో మీకు లాయర్ చంద్రశేఖరం

బాగా తెలుసునని తెలిసింది. మీ టెలివిజన్ సెట్ కు అతనే డబ్బు ఇచ్చాడట. అతను బాగా వున్నవాడని ఇతని అభిప్రాయం. అతనితో మీ పరిచయం ఎలాంటిదో నాకు తెలీదు. కానీ అతనిచేత నాకు కొంతడబ్బు పెట్టుబడి పెట్టించాలి. నేను ఇరవైలక్షలుదాకా పెడుతున్నా. ఇంకా పది లక్షలు కావాలి!" అన్నాడు చంద్రం.

"అతన్ని నాకు తెలీదు. అతను డబ్బుగలవాడుకూడా కాదు. అతని బాస్ ఒకతను వున్నాడు. కొన్ని సినిమాలకూడా డబ్బు పెట్టాడు. పెద్ద ఎత్తున దొంగవ్యాపారము చేస్తున్నాడల్లేవుంది. మద్రాసు వచ్చినప్పుడు నాతో గడుపుతాడు. చాలా భయంకరమైన మనిషి. అతను లోపలుంటే ఇంటిచుట్టూ పదిమంది తిరుగుతూంటారు అతని మనుషులు. ఈమారు అతను వచ్చినప్పుడు అడిగి చూడమంటే చూస్తాను" అంది జ్యోతి.

"అతని పేరు తెలుసా?" అడిగాడు చంద్రం.

"వాళ్ళంతా బాస్ బాస్ అంటారు. అతని మెళ్ళో లాకెట్ వుంది. దాని డాలర్ పైన 'రాకేష్' అనివుంది. అదే అతని పేరేమో నాకు తెలీదు" అంది జ్యోతి.

"అతను డబ్బు పెట్టినా పెట్టకున్నా మీకు వేషం ఖచ్చితంగా ఇస్తాను. వేరే యిద్దరు ముగ్గురుకూడా ముందుకొచ్చారు సాయం చేసేందుకు. మీకు త్వరలో కబురు పంపుతాను. కబురు అందగానే రావడానికి సిద్ధంగా వుండండి" అన్నాడు చంద్రం.

"అలాగే" అంది జ్యోతి.

"వస్తాను!" అంటూ లేచాడు చంద్రం.

"వేరే అవసరమైన పనేమీ లేకపోతే ఈ రాత్రికిక్కడ వుండి పోకూడదూ?" అడిగింది అందంగా.

"సారీ చాలా పనులున్నాయి. చూసుకోకపోతే ప్రాణంమీదికొస్తాయి. వెళ్తాను" అంటూ బయటపడ్డాడు చంద్రం. నిరంజనరావుకూడా అతన్ని అనుసరించాడు. కొంతదూరం వెళ్ళాక టాక్సీని వదిలేశారు.

"విన్నావా?" అడిగాడు చంద్రం.

"ఆc!" అన్నాడు నిరంజనరావు.

"ఆ డబ్బు మొత్తం రాకేష్‌ది. అతనెవరో తెలుసా. మనదేశంలోకల్లా పెద్ద స్మగ్లర్. అతనిక్రింద కొన్ని వేలమంది వున్నారు. అందరిదగ్గరా ఆయుధాలున్నాయి. అతనికి తనడబ్బునెవరో దొంగిలించినట్లు తెలిసిపోయింది. ఇక మొదలవుతుంది వేట. మనల్ని పట్టుకోవడంవాళ్ళకు కష్టంకాదు" అన్నాడు చంద్రం.

నిరంజనరావు మొఖాన కత్తివాటుకు నెత్తురుచుక్కలేదు.

# 11

ముగ్గురూ మౌనంగా కూర్చున్నారు. ఒక్కరినోటి వెంట మాటరాలేదు.

"ఆ బ్యాంక్ చుట్టూ గట్టి బందోబస్తు పెట్టివుంటారు" అన్నాడు మధుమూర్తి నిశ్శబ్దాన్ని బ్రద్దలుచేస్తూ.

"ఆc! ఆ ప్రాంతాలకు పోవడం ప్రాణాలమీదికి తెచ్చుకోవడమే."

"ప్రతిదానికీ అలా నీరుకారిపోయే మీరు అసలిటు వంటి పనులకెందుకు దిగినట్లు" కోపంగా విసుక్కున్నాడు చంద్రం తన ఆలోచనలకు అడ్డురావడంతో.

“ఇలాంటి ప్రమాదం మనం ఎదురుచూడనిది. ఇప్పుడు ఆ రాకేషునుంచి ప్రాణాలతో తప్పించుకోవడం ఎలా?” అడిగాడు నిరంజనరావు.

“ఇందుకు మార్గాలు కొన్ని కనిపిస్తున్నాయి. వాటిల్లో ఏది బాగుంటుందో ఆలోచిస్తున్నాను.”

“ఏమిటవి? మాకు చెప్పు” నడిగాడు మధుమూర్తి.

“ఆ డబ్బు నీ అకౌంటులో వున్నంతవరకు అతను నిన్ను చంపడు. చంపితే అంత మొత్తం అనవసరంగా ఎవ్వరికీ చెందకుండా పోతుంది. అలాగాకుండా నిన్ను చిక్కించుకుని నీచేత రాయించుకొని, ఆ తర్వాత కసికొద్దీ చంపి పారేసే అవకాశం వుంది. మనం ఈలోగా అతనితో బేరానికి దిగవచ్చు. ఒకటి మన ప్రాణ రక్షణ కోసం సంవత్సరానికి లక్ష రూపాయల వంతున అతని డబ్బు అతనికి తిరిగి ఇస్తామని చెప్పవచ్చు. అందుకు ఒప్పుకుంటే దాదాపు ఇరవై రెండు సంవత్సరాలు మనకు ప్రాణభయం వుండదు. అలా కాదంటే, అతన్ని ఎదుర్కొని చంపడానికి మనం సిద్ధపడాలి. ఇంతకన్నా మార్గాలు నాకు కనుపించలేదు” అన్నాడు చంద్రం.

“అతన్ని చంపగలమా?”

“మనం చావడం తథ్యం అని తెలిశాక అతన్ని చంపడానికి ప్రయత్నించి, ఆ ప్రయత్నంలో చచ్చినా ఫర్వా లేదు.”

“అంటే మన ముగ్గురి ప్రాణాల విలువ కేవలం పది హేను వేల రూపాయలన్న మాట!” మధుమూర్తి అన్నాడు.

“అన్నమాట కాదు! అది వున్నమాట.”

"దానికన్నా అతనితో బేరానికి దిగితే ఎలా వుంటుంది?" అన్నాడు నిరంజనరావు.

"బాగానే వుంటుంది. ఇంతకీ ఆ రాకేషెక్కడుంటాడు! వాడ్ని కలుసుకోవడమెలా? మన తరఫున అతని దగ్గర బేరం చేసేదెవరు?" అడిగాడు మూర్తి.

"లాయర్ చంద్రశేఖరంద్వారానే జరగాలి యీ ఘట్టమంతా" చంద్రం చెప్పాడు.

"అతన్ని కలుసుకుంటేమనల్ని రాకేషుకు పట్టివ్వడా?" తన అనుమానం విశదీకరించాడు నిరంజనరావు.

"మనం నేరుగా వెళ్ళవద్దు. ఏదో పబ్లిక్ బూత్ నించి మాట్లాడుదాం."

"సరే నీ యిష్టప్రకారమే కానివ్వు! నిండా మునిగాక చలేమిటి?" అన్నాడు నిరంజనరావు దిగులుగా.

"నాకింకో ఆలోచన వస్తూంది."

"ఏమిటి?"

మనం ఈ సమాచారం ప్రభుత్వానికి చెప్పి వాళ్ళ రక్షణకోరితే ఎలావుంటుంది" అడిగాడు నిరంజనరావు.

"మామూలుగా స్మగ్లర్స్‌కు పెద్దపెద్ద వాళ్ళతో లావాదేవీలు వుంటాయి. మనంవెళ్ళి చెప్పినా వినిపించుకుంటారని నేననుకోను. వాడి నేరాలువదలి మన నేరం మాత్రం లెక్కలోకి తీసుకొని జైల్లో తోసినాతోస్తారు. అదంత తెలివయిన పనిగాదు" అన్నాడు మధుమూర్తి.

"జరగవలసింది జరుగుతుంది. మనం అనుకొని లాభం లేదు" అన్నాడు నిరంజనరావు అక్కణ్నించి లేస్తూ.

## 12

నిరంజనరావు ఆటో వేసుకుని షాపుకి వెళ్ళిపోయాడు. షాపు ముందు దిగి డబ్బులిచ్చి లోనికి వెళ్ళాడు.

తన రూమ్ తలుపు తీసేసరికి లోపల జ్యోతి కూర్చుని వుంది. ఆమె వెంటో వ్యక్తి వున్నాడు.

"ఇవాళ ఆలశ్యంగా వచ్చినట్లున్నారు?" అడిగింది జ్యోతి.

"ఆఁ! ఏమిటి ఇవాళ ఇలా పెందలాడే వచ్చేశారు?" అడిగాడు నిరంజనరావు.

"రాత్రి మీరు వచ్చి వెళ్ళాక, నే చెప్పిన మనిషి మద్రాసుకు వచ్చాడు. నాకు ఫోన్ చేశాడు. వీరు ఆయన సెక్రటరీ. మీరు చెప్పిన ప్రపోజల్ చెప్పాను. చాలా ఉత్సాహంగా అలాగే పెడతానన్నారు. వివరాలన్నీ మాట్లాడుదామని, మిమ్మల్ని కలుసుకోవాలన్నారు. ప్రొద్దున్నే వీరొచ్చారు. మీ యిల్లు మాకు తెలీదు. అందు కని ఇక్కడికి వచ్చి కూర్చున్నాం" అంది జ్యోతి.

రాకేష్ మద్రాసు చేరుకున్న విషయం రూఢిగా తెలిసి పోయింది. వొంటికి చెమటలు పట్టాయి.

"నాకు వివరాలేం తెలీవు. రాత్రి మీరు చూశారుగా మా ఫ్రెండుని. అతను సాయంత్రం కలుస్తానన్నాడు. కలిశాక ఇద్దరం వస్తాం. ఎక్కడికి రమ్మంటారో చెప్పండి" అడిగాడు నిరంజనరావు.

"ముందు మీరు రండి. అతను చెప్పిన విషయాలే మీరు చెప్పండి. రాకేష్ మళ్ళీ రాత్రికి వెళ్ళిపోవాలిట. అతనికి టయిమ్ బొత్తిగా లేదట" అంది జ్యోతి.

"నాకు వీలుగాదు! షాపొదిలి రావటం కష్టం. సాయంత్రం ఖచ్చితంగా వస్తాను" అన్నాడు నిరంజన రావు మొండిగా.

"మీరు రమ్మనగానే రాగలిగిన పరిస్థితిలో వుండరని మా బాస్ అభిప్రాయపడి నన్ను పంపారు" అన్నాడు

జ్యోతి పక్కనున్న వ్యక్తి కోటు జేబులోంచి రివాల్వరు తీసి బల్లపైన అతనికి కనబడేట్లు పెడుతూ.

అవాక్కయి బిగుసుకుపోయాడు నిరంజనరావు.

రాకేష్ మరీ అంత సులభంగా, త్వరగా, తన్ను అనుమానించగలరని అతను వూహించలేకపోయాడు. ముందురోజు రాత్రి జ్యోతిని కలుసుకోవడం చాలా తప్పయిపోయిందని గ్రహించాడు. ఇదే స్థితిలో చంద్రం వుంటే ఏం చేసివుండేవాడో అర్థం కాలేదు. అతనీ పరిణామం వూహించి వుండకపోవచ్చు. వాళ్ళ వెంట వెళ్ళడం తప్పదన్నట్లు తేలిపోయింది.

"ఆయుధాలు చూపించి భయపెట్టనవసరం లేదు. పదండి వస్తాను" అన్నాడు నిరంజనరావు. ముగ్గురూ కారెక్కారు.

కారు రివ్వుమని మద్రాసు వీధుల్లోంచి దూసుకుపోయింది. అరగంట ప్రయాణం తర్వాత ఒక పెద్ద కాంపౌండ్ లోకి వెళ్ళింది. ముగ్గురూ దిగారు. ఇంటిచుట్టూ జనం వున్నారు. అందరిదగ్గరా ఆయుధాలున్నట్లున్నాయి.

విశాలమైన గదిలోకి తీసుకెళ్ళారు నిరంజనరావును. ఎదురుగా పెద్ద కుర్చీలో కూర్చుని వున్నాడు రాకేష్.

"నా డబ్బును తెలివిగా దొంగిలించింది నువ్వేనా?" అడిగాడు సూటిగా రాకేషు.

"డబ్బా? దొంగతనమా? నాకేం తెలీదు. నన్ను ఎందుకో పిలిపించి ఏదో మాట్లాడుతున్నారు" అమాయకం నటించాడు నిరంజనరావు.

"చంద్రశేఖరం లాయరు. అతని పేరుతో స్విట్జర్లాండ్ లో ఒక బ్యాంక్ లో అకౌంటు వుంచాను. అతని సంతకం ఫోర్జరీ చేసి, నా డబ్బంతా మధురలో వున్న

ఆర్ముగం అనే అతని అకౌంటుకు బదిలీ చేశారు. నా మనుషులు ఆ బ్యాంక్ చుట్టూ వున్నారు. ఆ ఆర్ముగం అకౌంటులోంచి డబ్బు డ్రా చేసే ప్రతి మనిషినీ, పట్టుకొని కాల్చిపారెయ్యమన్నాను. నీ ఫ్రెండెక్కడున్నాడు?" అడిగాడు రాకేష్.

"ఏదో హోటల్లో దిగానన్నాడు. నన్ను నిన్న షాపులో కలుసుకున్నాడు."

"ఈ నాటకాలు లాభం లేదు. మీ ఇద్దరిలో ఆర్ముగం సంతకం చేసేదెవరు?"

మౌనంగా వుండిపోయాడు నిరంజనరావు.

"చెప్పిందాకా చావదన్నండి" అరిచాడు రాకేష్.

జ్యోతి అతని వెంట కూర్చుని నవ్వసాగింది.

ఇద్దరు లావుపాటి మనుషులు వచ్చి కొరడాలతో మర్దన మొదలెట్టారు.

ఆ బాధకు తట్టుకోలేక అసలు విషయం మొత్తం చెప్పాలనిపించింది. కానీ చంద్రం, మూర్తి బయటే వున్నారు. వాళ్ళ గురించి చెప్పనంతవరకూ, తనకు ప్రాణాపాయం వుండదని నోరు మూసుకున్నాడు.

ఆ దెబ్బలకు తట్టుకోలేక స్పృహతప్పి పడిపోయాడు.

# 13

చంద్రం పన్నెండు గంటల ప్రాంతంలో నిరంజన రావు ఆఫీసుకు వచ్చాడు. అతని గదిలోకి వెళుతుండగా, అక్కడున్న మనిషి ఎవరో ఒక ఆడామె, మగతను వచ్చి తీసుకెళ్లారని చెప్పాడు.

చంద్రానికి ఆ మాటతో అనుమానం వచ్చింది. తిన్నగా అతని గదిలోకి వెళ్ళి చూశాడు అక్కడేమైనా

ఈ తీరంలాంటిదేదుంటుందేమోనని. అలాంటిదేమీ కని పించలేదు.

టేబుల్ పైనున్న పాడ్ పైన మాత్రం జ్యోతి, రాకేష రివాల్వరు అని పదే పదే బాల్ పెన్‌తో రాసి వుండటం గమనించాడు. అన్నింటి క్రింద ఆ రోజు తేది, టైమ్ వేసి వుంది.

చంద్రానికి పరిస్థితి అర్థమైంది. వెంటనే అక్క డ్నుంచి వెలుపలకు వచ్చేశాడు. తిన్నగా బావగార్ని కలుసుకుని జరిగిన ఘోరం చెప్పాడు.

"నిరంజనరావు వాళ్ళ చేతుల్లో వున్నాడంటున్నావ్. అతన్ని తంతే మన సంగతి చెప్తాడు. అప్పుడు మనల్ని కూడా గద్దల్ని తన్నుకుపోయినట్లు తన్నుకుపోతారు. ఇప్పుడేం చేద్దాం?" అన్నాడు మధుమూర్తి.

"ముందు అక్కను, పిల్లల్ని ఏదన్నా హోటల్లో పెట్టాలి. మీరు వెళ్ళి ఆ పని చూసి గంటలోగా మౌంట్ రోడ్ పోస్టాఫీసు దగ్గరకు రండి" అన్నాడు చంద్రం.

మధుమూర్తి వెళ్ళిపోయాడు. అతని బుర్ర భయంతో నిండిపోయింది.

గంటతర్వాత ఇద్దరూ టాక్సీయెక్కి కమీషనర్ ఆఫ్ పోలీసు ఆఫీసుకు వెళ్ళారు. ఆయన్ను కలుసుకుని జరిగింది మొత్తం వివరంగా చెప్పారు. నిరంజనరావు వాళ్ళ చేతుల్లో చిక్కిన విషయంకూడా చెప్పాడు.

అంతావిన్నాక "మేము అతన్ని పట్టుకుని 'మీసా' క్రింద తోసేందుకు ప్రయత్నిస్తున్నాం" అన్నాడు కమీ షనర్.

"నిరంజనరావు నా వివరాలు చెపుతాడు. వాళ్ళ మనుషులు నాకోసం వస్తారు. మీవాళ్లు నన్ను అంటిపెట్టుకుని వుంటే చాలు. మీరు సులభంగా రాకేషును పట్టుకోవచ్చు. అయితే ఎక్కువ బలగం కావాలి. అతనిచుట్టు యెప్పుడూ పెద్దగ్యాంగు వుంటుందని విన్నాను" అన్నాడు చంద్రం.

"ఓ. కే."

"ఇంతదాకా వాళ్లు మీకోసం రాలేదంటే మీ గురించి చెప్పివుండడు. అతను అలా చెప్పకుండానే చచ్చిపోతే..."

"నేను లాయరు చంద్రశేఖరంతో మాట్లాడుతాను. అతన్నివచ్చి కలుసుకోమంటాను. అతనితోపాటు రాకేషు మనుషులు వస్తారు. నన్ను, మా బావను బలవంతంగా కారెక్కిస్తారు. మీవాళ్ళు దాని వెంటవస్తే చాలు" అన్నాడు చంద్రం.

"బాగుంది పథకం!" అన్నాడు కమీషనర్.

అనుకున్నట్లుగానే చంద్రశేఖరం బుహారీకి వచ్చాడు. ఇద్దర్నీ బలవంతంగా రివాల్వరుతో జడిపించి కారులోకి ఎక్కించాడు. కారు రాకేషుబంగళావేపు బయలుదేరింది. దానికి కొంతదూరంలో పోలీసుకారు బయలుదేరింది. దానికి ఫర్లాంగు దూరంలో ఐదారు వ్యానులనిండాజవాన్లు రైఫిల్స్ పుచ్చుకొని అనుసరించారు.

రాకేషు బంగళా చేరగానే ఇద్దర్నీ కిందికి దించారు. అందరూ లోనికెళ్ళారు.

రాకేషు వికటంగా నవ్వాడు వాళ్ళను చూడగానే.

"మీలో అర్జునుడెవరు?" అడిగాడు.

"ఎవరూలేరు." అన్నాడు చంద్రం.

"ముగ్గురు మామూలు మనుషులు, నన్ను ఎదిరించి, నాడబ్బు కొంగిలించి ప్రాణాలతో వుందామనుకోవడం నిజంగా విచిత్రంగావుంది. అదిచాలక నాడబ్బు నాకిచ్చేటందుకు కండిషన్లు పెట్టారటగదా?" అన్నాడు రాకేష్ కోపంగా.

వెలుపలినుండి తుపాకులు ప్రేలిన శబ్దమయింది. క్షణాలలో పోలీసులు లోనికి జొరబడ్డారు. రాకేషును, జ్యోతిని అతని మనుషుల్ని బంధించారు.

రాకేషు ఈ మెరుపుదాడికి తట్టుకోలేక పోయాడు. అతని చేతికి కమీషనర్ స్వయంగా బేడీలు వేశాడు.

—: ఐపోయింది :—

# నరబలి?

వసుంధర

మేష్టారు పేపర్లకట్టతో క్లాసులో ప్రవేశించాడు. కుర్రాళ్ళంతా ఉత్సాహంగా ఎదురు చూస్తున్నారు.

ఈ పేపర్లపైన విద్యార్థులకు ప్రత్యేకమయిన ఆసక్తి ఉంది. అంతవరకూ చాలా పేపర్లు ఇచ్చారు. ఇక ఆఖరివి. వీటితోపాటు ప్రోగ్రెస్ రిపోర్టుకూడా సిద్ధంగా వుంటుంది. ఆ ప్రోగ్రెస్ రిపోర్టు తండ్రిచేత సంతకము చేయించి వెనక్కు తీసుకురావాలి విద్యార్థులు.

ఆ ప్రోగ్రెస్ రిపోర్టులో ప్రత్యేకమయిన విశేషం రాంకింగ్. అందరికంటె ఎక్కువ మార్కులు వచ్చిన విద్యార్థికి ఫస్టురాంకు. అతని నెంబరు ఒకటన్నమాట.

ఆ క్లాసులో మొత్తం యాభైయిద్దరున్నారు.

ఆ క్లాసులో చదువుతున్న రవికుమార్‌కి యెప్పుడూ ఫస్టురాంకు రాలేదు కానీ సాధారణంగా పన్నెండుకూ ఇరవైకీ మధ్యలో వుంటుందతని నంబరు. అయితే అతనికో హాబీవుంది.

క్లాసులో విద్యార్థులందరి పేర్లు ఒక కాగితంమీద రాసుకుని వాళ్ళకి ఏయే సబ్జక్ట్సులో యెన్నెన్ని మార్కులు వచ్చాయో నోట్ చేసుకొని—మొత్తంకలిపి తనే వాళ్ళకి రాంకులిస్తాడు. ఆ తర్వాత వాళ్ళ పేర్లన్నీ రాంకుల ప్రకారం వరుసగా రాస్తాడు. అతని రాంకింగూ మేష్టారిచ్చిన రాంకింగూ సరిపోతుంది. సరిపోనప్పుడతనా విషయాన్ని మేష్టారి దృష్టికి తీసుకుని వస్తాడు. సాధారణంగా రవికుమార్ లెక్కల్లో తప్పుండదు.

మేష్టారు ఒక్కొక్కరి పేరూ, మార్కులూ చదివి ఇస్తూంటే రవికుమార్ అవన్నీ తనలిస్టులో నోట్ చేసుకుంటున్నాడు. ఇతని పిచ్చి తెలిసిన మేష్టారు అతని పేపరు ఆఖరున ఇచ్చాడు. రవికుమార్ కి ఆ లిస్టు తయారు చేయడంలోవున్న ఆనందం తనకు వచ్చిన మార్కులు తెలుసుకోవడంలోకూడా వుండదు.

ఈ పేపర్లో కృష్ణమూర్తికి ఫస్టుమార్కు వచ్చింది. అతను ఆ వూళ్ళో మునసబుగారికి కుడిభుజంగా పేరుపడ్డ చంద్రయ్యకు ఒక్కగానొక్క కొడుకు.

చంద్రయ్యకు రెండెకరాల మాగాణివుంది. తనస్వంత పొలంతోపాటు మునసబుగారిదో పాతికెకరాలు సాగు చేస్తున్నాడతను. మనిషి కండలు తిరిగి బలిష్టంగా వుంటాడు. చంద్రయ్యకు లేక లేక కలిగిన కొడుకు కృష్ణమూర్తి అంటే పంచప్రాణాలు. తన కొడుకు పెరిగి పెద్దవాడై అందరికంటె గొప్పవాడు కావాలని అతని ఆశ. అతని ఆశకు తగ్గట్టే కృష్ణమూర్తికి చదువుమీద ఆసక్తి యెక్కువ.

ప్రోగ్రెస్ రిపోర్ట్ చూడగానే ఆతృతగా కృష్ణమూర్తి తన నంబరు కోసం వెతుక్కున్నాడు. అయిదవ

నంబరు చూడగానే అతని ముఖం నిరుత్సాహంగా అయి పోయింది. గుసగుసల్లో అతనికి తెలిసిన విషయం మున సబుగారబ్బాయి మాణిక్యాలరావు మళ్ళీ ప్రథమస్థానంలో నిలిచాడని.

మాణిక్యాలరావంటే కృష్ణమూర్తి కిష్టమే! కానీ తనూ క్లాసులో ఒక్కసారయినా ఫస్టు రావాలని అతని తాపత్రయం.

ఆ క్లాసులో మొదటి అయిదు స్థానాలకూ పోటీపడే వాళ్ళు మొత్తం అయిదుగురే వున్నారు. అందులో మొదటి స్థానం విధిగా మునసబుగారబ్బాయి మాణిక్యాల రావుకే చెందుతుంది. మిగతా నాలుగు స్థానాలకూ పేర్లు మారుతూంటాయి. కరణంగారబ్బాయి మోహన్, బండి తోలే మునెయ్య కొడుకు రమణరావు, గ్రామ పురోహి తుల్లో అగ్రగణ్యుడయిన సోమయాజులుగారబ్బాయి చిన సోమయాజులు, చంద్రయ్య కొడుకు కృష్ణమూర్తి ఆయా స్థానాలకు పోటీ పడుతూంటారు. కృష్ణమూర్తికి ఒక్కసారి మాత్రం రెండవస్థానం లభించింది.

ఈ పోటీ వీరికి ఐదవ తరగతిలో ప్రారంభమయింది. ఇప్పుడు వీళ్ళందరూ తొమ్మిదవ తరగతి చదువుతున్నారు. ఇన్ని సంవత్సరాలలో జరిగిన ఇన్ని పరీక్షలలోనూ మాణి క్యాలరావు స్థానం అచంచలమైతే ఒక్కసారి మినహా యించి అన్ని సమయాల్లోనూ కృష్ణమూర్తి అయిదవ వాడుగానే వుంటున్నాడు.

క్లాసులో తనకు ఫస్టు రావాలని ఉన్నదని తండ్రికి కృష్ణమూర్తి ఎన్నోసార్లు చెప్పగా అతను—"మునసబు గారబ్బాయితో మనమెక్కడ పోటీపడకలంరా, వాళ్ళంతా పెట్టిపుట్టిన బాబులు. ఇంతమంది ఉన్న

క్లాసులో నువ్వు అయిదోవాడుగా రావడం మాత్రం గొప్పకాదా—" అని నవ్వేస్తూండేవాడు.

అయితే కృష్ణమూర్తి అనుమానాలు వేరు. చంద్రయ్యతో పోలిస్తే ఒక్క మునెయ్యా తప్ప మిగతా అందరికీ గ్రామంలో అంతో యింతో పేరుంది. వాళ్ళ స్థితిగతుల్నిపట్టి వాళ్ళకి ఎక్కువ మార్కులు వేస్తున్నారనీ లేకపోతే తనే ఫస్టుగా రావలసినవాడనీ కృష్ణమూర్తి అనుమానం. మునెయ్య మేస్టర్లందరికీ బండి వుచితంగా కడుతూంటాడు. ఆ విధంగా వాళ్ళ అభిమానం సంపాదించుకుని కొడుక్కి మంచి రాంకింగ్ సంపాదిస్తున్నాడని కృష్ణమూర్తి తల్లి దగ్గర తరచుగా ఆరోపిస్తూంటాడు. అదీకాక, చంద్రయ్యకు నెమ్మదితనమున్నా నోటిమంచితనం లేదు. మేస్టర్లకు చాలామందికి అతనంటే కిట్టదు.

"అందువల్ల కావాలని చెప్పి నాకు మార్కులు తక్కువేస్తున్నారు. మిగతావాళ్ళు మరీ చచ్చురకం కాబట్టి గానీ లేకుంటే నన్నింకో ఏ పదో, పదిహేనో స్థానంలో పడేసేవారు. మనూరి ప్రెసిడెంటుగారికి నా క్లాసులో చదువుకునే కొడుకుండి ఉంటే అప్పుడు నేను ఆరో వాడ్నయుండేవాడ్ని క్లాసులో" అని తల్లి దగ్గర కృష్ణమూర్తి ఎన్నోసార్లు చెప్పాడు.

చంద్రయ్య ఆ మాటలు విన్నప్పుడు "పిచ్చి పిచ్చి ఆలోచనలు చేయక, బుద్ధిగా చదువుకో" అని కోపగించేవాడు.

## 2

చంద్రవంక పులుసు తీసుకువచ్చి వడ్డించి—"సరిగ్గా కలుపుకోరా లేకపోతే పులుసు నేలంతా అవుతుంది" అంది.

మునెయ్యా జాగ్రత్తగా కలుపుతుని "కంచంలో అన్నం పెడితే ఈ బాధుండేది కాదు కదండీ" అన్నాడు.

"అదేకదురా బండివాడికీ, మునసబుకీ తేడా—" అంది చంద్రవంక.

"తేడా ఏముంది? నాకేం తక్కువ?" అన్నాడు మునెయ్యా.

"నువ్వు బండివాడివి. ఆయన మునసబు. అదే తేడా."

"అంటే?"

"బండివాడు మునసబు కాలేడు" అంది చంద్రవంక.

"గొప్ప సత్యం చెబుతున్నారు కానీ బండివాడి తర్వాతే మునసబన్న విషయం మీకు తెలియదుగనుక నా?" అన్నాడు మునెయ్యా.

చంద్రవంక కంగారుపడి అటూ ఇటూ చూసి "ఏం మాటల్రా అవి!" అంది.

"అవునండీ—మీకు మోజైనప్పుడు నేను బండివాడి నన్న విషయం గుర్తులేదు. నన్నో రాజకుమారుడిలా, దేవుడిలా చూశారు. ఆ చూపు కలకాలం వుంటే నేనూ కంచంలోనే భోంచేసి వుండేవాడ్ని ఈ యింట్లో—" అన్నాడు మునెయ్యా.

చంద్రవంకకు జరిగిందంతా బాగా గుర్తుంది.

మునెయ్యా తమ యింట్లో చనువుగా తిరుగుతూండే వాడు. ఏపని అయినా చలాకీగా చేయడంవల్ల అతనంటే ఇంట్లో అందరూ అభిమానంగా వుండేవారు.

చిన్నప్పట్నించీ అతని దగ్గర చంద్రవంకకు బాగా చనువు. వయసొచ్చినా ఆ చనువు తగ్గలేదు. ఆ చనువును ఇంట్లోవాళ్ళు పెద్దగా అపార్థం చేసుకోనూలేదు.

చంద్రవంకకు వయసొచ్చేక మునెయ్య ఆమె ఒంటరిగా తటస్థపడ్డప్పుడల్లా ఏవో చిన్న చిన్న చిలిపిపనులు చేస్తూండేవాడు. సరదాకు కోపం నటించినా చంద్రవంకకు వాడి ప్రవర్తన సరదాగానూ, ఇష్టంగానూ వుండేది.

ఆమె ప్రసన్నతను అలుసుగా తీసుకుని మునెయ్య కాస్త ముందడుగు వేసి ఆమెను కౌగలించుకోవడమూ, ముద్దు పెట్టుకోవడమూ వగైరాలు చేస్తూంటాడు. ఆమె పెద్దగా అభ్యంతర పెట్టకపోవడంతో ఓ పర్యాయం వాడింకా ముందడుగు వెయ్యబోయాడు. అందుకు చంద్రవంక అంగీకరించలేదు.

"నేనందంగా లేనా?" అన్నాడు మునెయ్య.

"నువ్వు చాలా అందంగా రాకుమారుడిలా వున్నావు. కానీ ఇది తప్పు."

"ఇష్టమైన ఆడా, మగా ఇలా కలుసుకోవడం తప్పు కాదు."

"పెళ్ళి చేసుకున్నాకయితే తప్పుకాదు."

"అయితే పెళ్ళి చేసుకుందాం."

"ఛ! నిన్నెలా పెళ్ళి చేసుకుంటాను? నీకు పెళ్ళయిపోయిందిగా..."

"పెళ్ళయితేనేం-మా బాబుకిద్దరు పెళ్ళాలు. అలాగే నేనూ..."

"ఛీ...రెండో పెళ్ళాంగా ఉండడం నాకిష్టంలేదు" అంది చంద్రవంక.

"పోనీ-మీకోసం దాన్నొదిలేస్తాను..."

"అదీ నాకిష్టంలేదు..." అని చటుక్కున అతన్ని విడిపించుకుని అక్కడ్నించి వెళ్ళిపోయిందామె. ఆ

తర్వాత నుంచి ఆమె మునెయ్యను తప్పించుకుని తిరుగుతూ వచ్చింది.

ఈ లోగా ఆ ఊళ్ళోనే మునసబు శేషావతారంతో ఆమెకు పెళ్ళి సంబంధం కుదిరింది. చంద్రవంక తలిదండ్రులు శేషావతారానికి పాతిక వేలు కట్నంగా ఇస్తామని చెప్పారు. శేషావతారం ఇలాంటి సంబంధంకోసమే ఎదురు చూస్తున్నాడు.

శేషావతారం డబ్బున్నవాడేకానీ డబ్బుపిచ్చి ఎక్కువగా కలవాడు. ఎంత సంపాదించినా అతడికి తనివితీర లేదు. చంద్రవంక తండ్రి పొలాలు అతడి పొలాల కానుకునే ఉన్నాయి. అందుకే ఆమెమీద అతను చాలా కాలంగా కన్ను వేసి వుంచాడు.

సంబంధం స్థిరపడ్డాక మునెయ్య చంద్రవంకనోసారి కలుసుకుని "నా వంటి దౌర్భాగ్యుడికి మీలాంటి పిల్లని చేసుకునే అదృష్ట మెందుకుంటుంది? ఈ జన్మకిది చాలు ననుకుని ఆఖరిసారిగా నీ చేతిని ముద్దుపెట్టుకుని పోతాను"

చంద్రవంకకు అతనిమీద క్షణమాత్రం జాలి కలిగింది. అంతలోనే కాస్త కోపం కూడా వచ్చింది. "ఇంక నువ్విలాంటి కబుర్లు మానేయాలి... నేను పెద్దింట్లోకి వెడుతున్నాను కూడా."

"పిల్ల లేదయినా అడిగారనుకోండి. ఓసారి అడిగిన దిచ్చేవరకూ అలా వేధిస్తూనే వుంటారు. కావాలనుకున్నది దొరికితే కాసేపు ఆడుకుని మళ్ళీ దాని విషయమే మర్చిపోతారు. మన చనువు నాలో కోరికను పెంచింది. అది తీరిపోతే మిమ్మల్ని మరిచిపోవడమంత కష్టం కాదు."

"బాగుందిరా— నేను నిన్ను పెళ్ళి చేసుకోవడం లేదుగా..."

"లేదనుకోండి. కానీ ఒక్కసారి..."

చంద్రవంకకు అతడి ఉద్దేశ్యం అర్థమైంది. అప్పటికి వాడ్నించి తప్పించుకున్నా ఆ విషయం ఆమె ఆలోచనలను రేపింది.

తమ ఇద్దరకూ మధ్యవున్న చనువు, బాల్యచాపల్యంలో తను వాడి నభ్యంతరపెట్టకపోవడం ఆమెకు గుర్తున్నాయి. ఆ చనువును మరికాస్త దూరం తీసుకువెళ్లాలన్న కోరిక వాడికి వుంది. ఆ కోరిక తీరకపోతే జన్మజన్మలకూ తమ చనువును వాడు మరచిపోడు. తీరిపోతే అన్నీ మరచిపోవచ్చు.

ఈ విధమైన ఆలోచనలకు తోడుగా మునెయ్యమీద అంతరాంతరాలలో తనకున్న కోరిక కూడా కలవగా చంద్రవంక మునెయ్యా కోరిక తీర్చాలని నిర్ణయించుకుంది. పెళ్ళి పదిహేను రోజులున్నదనగా ఆమె తనకు తానుగా మునెయ్యకు అర్పించుకుంది. మునెయ్యా అప్పుడు పొందిన ఆనందమింతా అంతా కాదు.

అతడివద్ద వీడ్కోలు ముద్దు తీసుకొంటూ—"ఈ జన్మకు నన్ను మరిచిపోవాలి" అంది. మునెయ్యా అభ్యంతరాన్ని తెలియజేస్తూ—"అదెలా సాధ్యం-ఈ రోజు అనుభవం వెయ్యి జన్మలకు కూడా మరువలేను. ఈ అనుభవాన్నిచ్చిన మీకు జీవితాంతం కృతజ్ఞుడ్ని" అన్నాడు.

"నీకు నిజంగా కృతజ్ఞతవుంటే ఈ విషయం మళ్ళీ గుర్తుచేయవద్దు" అంది చంద్రవంక.......

"ఈరోజు నువ్వు మాటతప్పుతున్నావు మునెయ్యా- పెళ్ళికిముందు జరిగిన ఆ విషయం మళ్ళీగుర్తుచేయనన్నావ్. నీ ఉద్దేశ్యమేమిటి? నన్ను బెదిరిద్దామనుకుంటున్నావా."

"మిమ్మల్ని బెదిరించడమా? మీరు నా దేవత! ఎన్ని

సంవత్సరాలు గడిచినా మీ అందం తరగదు. ఇటువంటి దేవత పెళ్ళికి పదిహేనురోజులముందు, ఒక్కసారంటే ఒక్కసారయితే మాత్రం నాకిలా దక్కిందాని ఆశ్చర్య పోతుంటాను'' అన్నాడు మునెయ్య.

''కబుర్లు కట్టిపెట్టు. కుర్రాడెలా చదువుతుంటు న్నాడు?''

''బాగా చదువుతున్నాడండీ. మీ అబ్బాయిగారి క్లాసేనండి. మీ సాటి మేము రామనుకోండి. మీఅబ్బాయి గారు క్లాసులో యెప్పుడూ ఫస్టేట! మా వాడుకూడా రెండో, మూడో, నాలుగో వస్తుంటాడు'' అన్నాడు మునెయ్య.

భారంగా నిట్టూర్చింది చంద్రవంక.

సరిగ్గా అప్పుడే అక్కడికి శేషావతారం వచ్చాడు. అతన్ని చూస్తూనే చంద్రవంక ఉలిక్కిపడి తడబడింది.

''అదేమిటే-అలా కంగారుపడ్డావ్—ఏం చేస్తున్నా విక్కడ?'' అన్నాడు శేషావతారం.

''మునెయ్యకు అన్నం పెడుతున్నాను.''

''అంతేనా...''

చంద్రవంక జవాబివ్వకుండా మజ్జిగ తేవడానికి లోపలి కెళ్ళింది. ఆమె అలావెళ్ళగానే శేషావతారం మునెయ్య వంకచూసి, ''సరుకంతా జాగ్రత్తగా తెచ్చావా?'' అన్నాడు.

''తెచ్చానండి'' అన్నాడు మునెయ్య.

''ఏమిటో నిన్ను చూస్తే యెంతో గొప్పవాడివి కావ లసి ఆగిపోయినట్లనిపిస్తోందిరా. బండి తోలడం మానేసి ఏదయినా వ్యాపారం చేసుకోకూడదూ...'' అన్నాడు శేషావతారం.

"వ్యాపారానికి పెట్టుబడి కావాలికదండీ" అన్నాడు మునెయ్య.

చంద్రవంక వచ్చి మజ్జిగపోసి మళ్ళీలోపలకు వెళ్ళి పోయింది. మునెయ్య మజ్జిగ అన్నం కలిపి నోట్లో పెట్టుకున్నాడు.

"పెట్టుబడి దేముందిరా. ఏ దేవతనయినా అడిగితే ఇయ్యవచ్చు."

మునెయ్యకు ముద్ద గొంతుకడ్డంబడింది. రెండుసార్లుదగ్గి గొంతు సరిచేసుకుని కొద్దిగా మంచినీళ్ళు తాగాడు... "నాకు డబ్బిచ్చే దేవతలెక్కడ దొరుకుతారండి..." అన్నాడు.

"మునెయ్యా, దేవతలు వరాలెలాగిస్తారో తెలుసురా"

"తెలియదండి."

శేషావతారం ముఖం తీవ్రంగా మారింది. "దేవతలిచ్చే వరాలు బలికోరతాయి. ఆ విషయం తెలుసా నీకు?"

మునెయ్య ముఖంలో భయం కనబడింది. "తెలియదు, కానీ తమరివన్నీ ఎందుకు చెబుతున్నారో నాకర్థం కావడము లేదండీ."

"సింపుల్ గా చెప్పమంటావా. నేను దేవున్ననుకో. నీకు వ్యాపారానికి పెట్టుబడి డబ్బులిస్తానన్నాననుకో. నాకోసం యేమయినా చెయ్యగలవా?"

"తప్పకుండా చేస్తానండి" ఉత్సాహంగా అన్నాడు మునెయ్య.

"ఏమయినా సరే" రెట్టించాడు శేషావతారం.

"ఏమైనాసరే" దృఢంగా అన్నాడు మునెయ్య.

"నాభార్యను చంపెయ్యమంటే?" అన్నాడు శేషావతారం.

ముసెయ్యి తెల్లబోయాడు. అతనినోట మాటరాలేదు.

"అదేరా__దేవతల వరాలు బలికోరడమంటే!" అని అక్కణ్ణించి కదిలాడు శేషావతారం.

# 3

మాలపల్లిలో ఇళ్ళంటుకున్నాయి. అక్కడ గాలి తోడుకాగా కొన్నిరవ్వలు ఎగిరివచ్చి చాకలిపేటలో గుడిసెలు కొన్నిరగులుకున్నాయి.

ఆరోజు గాలి చాలా యెక్కువగా ఉంది. అందువల్ల గుడిసెలతోపాటు ఊళ్ళోని రెండుమూడు పెంకుటిళ్లు కూడా అగ్ని ప్రమాదానికి గురయ్యాయి.

ఊరంతా ఏకమై ఆ ప్రమాదాన్ని చాలావరకూ నివారించ గలిగారు కానీ జరుగవలసిన నష్టంకొంత జరిగిపోయింది.

"ఇందుకాకారణం వేరే యేమీ లేదు. ఊళ్ళోవాళ్ళకు భక్తిలేదు. ఎంతోమంది అమ్మవారికి మొక్కుకొని ఆ మొక్కుబడులు చెల్లించలేదు. అందుకే అమ్మవారి ఊరిమీద పగబట్టింది..." అన్నాడు అమ్మవారి గుడి పూజారి రంగయ్య.

ఆ ఊరి అమ్మవారిపేరు మహాకాళి. ఎంతో మహాత్మ్యం గల దేవత అని ఆ వూళ్ళోనేకాక చుట్టుప్రక్కలకూడా చెప్పుకుంటారు. అందువల్ల వూళ్ళో ఎవరికెలాంటి ఇబ్బంది వచ్చినా వెళ్ళి అమ్మవారికి మొక్కుకుంటూంటారు.

మహాకాళి మహాత్మ్యంగురించి ఎన్నోకథలున్నాయి. గుడికివచ్చిన వారందరికీ పూజారి రంగయ్య వాటిగురించి చెబుతుంటాడు. అమ్మవారికి కోపంవస్తే నరబలికూడా తీసుకొంటుందట.

చాకలిపేటలో ఆరేడిళ్ళుపూర్తిగా దగ్ధమైపోయాయి. అయితే ఆ ఆరేడిళ్ళవాళ్ళుకూడా మహాకాళికి తలా ఒక కోడిపుంజూ బాకీవున్నారు. పెంకుటిళ్ళు కాలినవారు కూడా అమ్మవారికి వెండికళ్ళు చేయిస్తామనో, ముక్కుపుడక చేయిస్తామనో అనుకున్న బాపతే—రంగయ్యా ఈ విషయాన్ని గుర్తుచేయగానే ఇలాంటివారిలో సంచలనం కలగసాగింది.

ఊళ్ళో అమ్మవారి వాగ్దానాలు చెల్లించని జనాలు ఇంకా చాలామంది వున్నారు. వాళ్ళందరికీకూడా గుండెలలో బెదురుగావుంది రంగయ్యమాటలు విన్నాక. అమ్మవారు తమపైన ఏవిధంగా పగ తీర్చుకుంటుందోనని.

చంద్రయ్య చుట్టం నర్సన్నకిప్పుడు తగని చిక్కొచ్చింది. అతనిదొడ్లో పశువులపాక కాలిపోయింది. ఇది అమ్మవారిపనేనని అతను నమ్ముతున్నాడు.

ఇదివరలో ఒకపర్యాయం కొడుక్కి జబ్బుచేస్తే— అది త్వరగా నయమైపోతే అమ్మవారికి ముక్కుపుడక చేయిస్తానని మొక్కుకున్నాడతను. కొడుక్కి జబ్బు త్వరగానే నయమైపోయింది కానీ అంతనింతవరకూ అన్న మాట చెల్లించలేదు. అతనిప్పుడు కొద్దిగా అప్పుకావాలని చంద్రయ్య నడిగాడు.

"డబ్బు దేనికి?" అన్నాడు చంద్రయ్య.

విషయం చెప్పాడు నర్సన్న.

"బలికున్న పశువులకు పాకసంగతి ముందుమాడు. అమ్మోరి సంగతి తరవాత చూడొచ్చు" అన్నాడు చంద్రయ్య విసుగ్గా.

"అలా అనకు. ఇప్పటికే బాధపడుతున్నాన్నేను."

"ఏడిశావ్ లేరా. మనందర్నీ చల్లగా చూడాల్సిన అమ్మవారు మనమీద కోపగించుకోవడమేమిటి? ఆ రంగ య్యేదో అంటే మీరు నమ్మేయడమే! ఆ మాలపల్లివాళ్లు అజాగ్రత్తగా ఉండడంవల్ల యింత జరిగింది. ఇలాంటివి జరగటం మామూలే. దీనికి అమ్మవారికి ఏం సంబంధం లేదు" అన్నాడు చంద్రయ్య.

నర్సన్న ముందు అంగీకరించలేదు కాని చంద్రయ్య చాలాసేపు చెప్పాక "అవును-మనందర్నీ కాపాడవలసిన ఆ తల్లి డబ్బాశతో ఇలా ఏడిపిస్తుందేమిటి?" అని వెళ్ళి పోయాడు.

ముక్కుపుడకకు ఈ రోజుల్లో చాలా ఖర్చవుతుంది. అదికూడా అతను చంద్రయ్య మాటలు వినడానికి కొంత వరకూ కారణం.

అయితే ఆరోజు సాయంత్రమే చంద్రయ్య కొడుకు కృష్ణమూర్తికి ఆటలో బలమైన గాయం తగిలి, స్పృహ తప్పి పడిపోయాడు.

నిముషాలమీద కృష్ణమూర్తి శరీరం గ్రామంలోని వైద్యుడి ఇల్లు చేరింది. ఈలోగా కబురు కృష్ణమూర్తి తల్లి ముత్యాలమ్మకు చేరింది.

నాటువైద్యుడు మరీ మోటువైద్యుడుకాడు. అతడు పట్నంలో ఓ పెద్ద డాక్టరుదగ్గర చాలాకాలం కాంపౌం డరుగా పనిచేసి ఆ అనుభవంతో ఇక్కడ వైద్యంప్రారం భించాడు. అతని హస్తవాసి మంచిదన్న పేరు అచిర కాలంలోనే వచ్చేసింది. ఇప్పుడతను కృష్ణమూర్తి తల మీద గాయాన్ని పరిశీలించి "దెబ్బ గట్టిగా తగిలింది— పెద్దదే" అన్నాడు.

ఈలోగా ముత్యాలమ్మ అక్కడికి గుండెలు బాదు కుంటూ వచ్చేసింది. కొడుకున్న పరిస్థితి చూసి "ఆ పూజా రయ్య చెప్పనే చెప్పాడు. మహాకాళి నరబలి కోరుతుం దని. నా మొగుడు చేసిన తప్పుకు నేను లెంపలేసుకుంటు న్నాను. తల్లీ నా ఒక్కగానొక్క బిడ్డను రక్షించు..." అంటూ లెంపలు వాయించుకోసాగింది.

నాటువైద్యుడు జాలిగా ఆమెవేపుచూచి "ఊరికే అలా హడావుడి పడకు ముత్యాలమ్మా - నేనున్నాగా, అన్నీ చూసుకుంటాను. డాక్టరు దేవుడుకంటే ఎక్కువ. నాకే కానుకలిచ్చుకొంటావో ఏమో. నీ కొడుకును నా శాయశక్తులా ప్రయత్నించి బ్రతికిస్తాను" అన్నాడు.

ముత్యాలమ్మ మరి మాట్లాడకుండా "నీ ఋణముంచు కోను బాబూ" అని ఊరుకుంది.

కృష్ణమూర్తికి రెండుగంటల తర్వాత తెలివి వచ్చింది. అప్పటికి అక్కడికి చంద్రయ్యకూడా వచ్చిచేరాడు. కృష్ణమూర్తి తల్లినీ తండ్రినీ చూసి, "ఏమిటి-మనమిక్క డెందుకున్నాము?" అనడిగాడు. అతనిమాటలు తెలివి గానే వున్నాయి. అందర్నీ బాగానే గుర్తుపట్టాడు.

చంద్రయ్య, ముత్యాలమ్మ సంతోషంతో కళ్ళుతుడుచు కున్నారు. కానీ ఆ సంతోషం యెక్కువసేపు నిలబడ లేదు. కృష్ణమూర్తి వళ్ళు సలసలా కాగిపోతోంది.

"కంగారు పడక్కర్లేదు చంద్రయ్యా—జ్వరం తగ్గి పోతుంది" అన్నాడు నాటువైద్యుడు. చంద్రయ్య అసం తృప్తిగా తలూపాడు.

ముత్యాలమ్మ మాత్రం "తక్షణం గుడికివెళ్ళి అమ్మ వారికి దణ్ణంపెట్టి లెంపలేసుకొని అపరాధం మన్నించ

మని అడుగు. అబ్బాయికి జ్వరం తగ్గగానే పూజ చేయి
ద్దాము'' అంది.

చంద్రయ్యకు కాపని చేయడం ఇష్టమున్నట్లులేదు. కానీ
కొడుకు పరిసితి చూస్తూంటే అతనికి బెదురుగా వుంది.
అయిష్టంగానే అక్కణ్ణించి కదిలివెళ్ళి భార్య చెప్పినట్లు
చేశాడు.

కృష్ణమూర్తికి జ్వరం తగ్గింది. మారు మాట్లాడకుండా
అమ్మవారికి పూజకూడా చేయించాడు.

# 4

మాణిక్యాలరావును ఎవరో తట్టిలేపినట్లయింది. అతను
మంచి నిద్రలో వున్నాడేమో, కళ్ళు తెరవకుండానే
మత్తుగా ''ఊఁ'' అన్నాడు.

కానీ ఎవరో అతన్నింకా లేపడానికి ప్రయత్నిస్తు
న్నారు.

మాణిక్యాలరావు కళ్ళు నులుముకున్నాడు. కళ్ళు తెరి
చినా అతనికి ఏమీ కనడలేదు. గదంతా చీకటిగావుంది.

''ఎవరు?'' అన్నాడు మాణిక్యాలరావు.

''మహాకాళి...'' అన్నమాటలు వినబడ్డాయతనికి.
ఆ కంఠం బొంగురుగా అదోరకంగావుంది. మాణిక్యాల
రావు స్వతహాగా ధైర్యవంతుడు. మహాకాళి యెవరో
అర్థంగాక ''మహాకాళి అంటే?'' అన్నాడు.

''ఈవూరి అమ్మవారు...''

మాణిక్యాలరావుకు భయం వేసింది. ''ఎందుకొచ్చావ్?''
అన్నాడు. అప్పుడే అతని మాటల్లో వణుకు ప్రారంభ
మయింది.

"నీకింకొక్క రోజే ఆయుష్షుంది. నువ్వు మంచి వాడివి కాబట్టి ఆ సంగతి చెప్పడానికి వచ్చాను..." అంది ఆ కంఠం.

మాణిక్యాలరావు భయంగా "నాకింకా బ్రతకాలని వుంది" అన్నాడు.

"బ్రతకాలని అందరికీ ఉంటుంది. ఆ అదృష్టం మాత్రం అందరికీ వుండదు. రేపు నీకు చావు తప్పదు."

"నేనేం తప్పు చేశాను?"

"నువ్వేం తప్పు చేయలేదు. తప్పు ఈ ఊరు చేసింది. అందుకే నాకు నరరక్తం కావాలిరా..."

"అమ్మవారు మాకు తల్లిలాంటిది. మనిషి రక్తాన్ని కోరేది దేవత కాదు. నువ్వెవరో నన్ను భయపెట్టాలని చూస్తున్నావు..." అన్నాడు మాణిక్యాలరావు.

అప్పుడే సరిగ్గా గదిలో ఓ దీపం వెలిగి ప్రకాశవంత మైంది. తనకు కనబడ్డ ఆకారాన్ని చూసి నోట మాట రాకుండా అలా చూస్తూండిపోయాడు మాణిక్యాలరావు.

ఆ ఆకారం చాలా భయంకరంగా వుంది. అసహ్యకర మైన ముఖానికి తోడు రెండు పెద్ద కోరలు కూడా వున్నాయి. చూపులు చాలా కర్కశంగా వున్నాయి.

భయంతో మాణిక్యాలరావుకు స్పృహ తప్పింది.

## 5

"ఏడిశావ్ !ఏదో కలగనుంటావ్!" అన్నాడు శేషావ తారం.

"లేదు నాన్నా-అది కలకాదు. నిజంగా జరిగింది."

"బాగుందిరా. చదువుకుని క్లాసులో ఫస్టుగా వస్తు న్నావు కదా అని ఎంతో ఆనందిస్తున్నాను. ఆఖరికిలా తయారయ్యావు నువ్వు. అమ్మవారేమిటి, భయంకరంగా

వుండటమేమిటి? నీ గదిలోకి వచ్చి బెదిరించడ మేమిటి? చదువుకునేవాళ్ళనవలసిన ముక్కలు కావివి."

"ఏదో పీడకల వచ్చినట్లుంది. వాడిముఖం చూడండి. బాగా భయపడ్డట్టు కనిపిస్తున్నాడు వాడు" అంది చంద్రవంక.

"కల కాదమ్మా—నిజంగా చూశాను" అన్నాడు మాణిక్యాలరావు.

"ఎందుకయినా మంచిది. పూజారి రంగయ్యను పిలిపిద్దాం" అంది చంద్రవంక.

రంగయ్య వచ్చి మాణిక్యాలరావు కల గురించి సావధానంగా విని—"కుర్రాడి మాటల్ని మరీ అంత తేలిగ్గా కొట్టిపారేయకండి. నిజంగానే కనబడిందో, కలలోనే వచ్చిందో కానీ ఇది అమ్మవారి పని అన్నమాట సత్యం. అమ్మవారిని చూసిన తేజస్సు నాకు కుర్రాడిలో కనబడుతోంది. ఈ మధ్య ఊళ్ళోవాళ్ళకు బొత్తిగా భయ భక్తులు నశించాయి. అమ్మవారికి మొక్కుబడులు చెల్లించడం మానేశారు. అందువల్ల నాకు బెంగగానే వుంది-ఇది నరబలిదాకా దారి తీస్తుందేమోనని. ఈ మధ్యనే చంద్రయ్య కొడుకు తల పగిలి చచ్చి బ్రతికాడు. అమ్మవారి దయ వల్లనే ఆ కుర్రాడి ప్రాణాలు నిలబడ్డాయి..." అన్నాడు.

"ఇప్పుడేం చేయాలంటావ్?" అన్నాడు శేషావతారం చిరాగ్గా.

"కుర్రాడి పేరున అమ్మవారికి పూజచేయించి దండిగా కానుక లిచ్చుకోండి."

"బాగుందయ్యా! అసలు నీలాంటివాళ్ళ మూలానే అమ్మవారంటే విలువ తగ్గిపోతోంది. వాడికేదో పీడకల వస్తే నువ్వు లాభం పొందాలని చూస్తున్నావు..." అన్నాడు శేషావతారం.

"అడిగారు కాబట్టి చెప్పాను. ఆపైన తమ చిత్తం" అన్నాడు రంగయ్య.

చంద్రవంక రంగయ్యను రహస్యంగా పిలిచి "ఓ రెండు మూడు రోజుల్లో నేను పూజ చేయిస్తాన్లే కానీ- అబ్బాయికి అమ్మవారి బొట్టు పెట్టు..." అంది.

రంగయ్య మాణిక్యాలరావును చేయెత్తి ఆశీర్వదించి ముఖానికి అమ్మవారి కుంకుం బొట్టు పెట్టాడు.

రంగయ్య ఊళ్ళోకి వెళ్ళాక మాణిక్యాలరావు కల గురించి చాలామందికి చెప్పాడు. ఆ కల వూరంతా చర్చనీయాంశమైపోయింది. కొంతమంది అది కలేనని అనుకున్నారు. మరికొందరు శేషావతారం ఆడుతున్న నాటకమేమోనని అనుకున్నారు.

శేషావతారం ఆ గుడికి ధర్మకర్త. అయితే అతను ఏ పనీ శ్రద్ధగా చేయడంలేదన్న అపవాదు వుంది. అతడి ఆధ్వర్యంలోనే ఆ గుడికి పలుకుబడి నశించడం మొదలయింది. ఈ విధంగా గుడికి మళ్ళీ పేరు లేపుకు వద్దామనుకుంటున్నాడని చాలామంది అనుకున్నారు.

మాణిక్యాలరావుకు తను చూసిన భయంకరాకారం బాగా గుర్తుండిపోయింది. అది కల అని అతను అనుకోలేకపోతున్నాడు. అందుగురించే అతనొక పర్యాయం అమ్మవారి గుడికి వెళ్ళొచ్చాడు. గుడిలోని అమ్మవారి విగ్రహానికీ తను చూసిన ఆకారానికీ ఎక్కడా పోలికలు లేవు.

ఆ రోజు మధ్యాహ్నానికి మాణిక్యాలరావుకు తను చూసినది పీడకలే అయి వుంటుందని నమ్మకం కలిగింది. అతను మామూలుగా స్నేహితులతో ఆటకు వెళ్ళిపోయాడు.

అంతా కలిసి ఆకాట ఆడుకుంటున్నారు. పంటలు వేసుకోవడమైనాక ఇద్దరు దొంగలు తేలారు. వేపాకు తీసుకు రమ్మని వాళ్ళకు పురమాయించారు.

వేపచెట్టు అక్కడకు చాలా దూరంగా వుంది. దొంగలు వెళ్ళి వేపాకు తెచ్చేలోగా మిగతా వాళ్ళందరూ రహస్య ప్రదేశాలలో దాక్కుంటారు. దొంగ వాళ్ళను వెతుక్కుని వేపాకుతో ఎవరిని ముట్టుకుంటే వాళ్లు దొంగ అవుతారు.

సాయంత్రందాకా స్నేహితులా ఆట ఆడారు. ఆట పూర్తయ్యే సమయానికి వాళ్లకు మాణిక్యాలరావు కనబడలేదు. "ఇంకా ఎక్కడ దాక్కున్నాడు వీడు?" అంటూ చాలాచోట్ల వెతికారు. కానీ ఎక్కడా కనబడలేదు.

"బహుశా ఇంటికి పోయాడేమో" అనుకుని వూరుకున్నారు వాళ్లు. అలా వెళ్ళినందుకు కృష్ణమూర్తికి కోపం కూడా వచ్చి "ఆట మధ్యలో యిలా వెళ్ళడం గుడ్ మేనర్స్ కాదు. అడుగుదాముండండి" అంటూ నలుగురయిదుగురు కుర్రాళ్లని వెంట బెట్టుకుని మునసబుగారింటికి వెళ్ళాడు.

వీళ్ళను చూస్తూనే "మావాడేడీ?" అన్నాడు మునసబు.

"ఇంకా యింటికి రాలేదాండీ?" అన్నాడు కృష్ణమూర్తి.

"రాలేదు. మీతో ఆడుకోడానికే వెళ్ళాడు..." అన్నాడు శేషావతారం.

కృష్ణమూర్తి జరిగింది చెప్పగా శేషావతారం కొద్దిగా కలవరపడ్డాడు. "ఇదిగో కాస్త గ్రామమునాకరణ్ణకు కబురు చెప్పి వెదుదురూ" అన్నాడాయన కృష్ణమూర్తితో.

ఆ తర్వాత మాణిక్యాలరావు కోసం మామూలుగా వెదకడం ఆరంభమయింది. అయితే అతను వూరంతా గాలించినా దొరకలేదు. దాంతో అందరికీ కంగారు ప్రారంభమయింది. శేషావతారం మేకపోతు గాంభీర్యం వహించాడు కానీ చంద్రవంక ఏడ్చేస్తోంది.

ఆఖరుకి ఆరాత్రి తొమ్మిదిగంటలవేళ ఊరి చెరువులో మాణిక్యాలరావు శవం ఉన్నట్లు కనుక్కోవడం జరిగింది

ఆ చెరువు యిప్పుడు వాడకంలో లేదు. అందులోకి మొసలి చేరిందన్న పుకారు కారణంగా ఎవ్వరూ ఆ ప్రాంతాలకూడా వెళ్ళడం లేదు. మాణిక్యాలరావు ఆ చెరువు దగ్గరకు ఎందుకు వెళ్ళాడో, ఎలా వెళ్ళాడో అన్నదో ప్రశ్న అయితే, అందులో మునిగి చనిపోవడం ఎలా జరిగిందన్నది రెండో ప్రశ్న.

"మావాడికి ఈతబాగావచ్చు. చెరువులో యెలా చచ్చిపోయాడో నాకు పాలుపోవడంలేదు" అన్నాడు శేషావతారం శవాన్ని చూడగానే వచ్చిన దుఃఖాన్ని అణచుకొన్న కాసేపటికి.

ఊళ్ళో చాలామంది మనసుల్లో అమ్మవారు మెదిలింది. మాణిక్యాలరావు చెప్పినప్రకారం అమ్మవారతనికి ముందుగానే కనిపించి_ఇంక ఒక్కరోజు మాత్రమే ఆయుష్షున్నదని అంది. ఆమాటే నిజమైంది.

ఈ విషయం ఏం చేయాలన్న విషయంలో కొంత తర్జనభర్జన జరిగింది. పోలీసులకు చెప్పాలని కొందరూ, వద్దనికొందరూ అనసాగారు.

"అసలే కొడుకుపోయి పుట్టెడు దుఃఖంతో ఉన్న వాళ్ళను పోలీసులు ప్రశ్నలతో వేధిస్తారు. పోలీసులు

వస్తేమాత్రం పోయిన వరాడు బ్రతికొస్తాడా?'' అన్నారు కొందరు.

''ఇది అమ్మవారు తీసుకున్న నరబలి. పోలీసులు కలగ చేసుకుంటే ఆవిడ కోపం ఇంకా పెరుగుతుందేమో—''
అన్నారు ఇంకొందరు.

''బాగుంది. ఒకోసారి ఇలాంటి విషయాల్లో యేవో లొసుగులుంటూంటాయి. పోలీసులకు చెప్పడమే ఊరికి మంచిది'' అన్నారు మరికొందరు.

శేషావతారం పిచ్చివాడిలా శూన్యంలోకి చూస్తున్నాడు.

# 6

పోలీసుల పరిశోధనలో పెద్ద విశేషాలేమీ బయటపడలేదు.

ఈతరాని వరాడు నీళ్ళమధ్యలో చిక్కుకొని చనిపోయి వుండాలని వారు నిర్ణయించారు. అయితే వారు యెందర్ని ప్రశ్నించినా మాణిక్యాలరావు నీళ్ళమధ్యకు వెళ్ళవలసిన అవసరమేమిటో జవాబు దొరకలేదు. మాణిక్యాలరావును ఈతరానివాడుగా అనుకొంటే సమస్య కొంతమాత్రమైనా పరిష్కారమయ్యేది. అతను ప్రవాహంలో కూడా బాగా ఈతకొట్టగలడంటున్నారు. అటువంటప్పుడు చెరువులో వచ్చిన ఇబ్బందేముంటుంది?

లభించిన సమాచారాన్నిబట్టి — మాణిక్యాలరావును ఎవరో బలవంతంగా చెరువుమధ్యకు తీసుకెళ్ళి నీటిలో ముంచి— తేలకుండా అదిమిపట్టి వుంచివుండాలి. అలా చేయగలవ్యక్తి మంచి ఈతగాడయి వుండాలి. బలం గలవాడైవుండాలి.

మాణిక్యాలరావు సహోధ్యాయులలో అటువంటివాడు యెవడూ లేడు. ఊళ్లో చాలామంది బలాఢ్యులూ, గజ ఈతగాళ్ళూ వున్నారుకానీ మాణిక్యాలరావును చంప డానికి ఏకారణం చూపిస్తారు.

మాణిక్యాలరావుది చావుకాదనీ హత్య అనీ తేలగానే చాలామందికి భయం పట్టుకుంది. మాణిక్యాలరావుని హత్యచేయవలసిన అవసరం ఆ వూళ్ళో ఎవరికీలేదు కాబట్టి ఇది ఏదో మానవాతీతశక్తి పని అనుకోవాలి. అంటే అమ్మవారు తీసుకొన్న నరబలి అయుండాలి.

పోలీసులీ కేసును సీరియస్ గా తీసుకోలేదు. వివరాలు నమోదు చేసుకొని వెళ్ళిపోతూ — పనికివచ్చే సమాచారం లభిస్తే అందచేయమని కోరారు వారు.

పనికివచ్చే సమాచారం ఇంకేం లభిస్తుందని గ్రామ సులు అనుకొన్నారు. కానీ త్వరలోనే తమకు మళ్ళీ పోలీసులతో అవసరపడుతుందని అప్పుడు గ్రహించలేదు.

మాణిక్యాలరావు హత్యజరిగిన వారంరోజులకి ఊళ్ళో కుర్రాళ్ళు ఊరచివర పాడుబడ్డ ఆలయానికిపోయి ఆడు కుంటున్నారు.

ఆ ఆలయం ఏ శతాబ్దానిదో తెలియదు కానీ అద్భుత మయిన కట్టడం. గుర్తింపు లేకుండా పడివున్న ప్రాచీన శిథిలాలయాల్లో అదొకటి. ఊళ్ళో పిల్లలకు ఆటస్థలంగా ఉపయోగపడుతోంది. అందులో అయిదు చీకటి గుహాలు వున్నాయి. ఆ గుహల్లో కన్నుపొడుచుకున్నా కానరాని చీకటివుంటుంది. కుర్రాళ్ళక్కడ ఆడుకుందుకో కొత్త ఆట కనిపెట్టారు.

ఏదో బొమ్మనో, పెద్దదయిన వస్తువునో ఆ అయిదింటి లోనూ ఓ గుహాలో దాస్తారు. దీపం సాయంలేకుండా

వెళ్ళి ఆ వస్తువు ఏ గుహాలోవుందో కనుక్కోవాలి. ఈ ఆటలో రకరకాల రూల్సు, మార్కులువేసే పద్ధతులు వుంటాయి.

మొట్టమొదట ఒక కుర్రాడు సంచీలో బొమ్మను పెట్టుకుని అయిదు గుహల్లోకి వెళ్ళివస్తాడు. ఏ గుహాలో తను బొమ్మ పెట్టినదీ తెలియడానికి వీల్లేనివిధంగా సంచీని పట్టుకుంటాడతను. అతడు వెళ్ళివచ్చాక ఒక్కొక్కరే అయిదుగుహల్లోకి వెళ్ళివస్తూంటారు.

బొమ్మను వదిలిన కుర్రాడు గుహాలోంచి బయటకువచ్చి వాడిని ప్రశ్న అడుగుతాడు. అతడు ఉందో లేదో రహస్యంగా అతనికి చెబుతాడు. దాన్నిబట్టి అతను మార్కులు వేస్తాడు.

కరణంగారబ్బాయి మోహన్ మొదటిగుహాలోంచి బయటకువచ్చి "బొమ్మ కనబడలేదు" అన్నాడు దాచిన వాడితో రహస్యంగా. తర్వాత రెండోగుహాలోకెళ్లాడు. బయటకువచ్చి "బొమ్మకనబడింది" అన్నాడు. అయినా అతను మిగతా గుహల్లోకికూడా వెళ్ళాలి. ఏ గుహాలో అతనికి బొమ్మ కనబడిందీ మిగతావాళ్ళకి తెలియకూడదు. మోహన్ మూడోగుహాలోకికూడా వెళ్ళివచ్చి "ఇందాక నేను చెప్పింది తప్పు. బొమ్మ మూడోగుహాలోవుంది_" అన్నాడు.

"బాగా ఆలోచించుకు చెప్పు. రెండో గుహాలోనా, మూడోగుహాలోనా" అన్నాడు బొమ్మ దాచినవాడు.

"సందేహంలేదు, మూడో గుహాలోనేవుంది" అన్నాడు మోహన్ నమ్మకంగా.

"సరే_వెళ్ళు" అన్నాడు అతను. ఒకసారి చెప్పిన విషయాన్ని ఖండించినందుకు కొన్నిమార్కులుపోతాయి.

మోహన్ నాలుగో గుహలోకి వెళ్ళాడు. వెళ్ళినవాడు అయిదు నిమిషాలయినా బయటకురాలేదు. అందరూ ఓపికగా ఇంకో అయిదు నిమిషాలు ఎదురుచూశారు. అప్పటికీ అతను బయటకు రాలేదు.

"మోహన్–ఇంక బయటకు వచ్చేసేయ్" అని అరిచాడు ఒకడు.

"లోపలకు వెళ్ళిచూద్దాం" అన్నాడు ఒకడు.

"వెడదాంకానీ వాడెందుకు బయటకు రావడంలేదు" అన్నాడింకొకడు.

ఆ మాటలకు అందరికీ భయంకలిగింది. "వాడికేమైనా అయిందంటావా?" అన్నాడొకడు.

"ఏమో–మరికాసేపు చూసి పెద్దవాళ్ళకు చెబుదాం"

కనుచీకటి పడే సమయమయింది కానీ మోహన్ మాత్రం గుహలోంచి బయటకు రాలేదు. అంతా కంగారుగా అక్కణ్ణించి బయల్దేరి కరణంగారింటికి వెళ్ళి జరిగింది చెప్పారు.

ఆ కబురు వింటూనే కరణంగారికి కాళ్ళూ చేతులూ ఆడలేదు. ఆయన ఆడవాళ్ళకి ఏ విషయమూ చెప్పకుండా దేవుడి గదిలోకివెళ్ళి దణ్ణంపెట్టుకొని ఇంట్లోంచి బయటకు వచ్చి—నలుగుర్నీ పోగేసుకుని ఆ శిధిలాలయం చేరుకున్నాడు.

టార్చిలైట్లు వేసుకొని గుహలో ప్రవేశించేసరికి వాళ్లకు కనబడ్డ దృశ్యం అత్యంత భయంకరమైనది.

గుహలో తలపగిలి పడివున్నాడు మోహన్. అతని ప్రాణం యెప్పుడోపోయింది. కొడుకు శవాన్నిచూస్తూ కుప్పలా కూలిపోయారు కరణంగారు.

# 7

పోలీసులు మళ్ళీ రంగంలో ప్రవేశించారు. శవాన్ని పరీక్షించి, పరిస్థితుల నాకళింపు చేసుకొని వారు కొన్ని పాయింట్సు నోట్ చేసుకున్నారు.

చనిపోయిన యిద్దరిలో ఒకడు మునసబుగారబ్బాయి, రెండోవాడు కరణంగారబ్బాయి. ఇద్దరూ గ్రామాధికారులే! అంటే ఇదేదో గ్రామాధికారులపైన పగపెట్టుకుని ఎవరో చేసిన వ్యవహారమయుండ వచ్చును.

గ్రామాధికారుల కూళ్ళో చాలా లావాదేవీలుంటూంటాయి. చాలామందితో పేచీలుంటూంటాయి. ఈ హత్యలకు అదే కారణమయే అవకాశముంది.

గుహలో మోహన్ తల పగిలింది. అతడి తలక్రింద రాయివుంది. క్రింద పడిపోయినపుడు తలకు రాయితగిలి ప్రమాదం జరిగిందనుకోవచ్చు. కానీ రాయి తగిలినప్పుడు మోహన్ పెద్దగా కేక పెట్టాలి. గుహలోంచి కేక పెడితే బయటకు వినిపిస్తుందని ప్రయోగపూర్వకంగా పోలీసులు తెలుసుకున్నారు. మరి మోహన్ కేక ఎందుకు పెట్టలేదు? ఎవరయినా అతని నోరు నొక్కివుంచారా?

మోహన్‌ది హత్య కావడానికి అవకాశముంది. అతడి సహాధ్యాయులెవరయినా ఆ పని చేశారనుకునేందుకు అవకాశం కనపడ్డంలేదు. ఒకరు కాదు, ఇద్దరు కాదు. సుమారు పదిహేనుమంది కుర్రాళ్ళకలసి జరిగినది చెబుతున్నారు.

వాళ్ళందరూ బయటవుండగా మోహన్ ఒక్కడూ లోపలకు వెళ్ళడం, అంతకుముందు ముగ్గురు కుర్రాళ్ళు అయిదు గుహలలోకీ వెళ్ళి సురక్షితంగా బయటకొచ్చారు.

ఈ గుహల ఆట సుమారు పాతికేళ్ళుగా కొనసాగుతోంది. ఇంతవరకూ ఒక్క చిన్న ప్రమాదంకూడా జరగలేదు.

పోలీసులు చాలామందిని ప్రశ్నలడిగారు. వారికి పనికి వచ్చే సమాచారం లభించలేదు. అయితే ఈ పర్యాయం విషయాన్ని వారంత తేలికగా తీసుకోలేకపోయారు.

అమ్మవారు నరబలి కోరుతున్నదన్న పుకారు ఊళ్ళో ఉన్నట్లుగా గ్రహించి పోలీసులకు ఆ పుకారెలా పుట్టిందన్న ఆధారం కోసం చేసిన ప్రయత్నంలో పూజారి రంగయ్యపై అనుమానం కలిగింది. వారు రంగయ్యను కలుసుకుని రకరకాల ప్రశ్నలు వేశారు.

ఆర్థికంగా పూజారి రంగయ్య పరిస్థితి అంటే బాగో లేదు. అమ్మవారిని ప్రజలాదరించి కానుకలూ, దక్షిణలూ దండిగా సమర్పించుకుంటేనే తప్ప, అతని ఆర్థికపరిస్థితి బాగుపడదు. అవసరం మనిషిని ఎంతకయినా దిగజార్చ గలదు కాబట్టి, రంగయ్య ఈ హత్యలు చేసినా ఆశ్చర్యం లేదు.

పోలీసులకు రంగయ్య చెప్పిన సమాధానాలు అంత తృప్తికరంగా లేవు. కానీ అతగాడికి దుర్భేద్యమయిన ఎలిబీలున్నాయి. హత్యా సమయానికే అతడికంతటి ఎలిబీలుండడం కూడా పోలీసుల అనుమానం పెరగడానికి కారణముంది. ఎందుకంటే ఆ ఎలిబీలు వాటంతటవి ఏర్పడినట్లు కాక కావాలని కల్పించుకున్నాయనిపించే విధంగా వున్నాయి.

హత్యలు జరుగుతాయని రంగయ్యకు తెలిసివుండాలని పోలీసులు తీర్మానించుకుని అతడినో కంట కనిపెట్ట డానికి ఓ కానిస్టేబుల్‌ని నియోగించారు. ఆ కానిస్టేబులు పేరు అబ్బులు.

౩

అబ్బులు పోలీసుల మనిషి అని ఊళ్ళోవాళ్ళకి తెలి యదు. మామూలు దుస్తుల్లో వుంటూ ఏదో పని మీద

వచ్చినవాడిలా ఓ రైతు ఇంట్లో మకాం పెట్టాడు. అతని డ్యూటీ రంగయ్యను అనుక్షణం కనిపెట్టి వుండడం.

అబ్బులు కావడానికి కానిస్టేబులే అయినా చురుకైన వాడు. రంగయ్యకు అనుమానం రాకుండా వుండడం కోసం అతను మొదటి రోజునే రంగయ్యను కలుసుకుని తన కుటుంబంలో ఏవో ఇబ్బందులున్నాయనీ, అందు కారణం గ్రహదోషమని నమ్ముతున్నాననీ చెప్పాడు. నమ్మకమైన దేవతకు మొక్కుకుని తన కష్టాలు తీర్చుకో వాలనుకుంటున్నట్లు కూడా చెప్పాడు.

“మా మహాకాళి చాలా గొప్ప దేవత—” అన్నాడు రంగయ్య.

“నువ్వు చెప్పడానికేం—నాకు నమ్మకం కలగాలిగా”

“కలిగితే ఏం చేస్తావు?”

“అమ్మవారికో వెయ్యి, పూజారికో వెయ్యి...”

“రూపాయలే...” అంటూ నోరావలించాడు రంగయ్య.

“కాకపోతే పైసలనుకున్నావా?” అన్నాడు అబ్బులు.

రంగయ్య సంబోధన వెంటనే మారిపోయింది— “బాబూ మీరింక జాప్యం చేయకండి. అమ్మవారికి మొక్కుకుని నష్టపోయిన వాళ్ళింతవరకూ లేరు...”

“కానీ ఊళ్ళో నేను విన్నదాన్నిబట్టి అమ్మవారు చాలా నష్టపోయింది.”

“అంటే?”

“మొక్కుబడి చెల్లించనివాళ్ళను అమ్మవారు ఏమీ చేయలేకపోతోంది. అంటే ఆవిడకు ఏ శక్తీ లేదనేగా” న్నాడు అబ్బులు.

అ

"ఇప్పటి కాళ్ళో రెండు నర బలులు జరిగాయి. అది అమ్మవారి ప్రభావమే."

"అవి హత్యలని నా అనుమానం..." అంటూ అబ్బులు రంగయ్య ముఖంలోకి పరీక్షగా చూశాడు. రంగయ్య ఏమాత్రమూ తడబడకుండా నమ్మకంగా ముఖం పెట్టి "అవి హత్యలు కావు. ముమ్మాటికీ అమ్మవారు తీసుకున్న నరబలులు" అంటూ జరిగిన కథ కొంత ఏకరువు పెట్టాడు. అమ్మవారు ముందుగానే మాణిక్యాలరావును హెచ్చరించడం గురించి అతను చెప్పాడు.

"ఊరిమీద కోపం వచ్చి యిద్దర్ని బలిగొన్నదన్న మాట అమ్మవారు."

"ఇద్దరితో వదిలి పెడుతుందేమిటి—ఇంకా వున్నారు" అన్నాడు రంగయ్య.

అబ్బులు కంగారుగా రంగయ్య ముఖంలోకి చూశాడు. అతని ముఖంలో అమ్మవారిపై నమ్మకం తప్పితే క్రూరత్వమేమీ గోచరించలేదు.

"అంత కచ్చితంగా ఎలా తెలుసు నీకు?"

"ఇంకా ఊరివాళ్ళకు బుద్ధి రాలేదు. అదే కారణం..."

"బుద్ధి వచ్చేదాకా జనం అలా చస్తూనే వుంటారా?"

"అంతేమరి—దేవతలతో చెలగాటం..."

అబ్బులు రంగయ్యతో మరి మాట్లాడలేదు. ఏదోవంక పెట్టి తరచుగా అతన్ని కలుసుకుంటూండడమూ, అతన్నో కంట కనిపెడుతూండడమూ చేస్తున్నాడు. ఒక రోజున అతడికి అమ్మవారి మీద చాలా నమ్మకం కలిగినట్లు చెప్పి రంగయ్యచేత పూజ చేయించి పది రూపాయలిచ్చాడు.

పూజ పూర్తయ్యే సమయానికి ఎవరో అక్కడికి రొప్పుకుంటూ వచ్చారు. రంగయ్య అతన్ని చూసి—

"ఏమోయ్ వరాలూ - ఏమిటిలా పరుగెత్తుకుంటూ వచ్చావ్?" అన్నాడు.

"అమ్మవారి మొక్కు తీరుస్తాను. మా ఇంట్లో అందరి పేరునా పూజ చేయించాలి. నీకెప్పుడు తీరుబడవుతుందో చెప్పాలి..." అన్నాడు వరాలు.

"ఇంతకీ ఏం జరిగింది?" అన్నాడు రంగయ్య. అతడి ముఖం సంతోషంతో వెలిగిపోతోంది.

"అమ్మవారు మళ్ళీ ఇంకో బలి తీసుకుంది" అన్నాడు వరాలు.

అబ్బులు వులిక్కిపడి.—"ఎప్పుడు?" అన్నాడు.

"ఎప్పుడో కాదు ఇప్పుడే— పది నిముషాలవుతుందేమో!"

అబ్బులు చటుక్కున అక్కడ్నించి లేచాడు. అయిదు నిముషాల్లో శవమున్నచోటు చేరుకున్నాడు.

ఈసారి చనిపోయినది మునెయ్య కొడుకు రమణరావు. అంతకు ముందు జరిగిన హత్యలకంటె భయంకరంగా వుందిది. తల, మొండెం దేనికి దానికే వేరుగా వున్నాయి. హత్య జరిగింది మునసబుగారి మామిడి తోటలో. చూసిన వాడు మునసబుగారి పాలేరు. శవాన్ని అతను చూడడానికి అరగంట ముందు రమణరావును చాలామంది చూశారు. అతను మునసబుగారి తోటలోకి ఎందుకు వెళ్ళాడో ఎవరికీ అర్థం కాలేదు.

పోలీసులు వచ్చి వివరాలన్నీ సేకరించుకున్నారు. ఇది వారికి అంతు చిక్కని సమస్యగా పరిణమించింది. పూజారి రంగయ్య మాత్రం ఇది అమ్మవారి పనేననీ వూరి వారందరూ పెద్ద ఎత్తున శాంతిపూజలు జరిపించాలనీ తన అభిప్రాయం చెప్పాడు.

మూడో మనిషి చావడంతో ఊరు నిజంగా గగ్గోలెత్తిపోయింది. అమ్మవారికి శాంతిపూజలు జరిపించాలనీ అందుకు చందాలు వసూలు చేయాలనీ కొందరు అప్పటి కప్పుడు తీర్మానించారు.

పోలీసులను ఆశ్చర్యపరచిన విషయమేమిటంటే చని పోయిన వారందరూ కుర్రాళ్ళే! అమ్మవారు ప్రత్యేకంగా కుర్రవాళ్ళనే ఎందుకు బలి తీసుకుంటోంది? మానవహంత కుడైనా అందరూ కుర్రవాళ్ళనే ఎందుకు ఎన్నుకుంటు న్నాడు?

హతుడి తండ్రి మునెయ్య చాలావిచారంగా వున్నాడు. అతడికి కొడుకంటే ప్రాణం. పోలీసులు ప్రశ్నలడగ డానికి వస్తే అతను భోరున ఏడ్చేశాడు.

"మీరు చాలా దుఃఖంలో ఉన్నారని తెలుసు. ఐనా మిమ్మల్ని కొన్ని ప్రశ్నలడక్క తప్పదు" అన్నాడు ఇన్ స్పెక్టర్.

"అడగండి—" అన్నాడు మునెయ్య కళ్ళు తుడుచు కుంటూ.

"ఎవరో ఈ హత్యల్ని చాలా పకడ్బందీగా చేస్తు న్నారు. ఎంత ఆలోచించినా కారణాలు అంతుబట్టటం లేదు. ఇది అమ్మవారి పని అని నేను నమ్మడం లేదు. హత్యే అయితే ఫలానా కారణమని మీరూహించి చెప్ప గలరా?" అన్నాడు ఇన్ స్పెక్టర్.

పుట్టెడు దుఃఖంలో వున్నాడు మునెయ్య. "ఎవరి కయినా నామీద కక్ష వుండొచ్చుగానీ ముక్కు పచ్చ లారని ఈ బిడ్డమీద ఎందుకుంటుంది చెప్పండి?"

"మీ బిడ్డను చంపి మిమ్మల్ని దుఃఖపెట్టాలనుకో వచ్చుగదా—"

"ఇవన్నీ మీ ఊహలు. ఇది నిస్సందేహంగా అమ్మవారి పనే!" అన్నాడు మునెయ్య.

ఇన్‌స్పెక్టర్ అతన్నింక ప్రశ్నించలేదు. ప్రజల్లో అమ్మవారి భయం క్రమంగా అలుముకుంటున్నదని అతను గ్రహించాడు. అబ్బులు చెప్పిందాన్నిబట్టి రంగయ్య ప్రవర్తన అనుమానాస్పదంగా లేదు.

పోలీస్ ఇన్‌స్పెక్టర్ ఆ గ్రామంలో ఓ వారంరోజులుండాలని అనుకున్నాడు. అతనూ, నలుగురు కానిస్టేబుల్సూ మునసబు గారింట్లోనే మకాం పెట్టారు. అబ్బులు మాత్రం వాళ్ళతో సంబంధం లేనివాడులా వేరేవున్నాడు.

# 9

పొరుగూళ్ళో బారసాల జరిపించి అక్కడే కాస్త విశ్రమించి తిరిగి తన గ్రామం చేరుకునేసరికి రాత్రి తొమ్మిదయింది సోమయాజులుకి.

ఆ ఊళ్ళో సాధారణంగా రాత్రి ఎనిమిది దాటేసరికి వీధులన్నీ నిర్మానుష్యంగా ఉంటాయి.

సైకిల్ తొక్కుకుంటూ సోమయాజులు మునసబుగారిల్లు దాటేసరికి అక్కడ ఆయన్నిద్దరు మనుషులు అటకాయించి "ఎవర్నువ్వు?" అని అడిగారు.

సోమయాజులు కంగారుగా, "ఎవరు మీరు? ఏమిటీ దౌర్జన్యం?" అన్నాడు.

"దౌర్జన్యమూ కాదు—బొందా కాదు. మా కర్మ. నువ్వా పంతులూ వెళ్ళు!" అన్నాడు ఇద్దరిలో ఒకడు.

"అసలేమిటి కథ?" అన్నాడు సోమయాజులు.

"ఊళ్లో ఇప్పటికి ముగ్గురు చచ్చారు. ఇంకా ఎంత

మంది చస్తారో, ఏ రోజు ఎవరికి మూడుతుందో తెలియక మేమిక్కడ కాపలా పెట్టాం. రాత్రి తెల్లవార్లూ మాకు నిద్ర వుండదు.''

వాళ్ళు పోలీసులని అర్థం చేసుకుని సోమయాజులు నవ్వుకుని ఇంటికి వెళ్ళిపోయాడు. ఆయన వెళ్ళిన కొద్ది సేపటికి రొప్పుకుంటూ అక్కడికో కుర్రాడు వచ్చాడు.

పోలీసులా కుర్రాడ్ని అటకాయించారు.

''నేను ఇన్ స్పెక్టర్ గార్ని చూడాలనుకుంటున్నాను'' అన్నాడా కుర్రాడు.

''ఎందుకు?''

''హత్యల గురించి నాకో అనుమానం వచ్చింది...'' అన్నాడు కుర్రాడు.

పోలీసులు వెళ్ళి ఇన్ స్పెక్టర్ని లేపారు.

''నా పేరు రవికుమార్,'' అన్నాడు కుర్రాడు.

''ఊఁ చెప్పు.''

రవికుమార్ జేబులోంచి ఓ కాగితంతీసి ఇన్ స్పెక్టర్ కిచ్చాడు. ఆ కాగితంమీద చాలా పేర్లురాసి ఉన్నాయ్.

''ఏమిటీ కాగితం?'' అన్నాడు ఇన్ స్పెక్టర్.

''అందులో పేర్లు చూడండి. నంబర్లు చూడండి. వరుసప్రకారం యిప్పటికి ముగ్గురు చచ్చిపోయారు. ఆ వరుసప్రకారమే హత్యలు జరుగుతున్నాయని నా అనుమానం.''

ఇన్ స్పెక్టర్ ఉలిక్కిపడి ఆ లిస్టు మళ్ళీ చూశాడు. అందులో మొదటిపేరు మాణిక్యాలరావుది. రెండు మోహన్. మూడు రమణరావు.

''ఈలిస్టు నీ కెక్కడిది?''

"ఇది నా హాబీ—రాంకుల ప్రకారం మా క్లాసువాళ్ళ పేర్లన్నీ నోట్ చేస్తాను. పాత మార్కుల్నిబట్టి వచ్చే పరీక్షలలో ఎవరెవరికి ఏయే రాంకులొస్తాయో ముందుగానే వూహిస్తాను. పరీక్షలయ్యాక నా వూహాలోని జాబితానూ అసలు జాబితానూ పోల్చిచూస్తాను. నూటికి తొంభైపాళ్ళు నా వూహా రైటవుతూంటుంది.

ఈ వేళ రాత్రి కూర్చుని వచ్చే పరీక్షలకు రాంకింగ్సు లిస్టు తయారు చేస్తున్నాను. అయితే మా క్లాసులో ముగ్గురు చచ్చిపోవడంవల్ల ఆ పేర్లు తీసేయవలసి వచ్చింది. అవి కొట్టేద్దామని లిస్టు తీసేసరికి ఈ విషయం స్ఫురించింది. మా ఇంట్లో అందరూ పడుకున్నారు. నేనీపనిలో వుండిపోయాను. టైము తెలియలేదు. ఈ విషయం స్ఫురించగానే వెంటనే మీ దగ్గరకు పరిగెత్తుకొచ్చాను. ఇలా జరగడం నాకే ఆశ్చర్యంగావుంది."

ఇన్‌స్పెక్టర్ మెచ్చుకోలుగా రవికుమార్ వంక చూసి, "నిరాధారంగా పయనిస్తోన్న మాకో ఆధారం చూపించావు. చాలా థాంక్సు. కానీ ఇంత రాత్రివేళ బయల్దేరి వచ్చావ్. భయంవేయలేదూ?" అన్నాడు.

"నాకూ భయానికీ ఆమడదూరం. నేను పరుగెత్తుకు రావడానికి కారణం వెంటనే ఈ విషయం మీకు తెలిస్తే నాలుగో మనిషిని రక్షించగలుగుతారని..." అన్నాడు రవికుమార్.

"ఎవరా నాలుగో మనిషి?" అంటూ లిస్టు చూశాడు ఇన్‌స్పెక్టర్. అక్కడ చినసోమయాజులు పేరుంది.

"సోమయాజులు గారబ్బాయండి. పక్కవీధిలోనే వాళ్ళ యిల్లు."

ఇన్‌స్పెక్టర్ ఓ కానిస్టేబిల్‌ని తోడిచ్చి రవికుమార్‌ని ఇంటివద్ద దిగవిడిచి రమ్మన్నాడు. వెళ్ళేముందు రవికుమార్‌తో "ఈ విషయం ఇంకెవ్వరికి చెప్పకుసుమా," అన్నాడు. రవికుమార్ అలాగేనని తలూపాడు.

ఇన్‌స్పెక్టర్ రవికుమార్ యిచ్చిన స్టేట్‌మెంట్ వంకే తదేక దీక్షతో చూస్తూ ఆలోచించసాగాడు. ఆలోచిస్తున్నకొద్దీ కేసు స్వరూపం కొద్ది కొద్దిగా అతనికి అర్థంకాసాగింది.

"ఎవరికో అమ్మవారి ఆదాయంవల్ల ప్రయోజనముంది. అమ్మవారి ప్రభావానికి ప్రచారాన్నివ్వాలనుకున్నారు. అందుకు విద్యార్థులను బలిగొనాలని నిర్ణయించుకున్నారు. అయితే ఎవరిని చంపాలి? అందుకోసం తొమ్మిదవ తరగతి విద్యార్థుల నెన్నుకుని రవికుమార్ వద్దనున్న జాబితాను మార్గదర్శకంగా పెట్టుకున్నారు. ఇలా ఎన్ని హత్యలు చేస్తారు? ఈ హత్యాకాండ ఎంతకాలంగా కొనసాగిస్తారు? ఇప్పటికే ప్రజల్లో చెప్పకోతగ్గ సంచలనం వచ్చింది. అందరూ అమ్మవారంటే భయపడుతున్నారు.

ఇన్‌స్పెక్టర్ శరీరం గగుర్పొడిచింది. భవిష్యత్తుమీద ఎన్నో ఆశలు పెంచుకున్న పసి ప్రాణాలను బలిగొంటున్నాడు హంతకుడు.

రవికుమార్‌ని దిగవిడిచి కానిస్టేబుల్ తిరిగి రాగానే "మనం ఒక పర్యాయం సోమయాజులు గారింటికి వెళ్ళివద్దాం. విషయం తెలిశాక హెచ్చరించడం మన విధి" అన్నాడు.

## 10

చినసోమయాజులు అల్పాచమనానికి లేచాడు. అతడికి కొద్దిగా భయం వేసింది. అటువైపు తిరిగి తల్లిని తట్టిలేపి "అమ్మా-సాయం వస్తావా?" అన్నాడు. ఆవిడ మంచి నిద్రలో వున్నట్లుంది-"పెద్దాడివౌతున్నావు ఇంకా భయ మెందుకురా?" అంది.

"ఏమోనమ్మా చాలా భయంగా వుంది..." అన్నాడు చినసోమయాజులు.

"మగపిల్లాడికంత భయముండకూడదు" అంది తల్లి.

"పోనీ నాన్నగార్ని లేపనా?"

"ఆయన మొదలే విసుక్కుంటారు. ఊర్నించి వచ్చి రాగానే మంచినీళ్ళైనా తాగకుండా నిద్రకు పడ్డారు" అంది తల్లి.

చినసోమయాజులుకు భయంగా వుంది. అందులోనూ అమ్మవారు నరబలి తీసుకోవడమూ, తన సహాధ్యాయులు ముగ్గురు చనిపోవడమూ అతడి భయాన్ని పెంచుతోంది. అయితే తల్లికా విషయం చెప్పడానికతడికి అభిమానం అడ్డొచ్చింది. తను అమ్మవారిని నమ్మనని అతను ఎన్నో మార్లు చెప్పాడు. కానీ ఇప్పుడు మితిమీరిన అవసరం వల్ల—"నా క్లాస్‌మేట్స్ ముగ్గురు చచ్చిపోయారు. అందుకని కాస్త భయంగా వుందమ్మా..." అన్నాడు.

అతడి తల్లికి బాగా నిద్ర పట్టినట్లుంది. లేకుంటే ఈ మాటల కావిడకు బాగా మెలకువ రావలసిందే. మగత లోనే—"వాళ్ళ కర్మకొద్దీ వాళ్ళు పోయారు. నువ్వు భయపడకు. గమ్మున వెళ్ళొచ్చేసేయ్" అంది.

తల్లి సాయానికి రాదని అతడికి తెలిసిపోయింది. అతను

లేచి నిలబడి "నేను అమ్మా అంటాను. నువ్వు ఊఁ అంటూండు..." అన్నాడు.

అలా చేయడం వాళ్ళిద్దరికీ అలవాటే. అశబ్దతరంగాలే వాళ్ళిద్దర్నీ సన్నిహితుల్ని చేసినట్లు భావించుకుంటారు.

"అమ్మా!" అన్నాడు చినసోమయాజులు గుమ్మం లోంచి దొడ్లోకి అడుగు పెడుతూ.

"ఊఁ" అంది చినసోమయాజులు తల్లి.

అతను గట్టిగా అమ్మా అన్నప్పుడల్లా నిద్రమగతలోనే 'ఊఁ' అంటోందావిడ.

అయితే ఆవిడ గమనించని విషయం అతగాడు హఠాత్తుగా అమ్మా అని పిలవడం మానేయడం. అదే నిద్ర ప్రభావం. మగతలో ఆవిడ కొడుకింకా తనను అమ్మా అని పిలుస్తున్నట్లూ-తను ఊఁ అని జవాబిస్తున్నట్లూ వూహించుకుంటోంది. చినసోమయాజులు అమ్మా అనడం మానేశాడు. లోపలకూ రాలేదు.

కాసేపటికి ఎవరో తలుపు తడుతున్న చప్పుడు కావిడకు మెలకువ వచ్చి లేచింది. అయితే వెంటనే తలుపు తీయడానికి భయం వేసి భర్తను లేపింది. విసుక్కుంటూనే ఆయన లేచి వెళ్ళి తలుపు తీశాడు.

"క్షమించాలి సోమయాజులుగారూ! మిమ్మల్ని హెచ్చరించడానికి వచ్చాను. మీ అబ్బాయేం చేస్తున్నాడు?" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"ఏం?"

"మాకు అందిన సమాచారం ప్రకారం ఊళ్ళో మీరందరూ అనుకుంటున్న అమ్మవారి నరబలుల్లో నాలవది మీ వాడిది కావచ్చు..." అన్నాడు ఇన్‌స్పెక్టర్.

సోమయాజులు ఉలిక్కిపడి "ఏమిటన్నారు?" అన్నాడు.

"మీ అబ్బాయి ప్రాణాలకు ప్రమాదముంది. జాగ్రత్తగా చూసుకోండి..."

సోమయాజులు భార్య ఉలిక్కిపడి లోపలకు పరుగెట్టింది. చూస్తే పక్కమీద కొడుకు లేడు. అదే విషయాన్ని ఆవిడ గట్టిగా కేక వేసి చెప్పింది. సోమయాజులు, ఇన్స్పెక్టరూ పరుగెత్తుకుని లోపలకు వెళ్ళారు.

"సాయంత్రమని లేపాడు. అమ్మా అంటే ఊ అంటూంటూను, వెళ్ళిరా అన్నాను. అలాగే అమ్మా అన్నాడు. ఎప్పుడు మా నేశాడో గుర్తులేదు. మళ్ళీ లోపలకు వచ్చినట్లు లేదు. ఏం జరిగిందో ఏమిటో..." అంటూ సోమయాజులు భార్య శోకం మొదలెట్టింది.

ఆవిడ్ని ఊరుకోమని చెప్పి మగాళ్ళిద్దరూ దొడ్లోకి వెళ్ళారు. అక్కడే శ్రమలేకుండానే వాళ్ళకు చినసోమయాజులు శరీరం కనబడింది. అయితే ఆ శరీరానికి ప్రాణం లేదు. ఎవరో పీక నులిమి చంపేశారు.

కొడుకు శవాన్ని చూస్తూనే సోమయాజులు మ్రాన్పడి పోయాడు.

"ఆలశ్యం కాకుండా హెచ్చరిద్దామనుకున్నాను. కానీ ఆలశ్యమైపోయింది" అనుకుంటూ ఇన్స్పెక్టర్ వీధిలోకి పరుగెత్తాడు. ఆ వీధిలో అరుగు అరిక మీద చంద్రయ్య కాపలా కాస్తున్నాడు.

"చంద్రయ్యా—ఈ వీధిలోకి ఎవరేనా రావడంగానీ, వెళ్ళడంగానీ జరిగిందా?"

లేదన్నాడు చంద్రయ్య.

"అయితే ముందు నీ యింటికి పరుగెత్తు. ఈ హత్యలిలా ఎన్ని జరుగుతాయో తెలియదు కానీ అప్పుడే నాలుగో హత్య కూడా జరిగింది. అయిదో హత్య జరిగితే అది నీ అబ్బాయిదే అవుతుంది" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"అయ్యబాబోయ్ — నాకయితే ఒక్కడే కొడుకూడాను..." అంటూ పరుగు తీశాడు చంద్రయ్య.

# 11

"అమ్మవారే చేస్తోందో—మనిషే చేస్తున్నాడో కానీ హత్యలు మాత్రం చాలా పకడ్బందీగా జరుగుతున్నాయి. ఎక్కడా వేలిముద్రలు కూడా దొరకడం లేదు. కృష్ణమూర్తీ, నువ్వు కుర్రాడివి. చాలా జాగ్రత్తగా వుండాలి. ఎవర్నీ నమ్మకు. ఒంటరిగా ఎక్కడికీ వెళ్ళకు. స్కూలుకు వెళ్ళగానే వెంటనే ఇంటికొచ్చేసేయ్. అమ్మనో నాన్ననో అలా అంటిపెట్టుకొనే వుండు. నీకు కాపలాగా మా కానిస్టేబులు కూడా ఒకడుంటాడు..." అన్నాడు ఇన్‌స్పెక్టర్.

కృష్ణమూర్తి భయంతో వణికిపోతూ—"ఇంతమందిని రక్షించలేని మీరు...నన్ను మాత్రం ఎలా రక్షించగలరు? ఇది అమ్మవారి పగ. దీన్నుంచి తప్పించుకోలేనేమో" అన్నాడు.

"అలాగనకురా_నీకేం భయంలేదు. అమ్మవారికి పూజలు చేయిస్తాను. దండిగా కానుకలిచ్చుకుంటాను" అన్నాడు చంద్రయ్య.

కృష్ణమూర్తికి నమ్మకం కలిగినట్టులేదు. అతడికి ఆ రాత్రే జ్వరం వచ్చింది. జ్వరంనిండా పలవరింతలు...తల్లీ,

మహాకాళీ...నన్ను చంపకు...అంటూ కేకలు పెట్టాడు. ఓరాత్రివేళ లేచి కూర్చుని వెర్రి చూపులు కూడా చూశాడు. అతని పరిస్థితి చూస్తూ తల్లి భయపడిపోయింది. చంద్రయ్య కూడా బాగా కలవరపడిపోయాడు.

మర్నాడు మునసబుగారి పాలేరుకు మహాకాళి పూనింది "ఒరేయ్ వెధవల్లారా! నేను బలి తీసుకున్న దెవర్నో ముందుగా మీకు తెలియనిస్తాననుకున్నారుట్రా... నేను ఈ పర్యాయం వ్రవాడ్ని బలితీసుకోను... పెద్దవాడ్నే."

ఈ పూనకంతో ఊరంతా గగ్గోలెత్తిపోయింది.అంతా ప్రాణాలరచేతిలో పెట్టుకున్నారు.

ఇన్స్పెక్టర్ కిదంతా అగమ్యగోచరంగా వుంది. దేవతలు మనుషుల్లో కలిసిపోయి కక్షలు తీర్చుకోవడమూ, తమ మాటలు మనుషులచేత చెప్పించడమూ...అతడికి నమ్మశక్యం గాలేదు. మునసబుగారి పాలేర్నో పట్టు పట్టాలని అతను అనుకొన్నాడు.

అతడినోసారి పిలిపించి, ప్రశ్నల పేరుతో ఓ గదిలోకి తీసుకువెళ్ళి—"పోలీసులు పెట్టే చిత్రహింసల సంగతి నీకు తెలియదు. అమ్మవారు పూనిందంటూ వూళ్ళో నువ్వన్న మాటలు నేను నమ్మడం లేదు. నిన్ను చావ గొట్టకుండా నిజం చెబితే సరేసరి...లేదా దెబ్బలు, జైలు వగైరాలు చాలా వుంటాయి. అసలు సంగతి చెప్పు. అమ్మవారి పూనకం నటించమనీ, ఆ మాటలు చెప్పమనీ నిన్నెవరు ప్రోత్సహించారు?" అనడిగాడు.

ఎంతో శ్రమ లేకుండానే పాలేరు అసలు విషయం బయటపెట్టాడు.

అతగాడినలా ప్రోత్సహించింది మునసబు శేషావతారమేనని తెలిసేసరికి ఇన్స్పెక్టర్ కి కలిగిన ఆశ్చర్య

మింతా అంతా కాలేదు. తక్షణం అతడు మునసబును కలుసుకున్నాడు. ఇన్ స్పెక్టర్ ప్రశ్నకు మునసబు కంగారుపడలేదు.

"చంద్రయ్య నా కాళ్ళావేళ్ళా పడినవాడు. అతను తన గోడు చెప్పుకున్నాడు—కొడుకు బెంగ పెట్టుకున్నాడని. ఆ భయం తగ్గించడానికి నేను మా పాలేరుచేత అలా చెప్పించాను."

"ఇది మంచిపనికాదు. మీరు చేసిందానివల్ల వూరంతా హడలిపోతోంది. అలాగే ఆ అబ్బాయి కృష్ణమూర్తి కూడా అజాగ్రత్తగా ఉండవచ్చు. ప్రజలకు నిజం తెలియడం చాలా అవసరం..." అన్నాడు ఇన్ స్పెక్టర్.

"మీరేది మంచి అనుకుంటే అదే చేయండి" అని వూరుకున్నాడు మునసబు.

ఇన్ స్పెక్టర్ వెంటనే మునసబుగారిచేత, పాలేరుచేత వూరందరికీ నిజం చెప్పించాడు. ఊళ్ళో ఎక్కువా శేషావతారాన్ని తప్పు పట్టలేదు. ఓ కుర్రాడ్ని రక్షించడం కోసం ఆయనలా చేయడం మంచిదన్నట్లుగా చాలామంది అభిప్రాయపడ్డారు.

కృష్ణమూర్తికీ విషయం తెలియగానే మగతలోకి వెళ్ళిపోయాడు. తనకు చావు తప్పదన్న విషయం అతనికి రూఢి అయింది. అతని శరీరం సలసల కాగిపోతోంది.

ఊళ్ళోని నాటు వైద్యుడు కృష్ణమూర్తిని చూసి కంగారుపడి "నావల్లకాదు. పట్నం తీసుకుపొండి" అని చెప్పేశాడు.

## 12

కృష్ణమూర్తిని పట్నం తీసుకు వెళ్ళారు.

డాక్టర్ పరిశీలించి ఏవో ఇంజక్షన్లు చేశాడు కానీ ఫలించలేదు. వివరాలన్నీ తెలుసుకుని ఆయన "కుర్రవాడు బాగా భయపడ్డట్లున్నాడు. ఏదో విధంగా ఆ భయం పోగొట్టే మార్గం చూడాలి" అన్నాడు.

ఎవ్వరికీ ఏమీ దారి తోచలేదు. చంద్రయ్యకు మతి మతిలో లేదు. కొడుకు దగ్గరకు వెళ్ళి "ఎందుకురా అలా భయపడతావ్-నిన్నెవ్వరూ ఏమీ చేయలేరు. నేను నీకు కాపలాగా వుండగా..." అని ఏదో అనబోగా—

"నాన్నా—అమ్మవారిని నువ్వేం చెయ్యగలవ్? మా క్లాసులో తెలివయిన వాళ్ళందర్నీ ఒక్కొక్కరినే వరుసగా పొట్టన పెట్టుకుంటోందా మహాకాళి. అదుగో... నాకేసి చాలా కోపంగా చూస్తోంది...అయిపోయింది, నా పని అయిపోయింది...బాబోయ్..." అని అరిచాడు కృష్ణమూర్తి.

డాక్టర్ అతడి నాడి పరీక్షించి—"ఇది హోప్ లెస్ కేసు అనిపిస్తోంది" అన్నాడు.

"ఏం చేయాలి డాక్టర్?" అన్నాడు చంద్రయ్య.

"కుర్రాడు షాక్ తిన్నాడు. తను మానవాతీతశక్తికి బలి కాబోతున్నానన్న భ్రమలో వున్నాడు. ఆ భ్రమ తొలగించే మార్గం కనబడ్డంలేదు" అన్నాడు డాక్టర్.

"ఏమీ ఆశలు లేవంటారా?" అన్నాడు చంద్రయ్య దిగులుగా.

"లేనట్లే అనిపిస్తోంది..." అన్నాడు డాక్టర్.

ఒక నిర్ణయానికి వచ్చినవాడిలా ఇన్‌స్పెక్టర్‌తో అన్నాడు చంద్రయ్య—"నా కొడుకు నాకు దక్కక

పోతే నా బ్రతుక్కర్థం లేదు. నేను అమ్మవారి పేరు చెప్పి నాటకమాడితే ఆ దేవి నా వేలితో నా కన్నే పొడిచింది. ఇంతవరకూ మా ఊళ్లో జరిగిన నాలుగు హత్యలూ నేనే చేశాను.''

కృష్ణమూర్తితోపాటు హాస్పిటల్‌కు వచ్చిన ఇన్‌స్పెక్టర్ చంద్రయ్య మాటలు విని ఆశ్చర్యపడ్డాడు... ''ఏమిటీ, ఈ హత్యలు నువ్వు చేశావా?'' అన్నాడు.

''అవునండీ_ఎవరికీ నామీద అనుమానం రాకుండా వుండడం కోసం పూజారి రంగయ్య అన్న బెదిరింపు మాటల్ని పట్టుకుని, ఇంతవరకూ నలుగురు కుర్రాళ్ళను చంపాను. మొట్టమొదట మునసబుగారబ్బాయి మాణిక్యాలరావుకు అమ్మవారి వేషంలో కనిపించి బెదిరించాను. వీలు చూసుకుని ఒక్కొక్కరినే చంపాను...''

''ఎందుకు?''

''నా కొడుక్కు క్లాసులో పోటీగా ఉంటున్నారు వీళ్ళు. వీళ్లనలుగురూ లేకపోతే మావాడెప్పుడూ క్లాసులో ఫస్టు వచ్చేవాడు.''

''అందుకోసం ఇంత దుర్మార్గం చేస్తావా? ఇది మనుషులు చెయ్యాల్సిన పనేనా? అందులోనూ నువ్వు మునసబుగారి నమ్మినబంటువని విన్నాను. ఆయన కొడుక్కే...''

''అదే బాబూ! నా కొంప ముంచింది. మాణిక్యాలరావు మునసబుగారికి పుట్టిన కొడుకు కాదు. ఆ విషయం ఆయనకు చాలా ఆలస్యంగా తెలిసింది. మునెయ్య నేవాడి వల్ల తన భార్యకు మాణిక్యాలరావు కలిగాడని మునసబుగారికి తెలిసింది. ఆ విషయం తెలిశాక పరిశీలిస్తే మాణిక్యాలరావులో మునెయ్య పోలికలూ, లక్షణాలూ చాలా కనబడ్డాయాయనకు.

వెంటనే మాణిక్యాలరావునీ, మునెయ్య కొడుకు రమణరావునీ చంపేయమని మునసబుగారు నన్నాదేశించారు. ఆ విధంగా తన భార్యనీ, మునెయ్యనీ కూడా మానసికంగా హింసించాలని ఆయన అనుకున్నాడు.

నేనీ పనికి వెంటనే ఒప్పుకున్నాను. మా అబ్బాయికి పోటీగా వున్న నలుగుర్లోనూ ఈ ఇద్దరూ వున్నారు. ఈ నేరాన్ని అమ్మవారిమీద పెట్టి ఇంకో ఇద్దరు కుర్రాళ్ళని కూడా చంపేస్తానని మునసబుగారికి చెప్పాను.

మాణిక్యాలరావు నాయన చంపమని చెప్పకపోతే మిగతా హత్యల జోలికి నేను వెళ్ళి వుండేవాడ్ని కాదు. ఏమయితేనేం—దురదృష్టం నన్ను వరించి నా కొడుక్కే అమ్మవారికి భయపడుతున్నాడు. ఎవరికోసం ఇదంతా చేశానో వాడే దక్కకపోతే ఎలా? ఈ హత్యలు చేసింది నేనేననీ అమ్మవారు కాదనీ వాడు తెలుసుకుంటే...'' చంద్రయ్య ఆగాడు. అప్పుడే కృష్ణమూర్తి కళ్ళు తెరిచాడు.

చంద్రయ్య కొడుకు దగ్గరకు పరుగున వెళ్ళి—''ఈ హత్యలన్నీ చేసింది నేనురా! క్లాసులో నువ్వే ఫస్టుగా రావాలని ఒక్కొక్కళ్ళనే నీకు పోటీగా వున్న వాళ్ళందర్నీ చంపేశాను. ఏ అమ్మవారూ ఈ హత్యలు చేయలేదు. నీకు ప్రాణభయం లేదు. మనూళ్లో యింక హత్యలు జరగవు'' అన్నాడు ధైర్యం చెపుతూ.

ఈ మాటలు విని కృష్ణమూర్తి ఏదోలా నవ్వాడు. స్వార్థానికి అతీతమైన ప్రేమలోని పచ్చి స్వార్థాన్ని చూశాననో, ఇప్పుడు హంతకుడి కొడుకుగా క్లాసులోకి ఎలా వెళ్ళగలననో, తన ప్రాణాలెలాగూ దక్కనప్పుడు

ఇతరుల ప్రాణాలతో తనకు నిమిత్తమేమిటనో-ఆనవ్వుకు అర్థం ఎవ్వరికీ సరిగ్గా తెలియదు.

"డాక్టర్, నా కొడుకు బ్రతుకుతాడా?" అన్నాడు చంద్రయ్య.

డాక్టరు మాట్లాడలేదు.

ఇన్స్పెక్టర్ చంద్రయ్య చేతులకు బేడీలు వేశాడు. ఆ దృశ్యాన్ని కృష్ణమూర్తి చూడలేదు. తన స్నేహితుల ప్రాణాలు తీసిన తండ్రి ముఖం చూడలేకనో, అటువంటి మనుషులున్న ఈ లోకంలో వుండడం ఇష్టం లేకనో అతను కన్నులు మూసుకునే వున్నాడు.

ఎందరో కన్నతల్లుల ఉసురు చంద్రయ్యను వదిలి పెడుతుందా?

—: ఐపోయింది :—

# ఇద్దరు దొంగలు!

అజీజ్

"మే ఐ కమిన్ సర్?"

"ఎస్, ప్లీజ్!"

స్ప్రింగ్ డోర్స్ కిర్రుమంటూ తెరుచుకున్నాయి.

లోన కడుగు పెట్టిన యువకుడ్ని చూసి "హలో! రండి, పనిమీద వచ్చారా?" అన్నాను కుర్చీ చూపుతూ.

చెప్పకనే చెబుతోంది అతని వాలకం ఏదో తీవ్రమైన మనఃక్లేశాన్ని అనుభవిస్తున్నాడని.

అతని పేరు సూర్యనాథ్. క్రికెట్ ఆటలో సిద్ధహస్తుడు. పాలి కేళ్ళుంటాయి. ఇప్పుడిప్పుడే ఆ క్రీడలో అతనికి గుర్తింపు లభిస్తోంది.

తెల్లగా, పొడుగ్గా, నొక్కుల జుట్టుతో టినోపాల్ బ్రాండు తెల్లదుస్తుల్లో పోతబోసిన క్రికెట్ ఆటగాడిలా ఉంటాడు. అతని అన్న పాంచజన్యతో నాకు పరిచయం వుంది. అతను నగరంలో పేరుమోసిన మనీ లెండింగ్ ఫైనాన్సర్.

ఆ అన్నా తమ్ముళ్ళమధ్య అట్టే పొసగదు. పాంచజన్య తమ్ముడ్ని మెడిసిన్ చదివించి గొప్ప డాక్టర్ని చెయ్యాలని కలలు గనేవాడు. ఐతే, సూర్యనాథ్ క్రికెట్ పిచ్చిలోపడి మెడిసిన్ మూడో సంవత్సరం తప్పి, ఆ ఆటలోనే ఖ్యాతి గడించాలని నిశ్చయించుకున్నాడు.

పాంచజన్య భార్య చనిపోయి నాలుగేళ్ళవుతోంది. ఇప్పుడతనికి నిండా నలభై ఏళ్ళు కూడా వుండవు. భార్య చనిపోయి యిన్నేళ్ళవుతున్నా అతను రెండో పెళ్ళి తలపెట్టకపోవడానికి కారణం, అతనికి స్త్రీ వ్యసనంవుందనీ, ఆ వ్యసనానికి పెళ్ళి ప్రతిబంధకమవుతుందన్న కారణంతో రెండో పెళ్ళి గురించి ఆలోచించలేదనీ పుకార్లున్నాయి. ఆ పుకార్లెంతవరకూ నిజమో నాకు తెలీదు.

"చెప్పండి మిస్టర్ సూర్యనాథ్! ఏమిటి విశేషం? అన్నయ్య ఎలా వున్నారు? పని వత్తిడివల్ల ఈ మధ్య ఆయన్ని చూడటం పడలేదు!" అన్నాను విషయం కదుపుతూ.

సూర్యనాథ్ నావైపు ఆశ్చర్యంగా చూసి, "రాజారెడ్డిగారూ! మీకింకా ఈ సంగతి తెలీదా? ఈ రోజు న్యూస్ పేపర్ చూళ్ళేదా మీరు?" అడిగాడు.

పెదవి విరిచి, "చెప్పానుగా, పని వత్తిడివల్ల పేపర్ తిరగేసేపాటి వ్యవధి కూడా దొరకడం లేదు. పైగా మూడు రోజుల్నించీ మద్రాసులో లేను. ఇన్వెస్టిగేషన్ పనిమీద తిరుచ్చి వెళ్ళి, ఇప్పుడే గంట క్రితం తిరిగొచ్చాను. ఇంతలోనే మీరొచ్చారు. ఇంతకీ ఏం జరిగింది?" అడిగేను కుతూహలంగా.

సూర్యనాథ్ నిట్టూర్చి, చేతిలో వున్న న్యూస్ పేపర్ని నా ముందుకు తోశాడు.

"ప్రత్యేకంగా నేను చెప్పవలసిన అవసరం లేదు. ఫ్రంట్ పేజ్ చూడండి, తెలుస్తుంది!" అన్నాడు.

పేపరందుకుని చూసేను.

హెడ్ లైన్‌లో కనిపించినవార్త నన్ను చకితుణ్ని చేసింది.

"ఐదు లక్షలతో మాయమైన ఫైనాన్సర్!"

మద్రాసు, సెప్టెంబర్ 2: నగరంలో పేరు పొందిన ఫైనాన్సర్ శ్రీ పాంచజన్యగారు నిన్న మధ్యాహ్నం బ్యాంక్ నుండి ఐదు లక్షల నగదు డ్రా చేసుకుని, నల్ల రంగు బ్రీఫ్ కేస్‌లో పెట్టుకుని వెళ్లారట. ఆ తర్వాత ఆయన జాడ తెలియలేదు.

రాత్రి రెండు గంటలయినా పాంచజన్యగారు తిరిగి రాకపోయేసరికి ఆయన తమ్ముడు శ్రీసూర్యనాథ్ కేదో అనుమానం వేసి, ముందు జాగ్రత్త కోసం పోలీసులకు తెలియజేశారు.

పోలీసులు తక్షణం రంగంలోకి దిగి, పాంచజన్యగారి కోసం నగరమంతా గాలించేరు. ఐనా, ఆయన ఆచూకీ తెలియలేదు. పాంచజన్యగారీ విధంగా పెద్ద మొత్తాల్లో డబ్బు తీసికెళ్ళడం ఇదే మొదటిసారి కాదు. ఇదివరకు అనేకసార్లు తీసికెళ్ళారు.

ఆయన తరచూ పెద్ద పెద్ద కంపెనీలకి ష్యూరిటీ మీద డబ్బు అప్పిస్తూ వుంటారు. ఐతే గతంలో ఆయన వెంట ఎవ్వరో ఒకరు తోడుగా వెళ్ళడం జరిగేది.

ఈసారి ఆయన ఎవ్వర్నీ తోడు తీసుకెళ్ళకుండా, ఒంటరిగా వెళ్ళడం, వెళ్లిన మనిషి ఐపు లేకుండా పోవడంలో ఏదో మర్మం ఇమిడి వుంటుందని స్థానిక పోలీసు

లనుమానిస్తున్నారు. కేసు ఇంకా క్రైంబ్రాంచి కప్పగించడం జరగలేదు.

వార్త సాంతం చదివి—"పోలీసుల అంచనా సరైనదే. తప్పకుండా ఇందులో ఏదో మిస్టరీ వుంది!" అన్నాను పేపర్ బల్లమీద వేస్తూ.

"ఔను! గత పదిహేనేళ్ళుగా అన్నయ్య ఈ వ్యాపారం జేస్తున్నాడు. ఇంతవరకూ ఇటువంటి సంఘటన జరగలేదు. ఈనాడు ఏకంగా ఐదు లక్షలతో అదృశ్యమవ్వడం అత్యంత ఆశ్చర్యకరం!"

"మీరాయన్ని చివరిసారిగా ఎప్పుడు చూశారు?"

"మొన్న మధ్యాహ్నం లంచ్ తీసుకునే సమయంలో. ఇద్దరం కలిసే భోంచేశాం! తరువాత ఆయన కోటుకూడా తొడుక్కోకుండా కుర్చీమీద అలాగే వదిలేసి బ్యాంకు కెళ్ళిపోయారు. అంతే మళ్ళీ తిరిగి రాలేదు!"

"మిస్టర్ సూర్యనాథ్! క్షమించండి యిలా అడుగుతున్నందుకు. మీ అన్నయ్యలోవున్న ఒక బలహీనత గురించి బహుశా మీకు తెలిసే వుంటుందనుకుంటాను."

"ఏ బలహీనత?"

"స్త్రీ!"

సూర్యనాథ్ పలుకలేదు. కాసేపు ఆలోచించి, "తెలుసు!" అన్నాడు.

"స్త్రీ కోసం మగధీరులెందరో చెయ్యకూడని పనులెన్నో చేసినట్టు చరిత్ర పుటలు సాక్ష్యాధారాలు."

"అంటే, మీ ఉద్దేశం."

"ఒక్కోసారి ఎంతటి వాడయినా, స్త్రీ వ్యామోహంలో పడి ఎటువంటి మూల్యాన్నయినా వదులుకోడానికి సిద్ధపడతాడు. మీ అన్నయ్య తనకు తానే

ఎవరో అమ్మాయికా డబ్బు సమర్పించుకుని, గుట్టు చప్పుడు కాకుండా ఆమెతో ఎక్కడో గడుపుతూవుండ వచ్చుగా?''

సూర్యనాథ్ నవ్వి, ''ఎంతటి అందగత్తె అయితే మాత్రం ఏకంగా పదులక్షలు సమర్పించుకుంటారా ఎవ్వరయినా? హాస్యాస్పదంగా వుంటుంది.'' అన్నాడు.

''ఆల్ రైట్! ఈమధ్య ఆయనకోసం యెవరయినా అమ్మాయిగానీ, స్త్రీగానీ, మీ ఇంటికి రావడం జరిగిందా?''

''ఇంటికయితే యెవ్వరూ రారు! కానీ, ఈ మధ్య ఆయనవెంట ఒక యువతి తరచూ కనిపిస్తూన్నట్టు తెలిసింది.''

''ఎవరామె?''

''తెలీదు!''

''మీరామెను ఎప్పుడూ చూశ్ళేదా?''

''నో!''

''వాళ్ళిద్దరికి స్నేహం ఏర్పడి ఎన్నాళ్ళయుంటుంది?''

''దాదాపు రెండు నెలలు.''

అదే సమయంలో నా అసిస్టెంటు సార్జంట్ దేవిడ్ లోనికివచ్చి, ''ఎస్.పి.గారు మిమ్మల్ని పిలుస్తున్నారు సార్'' అన్నాడు.

''మిస్టర్ సూర్యనాథ్! ఇక మీరువెళ్ళి నిశ్చింతగా వుండండి. బహుశా ఎస్. పి. గారు ఈకేసు నా కప్పగించడానికే పిలిపించారనుకుంటాను. నా శక్తివంచన లేకుండా కృషిచేసి, మీ అన్నయ్య ఆచూకీ తెలుసుకో డానికి ప్రయత్నిస్తాను.

మరో విషయం. ఆయన బుద్ధిపూర్వకంగా ఆ డబ్బు తీసుకుని మాయమైవుంటే మాత్రం—ఆయామ్ సారీ, నేనేం చెయ్యలేను'' అన్నాను లేస్తూ.

సూర్యనాథ్ తలూపి, సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు. టేబిల్ మీది క్యాప్ అందుకుని పెట్టుకుంటూ, ఎస్. పి. ఆఫీసులోకి నడిచాను.

నేనూహించింది కరెక్టే.

ఆ కేసు క్రయింబ్రాంచి కప్పగించ బడింది. వెంటనే నన్ను రంగంలోకిదిగి పరిశోధన ప్రారంభించవలసిందిగా పురమాయించాడు ఎస్. పి.

గత మూడురోజులనుంచి నాకు రెస్టు లేదు. పైగా, నానా అవస్థలూపడి ఇప్పుడే తిరుచ్చినుంచి తిరిగొచ్చేను.

ఈ రాత్రి బాగా విశ్రాంతి తీసుకొని, రేపే కేసు లోతు పాతుల చూపి తియ్యాలి. మోటర్ బైక్ యెక్కి యింటికి బయలుదేరాను.

## 2

ఇంటి గేరేజ్ లో బైక్ ఆపి, తాళం తెరచి, లోన అడుగుపెట్టేను.

ముసక చీకటి.

అప్పటికే సాయంత్రం ఆరుంబావవుతోంది. లైటు వెలిగించి, పడగ్గదిలోకెళ్ళి బట్టలు మార్చుకున్నాను.

అలసటవల్ల ఆకలి కావటంలేదు.

ఆపిల్ జ్యూస్ తాగి పడుకుందామని, బెడ్ రూంలో వున్న ఫ్రిజ్ వైపు నడిచాను. పిడితిప్పి, తలుపు తెరిచాను. అంతే!

వెయ్యి ఓల్టులు కరెంటుషాక్ తగిలినట్టు ఝల్లుమంది. ఒళ్ళు.

ఫ్రిజ్ లోపల శవం!

అందమైన యువతి శవం!!

మోకాళ్ళు మడిచి, నడుంవంచి ఒద్దికగా కూర్చోబెట్టి వుంది_

ఎవ్వరామె? ఎలావచ్చింది? ఎక్కణ్నించి వచ్చింది? ఎవ్వరు చంపారు? చంపినవాళ్ళు శవాన్ని యెక్కడో పారేయకుండా, తాళం వేసున్న నా యింట్లో కెందుకు చేర్చారు?

షాక్ లోంచి తేరుకొని, పరీక్షగా చూశానామెని.

ఎక్కడో చూసినట్టేవుంది మొహం.

ఎక్కడ చూశాను?

రెండు నిమిషాలు జ్ఞాపకశక్తితో యుద్ధంచేసి, విజయం సాధించాను.

ఆమె పేరు సుకన్య.

మాజీ నేరస్తురాలు.

నా పరిశోధనలో పట్టుబడి, కోర్టులో అప్రూవర్ గా విడుదలయింది.

ఆమెను గుర్తుపట్టగానే, గతంలోకి కదిలాయి జ్ఞాపకాలు.

ఆరేళ్ళక్రితం మౌంట్ రోడ్డులోవున్న ఓ మార్వాడీ జ్యూవెలరీ షాప్ లో లక్షన్నర విలువచేసే వజ్రాలు దొంగిలించబడ్డాయి. నేరస్థులకోసం స్థానిక పోలీసులు చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యేసరికి ఆకేసు నాకు, అంటే క్రయింబ్రాంచి కప్పగించబడింది.

అష్టకష్టాలూపడి ఎంతో ప్రయాసతో, చివరికి ఆ దొంగతనానికి కారకులెవరో కనుక్కోగలిగాను. ముగ్గురుకలిసి

చేసిన ప్లాన్డ్ రాబరీ అది. ఆ ప్లాన్‌కు మూలపురుషుడు జగన్.

మరో ఇద్దరు వాడికి సహాయపడ్డారు. ఆ యిద్దరిలో ఈ సుకన్య ఒకర్తి. రెండోవ్యక్తి పేరు నారాయణ. ఐతే, షాప్ తాళాలు పగలగొట్టి దొంగతనం చేసింది మాత్రం జగన్.

నారాయణ కేవలం బయటవుండి, ప్రమాదం ముంచుకొస్తే ఎదుర్కోడానికి నియమించబడ్డాడు. సుకన్య వజ్రాలను కేసు ముగిసేదాకా జాగ్రత్తగా దాచడానికి తోడ్పడింది.

ఆ దొంగతనం చేసేటప్పుడు యెంతో పకడ్బందీగా జాగ్రత్తలు పాటించాడు జగన్. అందుకే వాళ్ళు పట్టుబడ్డా, సాక్ష్యాలు లేకుండా వాళ్ళమీద కోర్టులో కేసు ఎలా నడిపించాలో అంతుబట్టలేదు నాకు.

అప్పుడు తట్టింది ఒక ఐడియా. నారాయణనీ, సుకన్యనీ నయానా భయానా మచ్చిక చేసుకొని, కోర్టులో వాళ్ళు అప్రూవర్స్‌గా మారితే శిక్ష పడకుండా తప్పించుకోవచ్చనీ, లేకుంటే జగన్‌తోబాటు అనేక సంవత్సరాలు జైల్లో మగ్గవలసివుంటుందని నూరిపోశాను.

నా పాచిక పారింది. జగన్‌కు విరుద్ధంగా యిద్దరూ ప్రాసిక్యూషన్ సాక్షులుగా మారారు.

దాంతో జగన్ మీద నేరం రుజువయి ఆరేళ్ళ శిక్ష పడింది. శిక్ష విన్నాక బోనుదిగుతూ వాడు సుకన్యా, నారాయణలవైపు చూసిన చూపు నాకిప్పటికీ జ్ఞాపకం వుంది.

ఈహత్య చేసింది వాడేనా? తనతో నేరం చేసి, పట్టుబడ్డాక పోలీసుల పక్షం చేరి తనను జైలుపాలు చేసి, సుఖ

భంగా తప్పించుకొన్నారన్న కక్షకొద్దీ ఈ కిరాతకానికి ఒడిగట్టాడా?

ఇదే నిజమైతే అటు నారాయణ ప్రాణాలుకూడా ప్రమాదంలో వున్నాయన్నమాట.

వెంటనే ఓ విషయం జ్ఞాపకం వచ్చింది. చటుక్కున గోడమీది కేలండరువేపు చూసేను.

ఇది సెప్టెంబరు నెల. జగన్‌కు శిక్ష పడింది 1972లో. ఆ లెక్కన వాడు విడుదల కావటానికింకా నాలుగు నెలలు మిగిలున్నాయి. కొంపదీసి జైల్లోంచి పారిపోలేదుకదా? అనుకొంటూ గబగబ ఫోన్ దగ్గరవెళ్ళి, సెంట్రల్ జైలుకు రింగ్ చేశాను.

"జైలర్ నంబియార్ స్పీకింగ్" అవతలనించి వినిపించింది.

"అయామ్ ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డి ఫ్రం క్రయిం బ్రాంచ్. మీనుండి ఓ ఇన్ఫర్మేషన్ కావాలి. ఆరేళ్ల క్రితం, అంటే1972లో జగన్ అనే వ్యక్తికి శిక్షపడింది. ఆరేళ్లు! అతనింకా మీ ప్రిజినర్‌గా వున్నాడా, లేక జైల్లోంచి పారిపోయాడా తెలుసుకోవాలి."

"నో, ఈమధ్య మాజైల్లోంచి ఎవ్వరూ పారిపోలేదు. ఇంతకీ అతనుచేసిన నేరం ఏమిటి?"

"రాబరీ, వజ్రాలదొంగతనం."

"వెయిట్ ప్లీజ్, ఇప్పుడే కనుక్కుంటాను" అవతల నిశ్శబ్దం.

పదినిమిషాలనంతరం నంబియార్ కంఠం విన్పించింది. "ఇన్‌స్పెక్టర్, మీరు చెప్పిన ఖైదీ ప్రస్తుతం మా జైల్లో లేడు."

"పారిపోయాడా?"

"నో. గుడ్ కాండక్టు బేస్ కింద వాడి శిక్ష తగ్గించ బడిందిఆరు నెలలు. సగౌరవంగా విడుదల చెయ్యబడ్డాడు."

"ఎప్పుడు?"

"రెండు నెలల క్రితం."

"థాంక్స్," అంటూ రిసీవర్ క్రెడిల్ చేసి ఆలో చనలో పడిపోయాను.

జగన్ వ నిజంగావీళ్ళమీద పగతీర్చుకోవాల నే వుంటే విడుదలయిన రెండు నెలల వరకూ యేంచేశాడు? వాళ్ళ ఆచూకీ తెలుసుకోడానికి రెండుమాసాలు పట్టిందా? సుకన్యా నారాయణలవంటి వాళ్లను గురించి తెలుసుకో డానికి ఇంత జాప్యం జరగదే.

మరి ఈ రెండు నెలలూ వాడేంచేశాడు? ఎక్కడ వున్నాడు? తన ప్రత్యర్థినిచంపి, నా ఇంట్లో దేనికి పడే శాడు? ఈమూడు ప్రశ్నలే నన్ను తికమక పెడుతూ వున్నాయి.

ఆలోచిస్తూ ఫోన్ దగ్గరకి లాక్కుని క్రయిం బ్రాంచికి రింగ్ చేశాను.

"ఎస్, సార్జంట్ స్పీకింగ్" వినిపించింది అవతలనించి.

"నేను రాజారెడ్డిని. హెడ్ క్వార్టర్స్నుండి వెంటనే అంబులెన్సునీ, ఫోటోగ్రాఫర్స్ని వెంటబెట్టుకు నా ఇంటికి రా."

"వాట్ హేపెండ్ సర్?"

"వచ్చాక ఇక్కడే అంతా తెలుస్తుంది." అంటూ రిసీవర్ దించి, సిగరెట్ అంటించేను.

పదినిమిషాల్లో అంబులెన్స్వచ్చి ఆగింది ఇంటిముందు. సార్జంట్ దేవిడ్, ఫోటోగ్రాఫర్స్, పోలీస్ డాక్టరు బిలబిల వచ్చారు లోనికి.

ఫ్రీజ్ లో నిశ్చింతగా కూర్చున్న శవాన్ని చూసి నిర్ఘాంతపోయారు.

ముందు ఫోటోస్నాప్స్ తీసుకోబడ్డాయి. తరవాత అందరం కలసి శవాన్ని జాగ్రత్తగా ఫ్రీజ్ లోంచి బయటకి తీశాం.

కాళ్ళూ, చేతులూ బాగా బిర్రబిగుసుకు పోయాయి. ఓ పట్టాన సాగడంలేదు. అతికష్టంమీద సాగదీసి కింద పడుకోబెట్టాం.

అప్పుడు పడింది నాదృష్టి ఆమె ఛాతీమీద.

బ్లౌజుకు గుండుసూదితో గుచ్చబడుంది ఓ మడతబెట్టిన కాగితం.

చటుక్కున దాన్నందుకుని మడత విప్పేను.

అది ఉత్తరం! నా పేర రాయబడ్డ ఉత్తరం!!

చదవసాగేను.

"ఇన్ స్పెక్టర్!

బహుశా నీవు నన్ను మరచిపోయుంటావు. నీ నేరస్థులకి కోర్టులో శిక్ష పడేవరకే నీకు వాళ్ళ గురించి జ్ఞాపకం వుండేది. తరువాత వారి రూపు రేఖలు నీ మనసులోంచి పూర్తిగా చెదిరిపోతాయి.

నన్ను నీవు మర్చిపోయినా, నేను నిన్ను మర్చిపోలేదు. ఎందుకో తెలుసా? నాతో కలిసి నేరం జేసిన నా ఇద్దరు సహచరుల్ని నీ మాయమాటలతో మచ్చిక జేసుకుని, నాకు విరుద్ధంగా కోర్టులో సాక్ష్యం ఇప్పించావ్. ఫలంగా వాళ్ళని అప్రూవర్స్ గా విడుదల జేయించావ్!

ఆ ఇద్దరు నీచులు నాకు తీరని నమ్మకద్రోహం జేశారు. పాలు తాగిన రొమ్ముమీదే సమ్మెట దెబ్బలు తీశారు.

అటువంటి నీచుల్ని వరికి ముక్కలు చేసినా పాపం అంటదు.

వాళ్ళెగనక కోర్టులో నోరు మెదపకుండా వుండి వుంటే నా నేరం బుజువయ్యేది కాదు. శిక్ష పడేది కాదు. జైల్లో వున్నంత కాలం, రాత్రింబవళ్ళూ వాళ్ళ గురించే ఆలోచిస్తూ గడిపేను. శిక్ష తగ్గి త్వరగా విడుదలవాలనే, జైల్లో క్రమశిక్షణతో మెలిగాను.

ఈ రోజు నా ఆశయం నెరవేరుతుంది. సుకన్య శవాన్ని నీ ఇంట్లో ఎందుకు జేర్చానో, బాగా ఆలోచిస్తే నీకే అర్థమవుతుంది. ఆ అర్థమైన విషయం ఆచరణలోకి వచ్చేవరకూ ఎదురు చూస్తూండు.

సెలవ్."

కింద సంతకం లేదు.

ఐనా, అది రాసిందెవ్వరో స్పష్టంగా తెలుస్తూనే వుంది. శవాన్ని పోస్టుమార్టంకు పంపి, సార్జంట్ దేవిడ్‌తో జీప్ ఎక్కి హుటాహుటిన హెడ్ క్వార్టర్స్‌కు చేరుకున్నాను.

నేరస్తుల పాత ఫైలు వెలికి తీసి, అందులో వున్న జగన్ ఫోటోస్టాట్ తీయించి, వెంటనే దాని ప్రింట్లు తయారుజేసి, నగరంలోని అన్ని పోలీస్ స్టేషన్స్‌కూ పంపమని పురమాయించాను సార్జంట్‌కు.

అంతేకాదు, విమానాశ్రయానికీ, రైల్వేస్టేషన్స్‌కూ, చెక్ పోస్టులకూ మెసేజ్ పంపి, జగన్ పోలికలు గల వ్యక్తి ఎవ్వరయినా సరే, కస్టడీలోకి తీసుకోవలసిందిగా ఆదేశాలు జారీ చేయించాను.

ఆ తరవాత జగన్ చేసిన వజ్రాల దోపిడీ తాలూకు ఫైలు పరిశీలించాను తున్నంగా. ఆ దోపిడీలో జగన్‌కు

సహాయపడ్డ రెండో వ్యక్తి నారాయణ ఇప్పుడెక్కడుంటున్నాడో కనుక్కోవడం అత్యావసరం!

అతని ఆచూకీ తెలుసుకుని, రక్షణ కల్పించడం నా తక్షణ కర్తవ్యం! లేకుంటే, సుకన్యకు పట్టిన గతే అతనికీ పట్టవచ్చు.

దెబ్బ తిన్న బెబ్బులికీ, పగబట్టిన మనిషికీ అట్టే తేడా వుండదు. ఆ రోజుల్లో నారాయణ ఎక్కడ నివసించేవాడో ఆ ఇంటి చిరునామా దొరికింది ఫైల్లో.

3-1-146, బ్లాక్ నంబర్ 7, పెరంబూర్.

ఆ అడ్రస్ నోట్ చేసుకుని లేచాను.

సార్జంట్ డేవిడ్ జగన్ ఫోటో ప్రింట్లు తీయించడానికి లేబొరేటరీ కెళ్ళాడు. ఒక్కణ్ణి జీప్ ఎక్కి పెరంబూర్ బయలుదేరాను.

# 3

ఆ ఇంటికొక్క ఇవతల జీప్ ఆపి దిగాను. వీధిలో అట్టే జనసంచారం లేదు. మునిసిపాలిటీ లైట్లు కునికిపాట్లు పడుతున్నట్లు వెలుగుతున్నాయి.

రిస్టువాచీ చూసుకున్నాను. పదిన్నర.

అది మధ్యతరగతి మనుషులు నివసించే వీధి. ఇంటి నంబర్స్ చెక్ చేసుకుంటూ ఐదు నిముషాల తరవాత ఆ ఇంటి ముందు ఆగాను.

తలుపు మూసుంది.

నారాయణ ఇప్పుడూ ఆ ఇంట్లోనే ఉంటున్నాడో, లేక ఇల్లు మారేడో తెలీదు. చుట్టూ కలయ జూసేను. ఎదురింట్లో సన్నగా రేడియో సంగీతం వినిపిస్తోంది. వాళ్ళింకా నిదరబోనట్టున్నారు. వాళ్ళనడిగితే, ఈ ఇంట్లో ఎవరు నివసిస్తున్నారో తెలిసిపోతుంది.

అటు నడిచాను. లోపలినించి మాటలు వినిపిస్తు న్నాయి. మెట్లెక్కి తలుపు తట్టాను. రెండు నిముషాల తరవాత తెరుచుకుంది.

"ఎవరండీ?" అడిగాడు ఇంటతను.

ఎదురిల్లు చూపించి, "ఆరేళ్ళ క్రితం ఆ ఇంట్లో నారా యణ అనే వ్యక్తి నివసించేవాడు..."

"ఇప్పుడూ అందులోనే వుంటున్నాడు..." నా మాట పూర్తికాక ముందే జవాబిచ్చాడతను.

"ఏం జేస్తుంటాడు?"

"సిమెంట్ పైపులు తయారుజేసే ఫ్యాక్టరీలో పని జేస్తున్నాడు."

"నైట్ షిఫ్టు కూడా వుంటుందా ఫ్యాక్టరీలో?"

"ఉండదు! పగలే."

"థాంక్స్!" అంటూ వెనుదిరిగి నారాయణ ఇంటి వైపు నడిచాను.

వెనక తలుపు మూసుకున్న చప్పుడు.

ఆ ఇంటి మెట్లెక్కి తలుపు తట్టాను మెల్లిగా.

జవాబు లేదు!

"నారాయణా!" పిల్చాను.

నిశ్శబ్దం!

పడుకున్నాడా? అనుకుంటూ పిడికిలి బిగించి గట్టిగా బాదాను.

అంతే!

కిర్రుమంటూ తెరుచుకుంది.

ఆశ్చర్యపోతూ పూర్తిగా తెరిచేను!

లోపల మసక చీకటి!

"నారాయణా!" పిల్చాను గట్టిగా.

జవాబు శూన్యం.

లోన కడుగు పెట్టాను. ఇంట్లో ఎవ్వరూ వున్నట్లు అలికిడి లేదు. ఆ గది కిరువైపులా రెండు గదులున్నాయి. ముందు కుడివైపు గదిలోకెళ్ళి చూశాను.

ఓ గోడవారగా మంచం, మంచంపైన పరుపు, రెండు దిళ్లు. అంతే! మనిషి ఛాయలేదు. బైటకి వచ్చి, దాని కెదురుగా వున్న రెండో గదిలో కెళ్ళాను.

స్టవ్, గిన్నెలూ, ప్లేట్లూ, రేషన్ డబ్బాలూ కనిపించేయి. బహుశా, వంట గదయ్యుంటుంది. దాంట్లోంచే, దొడ్లోకెళ్ళడానిక్కాబోలు మరో తలుపుంది. దగ్గరగా జేరవేసుంది. జేబులోంచి పాకెట్ టార్చితీసి వెలిగించేను. తలుపు తోసి దొడ్డివరండాలో అడుగు పెట్టాను.

చిన్నసైజు ఓపెన్ ప్లేస్. చుట్టూ ఎత్తయిన గోడ. దొడ్లోంచి బయటికెళ్లడానికి మరో తలుపుంది. మనిషి మాత్రుడు లేడక్కడ. ఇంటికి తాళం కూడా వెయ్యకుండా ఎక్కడికి వెళ్లాడు నారాయణ?

ఆలోచిస్తూ ఆ తలుపు వైపు నడిచి నివ్వెరబోయేను. దానికి లోపలివైపు గడియ వేసిలేదు. తలుపు దగ్గరగా జేరవేసుంది.

నేను తనింటికి వస్తున్నట్టు గమనించి నారాయణ దొడ్డి తలుపుగుండా వెళ్లిపోయాడా? ఎందుకు? తీవ్రంగా ఆలోచిస్తూ ఆ తలుపు బోల్టు బిగించి వెనుదిరిగాను.

చకచక ఆ యింట్లోంచి బయటపడి, సింహద్వారం మూసి ఇవతల గొళ్లెం పెట్టి మెట్లు దిగాను. నారాయణ దొడ్డి తలుపుగుండా ఎందుకు వెళ్లిపోయాడో ఎంతకీ అంతుబట్టడం లేదు. హెడ్క్వార్టర్స్‌కెళ్ళి ఇద్దరు

మఫ్టీ కానిస్టేబుల్స్‌ని పంపాలి, ఈ ఇంటిమీద ఓ కన్నేసి వుంచడానికి.

గబగబ అడుగులు వేస్తూ జీప్‌ని సమీపించి, చటుక్కున ఆగిపోయాను. డ్రైవింగ్ సీట్లో ఎవరో కూర్చున్నట్టు వీపు కనిపిస్తోంది మసక చీకట్లో. ఎవ్వరు?

చెయ్యి అప్రయత్నంగా పాంటు జేబులోకి వెళ్ళింది. వేలితో సేఫ్టీ కాచ్ వెనక్కి లాగుతూ పిస్తోలు బైటికి తీశాను. ఎడంచేతిలో టార్చిలైటు రెడీగా పట్టుకుని, రెండడుగులు ముందుకువేసి, చటుక్కున ఫోకస్ చేశాను డ్రైవింగ్ సీటుమీద.

ఆశ్చర్యంతో నా కళ్లు పెద్దవయ్యాయి. స్టీరింగ్ మీద ముందుకొరిగి కూర్చున్నాడతను. చేతులు రెండూ ఆకుకూర కాడల్లా వేళాడుతున్నాయి.

అతను ఎవరో కాదు.

నారాయణ!

నిర్జీవమైన నారాయణ!

వీపులో పిడివరకూ దిగివుంది కత్తి. వీపంతా ఎర్రని చిక్కని రక్తం. అతని పళ్లమధ్య మడతపెట్టిన ఓ కాగిత మిరికించి వుంది. చటుక్కున దాన్ని ఇవతలికి లాగిమడత విప్పేను.

త్వరత్వరగా, గజిబిజిగా రాసివున్నాయి అక్షరాలు.

"ఇన్‌స్పెక్టర్,

కాకతాళీయం అంటే ఇదేకాబోలు. నేను నారాయణ ఇంట్లో ప్రవేశించి, కత్తితో వాణ్ని కైలాసం పంపడం, అదే క్షణంలో నీవు తలుపు తట్టడం ఒకేసారి జరిగాయి. వెంటనే వాడి శవాన్ని భుజాన వేసుకొని

దొడ్డితలుపుగుండా బయట పడ్డాను. ఈసారి నన్ను పట్టు కోవటం నీతరం కాదు. గుర్తుంచుకో.''

పళ్లు పటపట కొరుకుతూ ఉత్తరాన్ని జేబులోకి తోశాను.

నారాయణ శవాన్ని సీట్లో ఒరగబెట్టి, స్టీరింగ్ ముందు కూర్చున్నాను. జీప్ స్టార్ట్ చేసి శరవేగంతో పోనిచ్చాను హెడ్ క్వార్టర్స్ వేపు.

## 4

జగన్ కోసం నగర పోలీసులంతా తీవ్రంగా ప్రయత్ని స్తున్నారు.

ఇప్పుడు వాడి విషయంకన్న, ఐదు లక్షలతో మాయ మైన పాంచజన్య వ్యవహారం తేల్చడం ముఖ్యం.

ఉదయం లేవగానే కాలకృత్యాలు తీర్చుకొని, ఇంటి నించి తిన్నగా పాంచజన్య ఇల్లుచేరుకుని అతని తమ్ముడు సూర్యనాథ్ ను కలుసుకున్నాను.

''మీ అన్నయ్య అదృశ్యమైన రోజు చివరిసారి మీరు ఆయన్ని చూసినప్పుడు, అంటే ఆరోజు మధ్యాహ్నం మీరిద్దరూ డైనింగ్ హాల్లో భోజనంచేశాక, ఆయన తిరిగి కోటు తొడుక్కోకుండా కుర్చీమీద అలాగే వదిలేసి వెళ్లారన్నారు కదూ? ఒకసారి ఆ కోటు చూపిస్తారా?'' అడిగాను.

సూర్యనాథ్ తలూపి, తనవెంట రమ్మన్నట్టు సైగ చేశాడు. ఇద్దరం మెట్లగుండా మేడమీదికెళ్లి పాంచజన్య గదిలో ప్రవేశించాం.

''ఆయన వెళ్లిపోయేక, నౌఖరు కాబోలు ఆ కోటు తీసికొచ్చి ఇక్కడ స్టాండుమీద పడేసుంటాడు''అంటూ

మూలవున్న స్టాండుమీది బట్టలు చూడసాగాడు సూర్య నాథ్.

రెండు నిమిషాలు ఆ పాత బట్టలు పరిశీలించి, "ఇదిగో ఈ బ్రౌన్ కలర్ కోటే, అప్పుడాయన విడిచింది" అంటూ స్టాండుమీంచి ఓ బ్రౌన్ కలర్ ట్వీడ్ కోటు తీసి నాకందించాడు.

గబగబ కోటు జేబులో వెదికేను. దాంతో ఆ రోజు పాంచజన్య ఎంత తొందరలో వున్నాడో అర్థమయింది. కారణం, కోటుజేబులో అవసరమయిన వస్తువులన్నీ అలాగేవున్నాయి.

దువ్వెనా, చేతిరుమాలూ, జలుబు నివారణకువాడే విక్స్ వేపొరబ్ బిళ్లలూ, చిన్న పాకెట్ డైరీ.

డైరీ అందుకుని నింపాదిగా పేజీలు తిరగెయ్యసాగేను. జనవరినించీ ఆగస్టువరకూ చెప్పుకోతగ్గ విశేషాలు లేవు. ఆగస్టు నెల రెండో తేదీన రాసుకున్న విషయాలు నన్నాకర్షించాయి. ఆ తేదీన యిలా రాసుకున్నాడు.

'ఆమె పరిచయమైన క్షణం నిజంగా మరువలేనిది. కళ్ళు చెదరగొట్టే అందం! అటువంటి అపురూప సౌందర్యవతి పరిచయమైన ఈ రోజు నా జీవితంలో చిరస్మరణీయం!

ఇంటికి వచ్చి యింతసేపైనా, ఆమె స్మృతులు నన్ను విడిచిపెట్టడం లేదు. కళ్ళు మూసినా తెరచినా ఆ రత్నాలరాసే కళ్ళల్లో మెదులుతోంది. ఆమెను పొందని జన్మ వ్యర్థమే అనిపిస్తోంది.

ఆగస్టు-3. ఊదయం వూహించనివిధంగా ఆమె ఫోన్ చేసింది సాయంత్రం సిద్ధార్థ హోటల్లో కలుసుకోమని.

ఆనందం పట్టలేకపోయాను. రెండోసారి ఆమెనెలా కలుసుకోవాలా అని మథనపడుతున్న నాకు ఈ విధంగా పరిష్కారం లభించింది.

ఆమె యిచ్చిన కైంపు హోటల్ చేరాను. తొలి పరిచయంతోనే నేను తనని చాలా ప్రభావితుడ్ని చేశానట! ఆ కామెంట్ నాలో రవంత గర్వాన్ని కలిగించక పోలేదు.

ఆ తరవాత వరసగా నెల రోజులు. అంటే ఆగస్టు చివరివరకూ ఆ అమ్మాయిని వివిధ ప్రదేశాల్లో కలుసుకున్న వైనాలు రాసుకున్నాడు పాంచజన్య.

ఐతే ఆ కలయికల్లో ఎక్కడా ఆమెని తను అనుభవించినట్టుగానీ, తమ పరిచయం స్నేహపుటద్దులు దాటినట్టుగానీ ఉదహరించలేదు. దీన్నిబట్టి ఆమె అందని ఆపిల్ పండులా అతనికి అంటీ అంటకుండా ఉవ్విళ్ళూరిస్తూ ఇన్నాళ్లూ గడిపిందని స్పష్టమాతోంది.

ఆ తరవాత, అంటే పాంచజన్య మాయమవడానికి మూడు రోజుల ముందు అతను రాసుకున్న విషయాలు నా ఆసక్తికి హేతువయ్యాయి.

సాయంత్రం ఆరుగంటలకు మెరీనాబీచ్‌లో జె.ఆర్.ను కలుసుకోవాలి. "మిస్టర్ సూర్యనాథ్! ఈ జె. ఆర్. ఎవరు? మీ అన్నయ్య స్నేహితుల్లో ఈ అక్షరాలతో ప్రారంభమయ్యే పేర్లు గలవాళ్లెవరయినా వున్నారా?"

సూర్యనాథ్ కాసేపు ఆలోచించి, "నాకు తెలిసినంత వరకూ లేరు!" అన్నాడు.

"ఇక్కడ గమనించవలసిన మరో విషయం ఏమిటంటే, ఇంతవరకూ ఆయన డైరీలో ఆ అమ్మాయి పేరు రాయలేదు. ఆమె గురించి ప్రస్తావించినప్పుడల్లా 'ఆమె'

అని మాత్రం సంబోధించేవాడు. ఈ జె. ఆర్. ఆమె పార్ట్‌ఫాం కాదుగదా?"

"చెప్పలేను. మగవాడి పేరు కూడా కావచ్చు!"

సాలోచనగా తలూపుతూ తరవాతి పేజీ తిరగేశాను.

'ఉదయం పన్నెండు గంటలకు హోటల్ సిద్ధార్థలో జానకిరామ్‌ను కలుసుకోవాలి.'

ఆ తరవాతి పేజీలో ఇలా రాసుంది-'మధ్యాహ్నం మూడు గంటలకు నంబర్ 146, ఎమ్. జి. రోడ్‌లో జె. ఆర్. ను కలుసుకోవాలి. ఈ రోజు తప్పకుండా ముట్టజెపుతానని వాళ్ళకు మాటిచ్చాను."

అది అతను డబ్బుతో అదృశ్యమైన రోజు.

ఆ తరవాత డైరీ ఖాళీ!

ఆ రోజు మధ్యాహ్నం ఒంటిగంటకు పాంచజన్య ఇంటికి వచ్చి, తమ్ముడితో భోంచేసి వెళ్ళాడు. మళ్ళీ తిరిగి రాలేదు.

సూర్యనాథ్ వైపు తిరిగి మీ అన్నయ్య అడపాదడపా జానకిరామ్ అనే వ్యక్తిని హోటల్ సిద్ధార్థలో కలుసుకునేవాడు. అదృశ్యమైన రోజున ఆయన మీతో లంచ్ తీసుకున్నాక, 146-ఎమ్. జి. రోడ్‌లో జె. ఆర్. అనే వ్యక్తిని కలుసుకోడాని కెళ్ళాడు.

కొంపదీసి ఆ జె. ఆర్. జానకిరామే కాదుకదా? సిద్ధార్థ హోటల్‌కు ఫోన్ చేసి ఆ జానకిరామ్ అక్కడున్నాడో లేడో కనుక్కోవాలి" అంటూ ఫోన్ వైపు నడిచి, హోటల్ సిద్ధార్థకు రింగ్ జేశాను.

"ఎస్!" అంది అవతలి ఆపరేటర్.

"కౌంటర్ ప్లీజ్!" అన్నాను.

ఆమె కౌంటర్‌కు లైన్ కలపగానే, "మీ హోటల్లో

జానకిరామ్ అనే వ్యక్తి నివసిస్తున్నారని తెలిసింది. ఆయన రూం నంబర్ చెప్పండి'' అన్నాను.

అవతల రెండు నిముషాలు నిశ్శబ్దం! ''ఎస్! నివసించే వారు! కాని, గది ఖాళీచేసి వెళ్ళిపోయారు.''

''ఎప్పుడు?''

''రెండు రోజుల క్రితం!''

''వెళ్ళేటప్పుడు ఏదయినా అడ్రసు వదిలి వెళ్లారా?''

''లేదు.''

ఫోన్ పెట్టేసి డైరీ మళ్ళీ తెరిచేను.

''మిస్టర్ సూర్యనాధ్! ఎమ్. జి. రోడ్ అంటే, బహుశా మహాత్మా గాంధీ రోడ్ అయుంటుందను కుంటాను. అక్కడికెళ్ళి వాకబుజేస్తే ఏమైనా తెలుస్తుం దేమో! వస్తాను'' అంటూ తన దగ్గర సెలవు తీసుకుని బీవ్ ఎక్కాను.

# 5

అరగంటలో మహాత్మాగాంధీరోడ్ చేరుకున్నాను.

ఆ రోడ్‌లో ఉన్న అరంతస్థుల బిల్డింగ్ నంబరే 146. ఆ బిల్డింగ్‌లో అనేక ఆఫీసులూ, కుటుంబాలూ అద్దె కుంటున్నాయి.

బిల్డింగ్ కింద మెట్ల దగ్గర, గోడకు వరుసగా ఆయా ఆఫీసుల లెటర్ బాక్స్‌లు బిగించి వున్నాయి.

అన్నిటికన్నా కింది వరసలోవున్న ఓ కొత్తబాక్స్ నన్నాకర్షించింది.

దానిమీద తెల్లని పెయింట్‌తో రాసివున్నాయి అక్ష రాలు,

జె. ఆర్. ప్రొడక్షన్స్,

థర్డ్ ఫ్లోర్,
ఫ్లాట్ నెంబర్-5.

గబగబ మెట్లెక్కి మూడో అంతస్థు చేరుకున్నాను. ఫ్లాట్ నెంబర్ 5 తలుపుమూసుంది. గుమ్మం పక్కన 'జె. ఆర్. ప్రొడక్షన్స్' అనే ప్లేట్ వేలాడుతోంది, అది డోర్ లాక్ సిస్టమ్ తలుపు.

అడుగులో అడుగు వేసుకుంటూ తలుపుని సమీపించి, ముందు పిడితిప్పి తెరవడానికి ప్రయత్నించాను. లాక్ వేసినట్టుంది. తెరుచుకోలేదు. లేదా లోపల ఎవరయినా ఉండి వుంటారు.

రెండు మూడుసార్లు గట్టిగా తట్టిచూసేను. జవాబు లేదు. చెవి ఆనించి విన్నాను లోపల ఏమైనా చప్పుళ్లు వినిపిస్తాయేమోనని. సూదిపడితే వినిపించే నిశ్శబ్దం.

వివరాలు కనుక్కుందామని దానికెదురు గావున్న ఫ్లాట్ దగ్గరకెళ్ళి తలుపు తట్టాను.

ఓ ముసలావిడ తెరిచింది డోర్.

"క్షమించాలి. మీ కెదురుగావున్న ఆ జె. ఆర్. ప్రొడక్షన్ మేనేజర్ని కలుసుకోవాలి. ఆఫీసు లాక్ చేసినట్టుంది. ఈరోజు తెరవలేదా?" అడిగాను.

"అదెప్పుడూ మూసేవుంటుంది. ఎప్పుడో వొకసారి యెవ్వరో ఒకరువచ్చి కాసేపుండి పోతారు అంతే."

"వాళ్ళనెప్పుడయినా చూశారా మీరు? ఎంతమంది వస్తారు?"

"మనుషుల్ని చూడలేదు.అప్పుడప్పుడూ ఆఫీస్ తెరిచి వుండగా చూశాను."

"చివరిసారి ఎప్పుడు తెరిచారు?"

"మూడురోజుల క్రితం."

ఆమెకు థాంక్స్ చెప్పి, మెట్లు దిగి కిందకి వచ్చాను. ఐదు నిముషాలు అక్కడే వుండి, సిగరెట్ కాల్చి, తిరిగి మెట్లగుండా పైకి చేరుకున్నాను.

నేనూహించినట్టే ఆ ముసలావిడ ఇంటితలుపు మూసి వుంది. ఆమె తలుపు మూసుకునేవరకూ వెయిట్ చెయ్యాలనే నేను కిందికెళ్ళింది.

అడుగులో అడుగు వేసుకుంటూ జె. ఆర్. ప్రొడక్షన్ ఆఫీసు దగ్గరికెళ్ళాను. జేబులోంచి మారుతాళం చెవులగుత్తి తీసి, ఐదునిముషాల ప్రయాసతో తెరవగలిగాను లాక్.

ఒకసారి చుట్టూ కలయజూసి, తలుపు తోసేను. కిర్రుమంటూ తెరుచుకుంది.

లోపల మనిషిమాత్రుడు లేడు.

బహుశా ఇది ఆఫీసుగదయి వుంటుంది. ఓగోడవారగా కుర్చీ, దానిముందు బల్ల, దానికి మూడువేపులా కుషన్ చేర్స్ వేసున్నాయి.

బల్లమీద కేవలం కొన్ని పాత న్యూస్ పేపర్స్ పడి వున్నాయి. వాటితీరు చూస్తూంటే, అంతక్రితం బల్ల మీద కొన్ని ఫైళ్ళూ, ఇతర వస్తువులూ వుండివుంటాయని, ఈమధ్యే అవన్నీ ఆదరా బాదరా తీసి వేసుంటారనీ తోస్తోంది.

ఆగది ప్రక్కనే మరోగది వుంది. తలుపుమూసుంది. అటు నడిచేను. పిడితిప్పి మెల్లగా తలుపుతోసేను.అంతే.

దభీమంటూ నా మొహానికి ప్లాస్టిక్ సంచిలాటిదేదో గుద్దుకున్నట్టయింది. మరుక్షణం లిప్తపాటు నీలిరంగుకాంతి వెలిగి మాయమైంది. నా మొహమంతా యేదో గ్యాస్ వ్యాపించినట్టు తోచింది.

అరక్షణం వెలిగిన ఆ కాంతిలోనే, నేనా వ్యక్తిని చూడగలిగాను. పొడుగ్గా, ఆరోగ్యంగా వున్నాడు. నల్ల రంగు సూటు వేసుకున్నాడు. అంతే...

ఆ గ్యాస్ ప్రభావంవల్ల నా మెదడులో మత్తు కమ్ముకోసాగింది. శరీరంలోని జవసత్వాలన్నీ ఉడిగి పోతున్నట్టూ, నీరసం ముంచుకు వచ్చినట్టూ కిందపడిపో సాగాను.

మరుక్షణం ఆ వ్యక్తి గబగబ బయటకు పరిగెత్తడం వరకే నాకు గుర్తుంది. ఆ తరవాత ఏం జరిగిందో నాకు తెలీదు.

## 6

మళ్ళీకళ్ళు తెరిచిచూస్తే ఇంకా ఆ గదిలోనే పడు న్నాను. నిశ్శబ్దం రాజ్యమేలుతుంది లోపల.

ఆవ్యక్తి ఎవ్వరు? నాకతని మొహం ఇప్పటికీ బాగా స్పష్టంగా గుర్తుంది. అతిన్ని చూసింది అరక్షణమే ఐనా ఫోటో ప్రింటులా ఆ మొహం నా మస్తిష్కంలో ముద్ర వేసుకుంది.

ఇంతవరకూ అతన్నెక్కడా చూసినగుర్తు రాలేదు.

జేబులోంచి లైటరుతీసి వెలిగించాను. ఆ వెలుగులో రిస్టువాచీ చూసుకున్నాను. ఆరుగంటలు. నేనీ బిల్డింగులో ప్రవేశించినప్పుడు మధ్యాహ్నం రెండు గంటలవుతోంది. అంటే, నేను మూర్ఛపోయి నాలుగ్గంటలవుతోందా?

లేచి నిల్చుని కింద కలయజూసేను. గుమ్మందగ్గరగజం పొడవు పొలిథిన్ సంచిపడుంది. అందులోనే మూర్ఛ పోగొట్టే ఆ తీవ్రమైన గ్యాస్ నిండివుంటుంది. గదిలో యిప్పటికీ చిత్రమైన వాసన వేస్తోంది లీలగా.

నేను మొదటిసారి తలుపు తట్టినప్పుడే ఆ వ్యక్తి పని

గట్టి వుంటాడు. ఎవ్వరో అనుచితమైన వ్యక్తి వచ్చాడని డోర్ లాక్ చేసి వుండడంవల్ల నేను లోపల యెవ్వరూ లేరని పొరబడ్డాను. అతను లోపలినుంచి లాక్ చేసుకొని ఏదో చేస్తున్నాడు.

నేను రెండోసారి తలుపును సమీపించి మారుతాళం చెవులతో లాక్ తెరుస్తున్నప్పుడు అతనికి స్పష్టమయి పోయింది నేను పోలీసుకు సంబంధించిన వ్యక్తినై వుంటానని.

అందుకే మూర్ఛ పోగొట్టే గ్యాస్‌తో రెడీగా కాచుకున్నాడు. మొదటి గదిలోనే నన్ను మూర్ఛ పోగొడితే బయటివాళ్లెవరయినా చూస్తారని, ఈ గదిలోకి వచ్చి తలుపేసుకుని ఎదురు చూడసాగాను.

నేను తలుపు తెరవగానే గ్యాస్ నిండిన పాలిథిన్ సంచి మొహానకొట్టి పారిపోయాడు. కొంపదీసి అతను జానకి రామ్ కాదుగదా? జె. ఆర్. ప్రొడక్షన్స్ అంటే జానకి రామ్ ప్రొడక్షన్స్ కాదుగదా?

ఆలోచిస్తూ గోడ తడిమి, ఎలక్ట్రిక్ స్విచ్ వత్తాను. గది మధ్య బల్బు వెలిగింది. ఆ కాంతిలో నా కనిపించిన మొదటి వస్తువు ఓ మూలవున్న పెద్దసైజు చెక్క పెట్టె.

ఆ పెట్టెకు తాళం వేసుంది. చుట్టూ పరికించాను. ఆ పెట్టె తప్ప గదిలో యింకేమీ లేవు. అడుగులో అడుగు వేసుకుంటూ దాన్ని సమీపించాను. పెట్టెపైన రాసున్న అక్షరాలమీద నా చూపు నిలిచిపోయింది.

'మిస్టర్ దినేష్ చోప్రా,
బాంబే సెంట్రల్ రైల్వే స్టేషన్.'

అంటే, ఈ పెట్టి రైల్వే లగేజ్ ద్వారా బొంబాయి లోని దినేష్ చోప్రా పేర పంపడానికి సిద్ధంజేసి వుందన్నమాట. బహుశ, దీంట్లో ఈ ఆఫీసు తాలూకు ఫైళ్ళూ, సామానూ ఉండివుంటాయి.

ఆ కాగితాలద్వారా ఈ కంపెనీ వివరాలు తెలుసుకో వచ్చు అనుకుంటూ కీబులోంచి తాళంచెవుల గుత్తి తీశాను. రెండు మూడు తాళంచెవులతో ప్రయత్నించేక, క్లిక్కుమంది తాళం!

దాన్ని ఊడదీసి, పెట్టె మూత పైకెత్తాను. అంతే! కరెంట్ షాక్ తగిలినట్లు నా చెయ్యి వెనక్కి వచ్చేసింది. పట్టు తప్పడంవల్ల పెద్ద చప్పుడుతో మూసుకుంది మూత!

నేననుకున్నట్టు పెట్టెలో ఫైళ్లు లేవు
ఓ వ్యక్తి శవం వుంది!

రెండు నిమిషాల తరవాతగానీ నా గుండె దడ తగ్గలేదు.

వణికే చేత్తో తిరిగి మూత పట్టుకుని పైకి లేపాను.

చెయ్యి ఓల్టుల కరెంట్ తగిలినట్టు ఒళ్లు ఝల్లుమంది.
అతను ఎవరో కాదు!

పాంచజన్య!!

ప్రాణంలేని పాంచజన్య!!!

శవం బాగా బిగుసుకుపోయినట్టుంది. బహుశా, హత్య జరిగి ఎన్నో గంటలు గడిచివుంటాయి. ఇప్పుడా శవాన్ని పెట్టెలో పెట్టి, తాళంవేసి, దినేష్‌చోప్రా అనే బోగస్ పేరుమీద బొంబే పంపే ప్రయత్నం చేస్తున్నారన్న మాట. అంతలో నేను రావడం జరిగింది.

ఇప్పుడర్థమౌతోంది అసలు విషయం!

జె. ఆర్. ప్రొడక్షన్స్ పేరుతో ఈ ఆఫీసు తెరిచిన వాళ్ళు, పాంచజన్య పరిచయం సంపాదించి, తమ సంస్థ గురించి ఎలాగో అతన్ని పూర్తిగా నమ్మించి, బుట్టలో వేసుకుని, తమ సంస్థ కోసం ఐదు లక్షలు అప్పివ్వమనుంటారు.

వాళ్ళ బుట్టలోపడ్డ పాంచజన్య, బ్యాంకునించి, ఐదు లక్షలు డ్రాజేసి తెచ్చుంటాడు. డబ్బు చేతికందగానే, వాళ్ళతన్ని కైలాసం పంపేసి, శవాన్ని పెట్టెలో దాచేశారు.

ఇక్కడే ఓ మడత పేచీ వస్తోంది. అతన్ని చంపిన వాళ్ళు, శవాన్ని ఇక్కడే వదిలి ఎక్కడికైనా పారిపోవచ్చు కదా? అటువంటి అవకాశం వుండీ, కళేబరాన్ని పెట్టిలోపెట్టి ఎక్కడికో పార్సిల్ జేసే ప్రయాస దేనికి?

ఇక్కడే దాగుంది ఏదో మిస్టరీ!

హత్య ఎలా చెయ్యబడిందో తెలుసుకుందామని, శవాన్ని పరీక్షగా చూసేను. కుడి కణతలో కనిపించింది రంధ్రం! ఆ రంధ్రంగుండా కారి ఎండిపోయిన రక్తం!!

పిస్తోలుతో జరిగింది హత్య.

వెంటనే హెడ్ క్వార్టర్స్ కు ఫోన్ జెయ్యాలి. పెట్టె మూసి, గబగబ బైటికి నడిచేను. కిందికెళ్ళి, కొద్దిదూరంలో వున్న రెస్టారెంట్ లోంచి ఫోన్ జేశాను. పది నిమిషాల్లో వచ్చేసింది అంబులెన్స్!

## 7

"ఎస్, ఇన్ స్పెక్టర్ రాజారెడ్డి స్పీకింగ్!"

"హలో ఇన్ స్పెక్టర్! నేను, మణిభూషన్ని. ఉదయం

రెండుసార్లు మీ ఇంటికి ఫోన్ చేశాను. రెస్పాన్స్ లేదు. ఈ రోజు నా బర్త్‌డే పార్టీ వుంది. ఎన్ని పనులున్నా సరే, సాయంత్రం ఏడు గంటలకల్లా మా ఇంటికి వచ్చెయ్యాలి. తరవాత ఎటువంటి కుంటిసాకులు చెప్పినా నేను వినను!"

నగరంలోవున్న నా దగ్గరి ఫ్రెండ్సులో మణిభూషన్ ఒకడు. పెద్ద పారిశ్రామిక వేత్త. నిరాకరించడం సభ్యత కాదు. "మీరింతగా చెబుతున్నప్పుడు రాకుండా వుంటానా?" అన్నాను నవ్వుతూ.

"థాంక్స్!" అవతల క్లిక్ మంది.

ఏటేటా అతనికి తన పుట్టినరోజు ఘనంగా జరుపుకోడం అలవాటు. ఆ రోజు ప్రాణస్నేహితుల నించీ, మామూలు పరిచయస్థులవరకూ ఎందరినో ఆహ్వానిస్తాడు విందుకు.

రంగురంగుల దీపతోరణాలతో, మందీ మార్బలంతో రాత్రి రెండు గంటలవరకూ అట్టహాసంగా వుంటుంది ఇల్లు.

బట్టలు మార్చుకుని, సాయంత్రం సరిగ్గా ఏడు గంటలకు మణిభూషన్ భవనం చేరుకున్నాను.

కాంపౌండంతా రకరకాల వాహనాలతో నిండివుంది. వచ్చేపోయే స్త్రీ పురుషులతో సందడిగా వుంది. గుమ్మం దగ్గర నిల్చుని అందరికీ స్వాగతం పలుకుతున్నాడు మణిభూషన్.

అతని పక్కనే గులాబీరంగు చెక్కిళ్ళతో, బంగారు లతలా మెరిసిపోతున్న ఓ అందమైన యువతి నిల్చు నుంది.

నన్ను చూడగానే మణిభూషన్ ముందుకు వచ్చి, సాదరంగా లోనికి ఆహ్వానించేడు. కేక్ కట్ జెయ్యడం పూర్తయ్యేక, ఆర్కెస్ట్రా మోగడం ప్రారంభమైంది. అతిథులకు విస్కీ సప్లై శేస్తున్నారు. ఆడా, మగా భేదం లేకుండా అందరూ పుచ్చుకుంటున్నారు.

అప్పుడు పరిచయం చేశాడు మణిభూషన్ నాకా అమ్మాయిని."మీట్ హిమ్, మై ఫ్రెండ్ విశాలి! ఈయన మిస్టర్ రాజారెడ్డి"

ఆమె చిరునవ్వులో నాకు షేక్‌హేండ్ ఇచ్చింది.

అంతలో ఆర్కెస్ట్రా స్థాయి తగ్గి, బాల్ డాన్సులయ ప్రారంభమైంది. అందరూ జంటజంటలుగా, నెమ్మదిగా అడుగులు వేస్తూ డాన్సు ప్రారంభించేరు.

"నేను డిన్నర్ అరేంజ్‌మెంట్సు చూసొస్తాను. అంతవరకూ మీరు డాన్సు చేస్తూండండి!" అని అక్కణ్ణించి వెళ్ళిపోయేడు మణిభూషన్.

ఆమె చేతులందుకుని ఆర్కెస్ట్రా కనుగుణంగా అడుగులు వెయ్యసాగేను.

"మీరు పానీయం ఏదీ తీసుకోరా?" అడిగేను మాటలు కలుపుతూ.

"తీసుకున్నాను, గ్రేప్ జ్యూస్!"

"విస్కీ అలవాటు లేదా?"

ఆమె నవ్వి, తల అడ్డం తిప్పింది.

"పార్టీకి మీ రొక్కరే వచ్చారా?"

"నా వెంట మరొకతనున్నాడు!"

"నాతో మీరు డాన్స్ చెయ్యడం మీ స్నేహితుడి కభ్యంతరం వుండదు కదా?"

"అతను నా స్నేహితుడు కాదులెండి!"

"ఇదివరకు మిమ్మల్నెక్కడా చూసినట్టు జ్ఞాపకం లేదు. మణిభూషన్ స్నేహితులందరితో నాకు పరిచయం వుంది. మీ రిద్దరూ ఈ మధ్యే స్నేహితులై వుంటారను కుంటాను."

విశాలి నవ్వి తలూపింది!

"మీ స్వస్థలం ఇదేనా?"

విశాలి ఇబ్బందిగా ముహం పెట్టి, "నాకు రెండు రకాల మగవాళ్ళంటే ఇష్టం వుండదు. ఒకరు, నా వ్యక్తిగత వివరాలు తెలుసుకోగోరేవారూ, రెండో రకం నన్ను బలవంతంగా ప్రేమించాలనుకునే వారూ!"

"ఆ రెండు రకాల్లో నేను ఏ రకానికీ చెందకపోడం మీ అదృష్టం! ఏదో ఒకటి మాట్లాడాలన్న ఉద్దేశ్యంతో అలా అడిగేను కానీ, అందులో నాకట్టే ఇంట్రస్టు లేదు!"

అంతటితో మా టాపిక్ మరోవైపు మళ్ళింది.

అంతలో ఓ బట్లర్ వచ్చి, "సర్! మిమ్మల్ని బాబుగారు పిల్చుకురమ్మన్నారు!" అన్నాడు.

"ఎక్కడున్నారాయన?"

"మేడమీద!"

"సారీ! ఇప్పుడే వస్తాను." అని విశాలి దగ్గర సెలవు తీసుకుని, నౌకరు వెంట మేడమీది కెళ్ళాను.

"ప్లీజ్ కమిన్ మిస్టర్ రెడ్డీ! నా ఫ్రెండ్సందర్నీ మీకు పరిచయం చేశాను గానీ, ఓ ముఖ్యమైన స్నేహితుణ్ణి పరిచయం చెయ్యడం మర్చాను. రండి!" అంటూ ఆహ్వానించేడు మణిభూషన్.

గదిలో అతనితోబాటు ఫుల్ సూటులోవున్న మరో వ్యక్తి కూర్చునున్నాడు.

"మీట్ హిమ్, మై డియరెస్ట్ ఫ్రెండ్ శ్రీకాంత్! ఈ మధ్యే మా ఆటోమొబైల్ కంపెనీలో షేర్ హోల్డర్ గా జేరారు...హి ఈజ్ రాజారెడ్డి" అంటూ మమ్మల్ని పరిచయం చేశాడు మణిభూషన్.

ఆ వ్యక్తిలేచి, "గ్లాడ్ టు మీట్ యూ ఇన్ స్పెక్టర్!" అంటూ షేక్ హాండ్ అందించేడు.

అతని చెయ్యి నా చేతిలోకి రాగానే ఒక్కలాగు లాగేను కిందికి. ఆ ఊపు కతని బాలెన్స్ తప్పి తూలేడు. అంతే! పిడికిలి బిగించి ఫిడేల్ మని ఇచ్చేను దవడకింద!

గజం ఎత్తు ఎగిరి అమాంతం నేలకూలేడు. బూటు మడమతో ఈడ్చి తన్నేను చెవిమీద. అతని తల పక్కకి వాలిపోయింది. మరో పది నిమిషాలగ్గానీ మళ్ళీ స్పృహ రాదు. ఇదంతా జరగడానికి ఒకేఒక్క నిమిషం పట్టింది!

# 8

"ఏమిటి ఇన్ స్పెక్టర్? ఏమిటిదంతా?" అన్నాడు మణిభూషన్ ఖంగారుగా!

"మిస్టర్ భూషన్! ఏదైతే నేను చెయ్యాలో అదే

జేశాను. ఇతని పేరు శ్రీకాంత్ కాదు! జె. ఆర్! పాంచజన్యను హత్య జేసిన హంతకుడు!!!"

"క్షమించండి! నేను హంతకుణ్ణి కాను!" అన్న కంఠం విని ఇద్దరం ఉలిక్కిపడి పక్కకి చూశాం.

అతనికి స్పృహ వచ్చేసింది! కన్ను మూసి తెరిచే లోగా జేబులోంచి పిస్తోలు తీసి అతని వైపు గురిపెట్టాను.

"మిస్టర్ జె. ఆర్! బుద్ధిగా లేచి నిల్చో! ఏ మాత్రం పిచ్చి వేషాలు వేసినా, ఈ పిస్తోలు పొగలు కక్కుతుంది జాగ్రత్త!" అన్నాను కఠినంగా.

"పిచ్చి వేషాలు వేసే అవసరం నాకులేదు ఇన్స్పెక్టర్! ఎందుకంటే నేను జె. ఆర్.ని కాను! పాంచజన్యను చంపింది నేను కాదు!" అంటూ లేచి నిల్చున్నాడతను.

"బుకాయించక! నిన్న మధ్యాహ్నం మహాత్మాగాంధీ రోడ్లోని జె. ఆర్. ప్రొడక్షన్స్ ఆఫీసులో నన్ను మూర్ఛపోగొట్టి పారిపోయింది నువ్వు కాదూ?"

"నేనే!"

"అక్కడ ఓ పెట్టెలో పాంచజన్య శవం దాచిపెట్టలేదూ?"

"నిజమే!"

"నీ పేరు జానకిరామ్ కాదూ?"

"నిజమే! ఐనా, నేను పాంచజన్యను చంపలేదు!"

"ఐతే ఎవరు చంపేరు?"

"జె. ఆర్!"

"ఆ జె. ఆర్. నువ్వే కదా?"

"ఇక్కడే మీరు పొరబడ్డారు ఇన్స్పెక్టర్! జె.ఆర్. అంటే జానకిరామ్ అనుకుంటున్నారు మీరు. జె. ఆర్.

మగాడు కాదు. ఆడది! జె. ఆర్. ఫుల్ ఫాంమ్ జ్యోతి రాణి!!"

"నీ కల్లిబొల్లి కబుర్లు నమ్మడానికి నన్ను పసివాణ్ణను కుంటున్నావా?"

"నా మాట నమ్మండి! ఆ జ్యోతిరాణి ఇప్పుడు ఇక్కడే వుంది!"

"ఎక్కడ?"

"కింద, పార్టీలో!"

"పార్టీలోనా? ఎవ్వరు?"

"విశాలి!"

"విశాలి హత్య చేసిందా?" అన్నాడు మణిభూషన్ నివ్వెరబోయి.

"మిస్టర్ భూషన్! వెంటనే మీరు కిందికెళ్ళి ఆ విశాలికి అనుమానం రానివ్వకుండా పైకి తీసుకురండి!" అన్నాను.

మణిభూషన్ తలూపి, కిందికెళ్ళాడు.

పిస్తోలుతో జానకిరాంమ్‌ను కవర్ చేస్తూ అక్కడే నిల్చున్నాను.

ఐదు నిమిషాల తరవాత విశాలి, ఉరఫ్ జ్యోతిరాణితో పైకి వచ్చాడు మణిభూషన్. గదిలో అడుగుపెట్టగానే లోపలి దృశ్యం చూసి పారిపోవడానికి చటుక్కున వెను దిరిగింది.

"మిస్టర్ మణీ! ఆమెను పట్టి తొయ్యండి లోపలికి!" అరిచేను. మణిభూషన్ ఆమె ప్రయత్నాలు వమ్ముచేసి, ఒక్క తోపు తోశాడు గదిలోకి.

వాళ్ళిద్దర్నీ పిస్తోలు రేంజ్‌లోకి తీసుకుని—"ఇప్పుడు చెప్పండి! పాంచజన్యను ఎవరు చంపారో?" అన్నాను కటువుగా.

"నా మాట నమ్మండి ఇన్‌స్పెక్టర్! ఆ పథకం తయారుచేసింది ఈమే! నేను కేవలం ఈమె చేతిలో కీలుబొమ్మను...డబ్బు చేజిక్కగానే, అతన్ని బంధించి, ఎక్కడికైనా పారిపోదామని నేను సలహా ఇచ్చినా, ఈమె వినలేదు.

తనకిప్పుడప్పుడే మద్రాసు వదలాలని లేదనీ, మమ్మల్ని గుర్తుపట్టకుండా పాంచజన్యను చంపి, పెట్టెలో బాంబే పార్సెల్ జేసి, తరవాత మణిభూషన్‌ను వల్లో వేసుకుని, అతని కంపెనీలో షేర్ హోల్డర్స్‌గా జేరి, పాంచజన్యకు పట్టించిన గతే అతనికీ పట్టించాలని పథకం వేసింది..." గడగడ చెప్పుకుపోతున్నాడు జానకిరామ్.

పళ్ళు పటపట కొరుకుతూ, నిప్పులు కక్కుతూ అతని వైపు చూసింది జ్యోతిరాణి.

"నీచుడా! నాకే ద్రోహం తలపెడతావా? నీ బండారం బద్దలు కొట్టకుండా నే నూరుకుంటానా? ఇన్‌స్పెక్టర్! వీడు జానకిరామ్ కాడు! జగన్!! జైలునుంచి విడుదలై రెండు హత్యలు చేసిన జగన్!!

ప్లాస్టిక్ సర్జరీతో మొహం మార్చుకుని, జానకిరామ్‌లా వ్యవహరిస్తున్నాడు. నేను ఒక్క హత్యజేస్తే, వీడు రెండు హత్యలు చేసిన హంతకుడు!" అంది నిప్పులు కక్కుతూ.

దిగ్భ్రాంతివల్ల తెరుచుకున్న నా నోరు అలాగే వుండి పోయింది కాసేపు. తరవాత తేరుకుని, పిస్తోలు మణిభూషన్‌కిచ్చి, వాళ్ళిద్దర్నీ కవర్ జేస్తుండమని చెప్పి, జానకిరాం వెనక్కి వెళ్ళాను.

అతని రెండు దవడలకింద చేతులు పోనిచ్చి, మొహాని కున్న మాస్క్‌ను పీకేశాను. జ్యోతిరాణి చెప్పింది నిజమే! వాడు జగన్!!

"హెడ్ క్వార్టర్స్‌కు తీసికెళ్ళి నిన్ను చిత్రహింసలు పెట్టకముందే, ఈ నాటకమంతా ఏమిటో వివరంగా చెప్పు!" అన్నాను జగన్ డొక్కలో కుమ్ముతూ.

రెండు నిమిషాలవరకూ వాడి నోటినుంచి మాటపెగ ల్లేదు. తరవాత తేరుకుని చెప్పసాగేడు.

"నేను జైల్లోంచి విడుదలై బైటికి రాగానే, నన్ను కలుసుకుంది జ్యోతిరాణి. టాక్సీ ఎక్కించుకుని కినారా హోటల్‌కు తీసికెళ్ళింది.

నాలాగే తనూ దొంగతనమే వృత్తిగా జీవిస్తున్నా ననీ, బొంబేనించి ఈ మధ్యే మద్రాసు వచ్చాననీ, తన అందచందాలతోనూ, పథకాలతోనూ ఇక్కడి పెద్దమను షుల్ని వల్లో వేసుకుని డబ్బు చేసుకోవాలనుకుంటున్నాననీ ఆ వ్యవహారంలో తనకు సహాయం కావాలనీ చెప్పింది.

జైల్లోంచి విడుదలై ఏంచేద్దామా అనుకుంటున్న నాకు ఆమె ప్రస్తావన కొండంత బలాన్నిచ్చింది. వెంటనే ఒప్పుకున్నాను. తన ప్లాన్ ఏమిటో పూసగుచ్చినట్లు వివ రించింది నాకు.

దాని ప్రకారం, మహాత్మాగాంధి రోడ్‌లోని ఆ బిల్డింగ్‌లో జె. ఆర్. ప్రొడక్షన్స్ పేరుతో ఓ ఫ్లాట్ అద్దెకు తీసుకున్నాం. స్వయంగా తనే ప్లాస్టిక్ సర్జరీ ద్వారా నా మొహం పూర్తిగా మార్చివేసింది.

అంతకుముందే ఎలాగో పాంచజన్యతో పరిచయం సంపాదించుకుంది. స్త్రీ లోలుడైన అతను ఆమె అందా నికి పూర్తిగా దాసుడైపోయాడు. ఆ తరువాత మారు వేషంలో వున్న నన్ను, ప్రఖ్యాత హిందీ డైరెక్టర్ రాజారామ్‌గా అతనికి పరిచయం చేసింది.

వాతో కలిసి తాను గొప్ప బడ్జెట్ చిత్రం తియ్య బోతున్నాననీ, ఐదు లక్షలు తక్కువయ్యాయనీ, ఫైనాన్స్ చెయ్యమనీ ప్రాధేయపడింది. ఆమె మాయలో పడ్డ అతను ఆ కాకమ్మ కథను పూర్తిగా నమ్మేడు. వడ్డీ లేకుండా అప్పిస్తానని మాటిచ్చేడు.

ఇప్పుడు ప్లాస్టిక్ సర్జరీతో నా మొహం పూర్తిగా మారిపోయింది గనక, ఎన్నాళ్ళనించో నాలో రగులు తున్న నారాయణా, సుకన్యలమీద పాతపగ తీర్చుకోవా లని నిశ్చయించేను. అందుకు జ్యోతిరాణి ఒప్పుకోకున్నా నేను విన్లేదు. వాళ్ళని చంపేశాను...

ఆ రోజు మధ్యాహ్నం మూడు గంటలకు బ్యాంకు నించి డబ్బు తీసుకుని, జె. ఆర్. ప్రొడక్షన్స్ ఆఫీసుకు వచ్చేడు పాంచజన్య. బ్రీఫ్ కేస్ చేతికి రాగానే అతన్ని రెండు రోజులు అక్కడే బంధించి, తర్వాత కాల్చి చంపేసింది జ్యోతిరాణి. ఆ తరవాత మణిభూషన్ కు గాలం వేసింది..." అంటూ తల వంచుకున్నాడు జగన్.

నేను పలకలేదు. హెడ్ క్వార్టర్స్ కు ఫోన్ చెయ్య డానికి ఫోన్ వైపు అడుగులు వేశాను. మణిభూషన్ పిస్తోలుతో వాళ్ళని కవర్ చేస్తూ నిల్చున్నాడు.

—: అ యి పో యి ం ది :—



# క్రైమ్‌లో తమాషాలు

## క్రొత్త నెక్లెస్

"దొంగ! దొంగ! పట్టుకోండి. నా నెక్లెస్ కొట్టేశాడు" అని గట్టిగా అరుస్తోందొక యువతి.

అక్కడే వున్న పోలీస్ ఆమె మాటలు విని దొంగని పట్టుకోవడానికి పరుగెత్తాడు. కానీ అప్పటికే ఆ దొంగ పారిపోయాడు!

ఆయాసపడుతూ ఆ యువతి దగ్గరకి వచ్చి...."సారీ, మేడమ్! ఆ దొంగ పారిపోయాడు. కేసు రాసుకుంటాను. మీ పేరు చెప్పండి!" అన్నాడు.

"విజయ!" అందా యువతి.

"మీ నెక్లెస్‌కి ఎలాటి పొడులు వున్నాయి?"

"అన్నీ తెల్లపొడులే! మధ్యన మాత్రం ఎఱ్ఱపొడి వుంటుంది!"

"డిజైన్ ఎలా వుంటుందో చెప్పగలరా!"

"దసరాబుల్లోడులో వాణిశ్రీ వేసుకొన్న నెక్లెస్ లాంటి డిజైన్!"

"ఎన్ని తులాల బరువు వుంటుంది?"

"అబ్బే! అది రోల్డ్‌గోల్డ్‌ది! నిన్ననే కొన్నాను" అంది.

—యం. ఉమాలక్ష్మి, విజయనగరం.

# ప్రయాణంలో పదనిసలు!

సిటీ బస్సు డిపో సందడిగా వున్నది.

"విజయవాడ" ఎక్స్‌ప్రెస్ బయలుదేరడాన్కి సిద్ధంగా వుంది.

రఘురాం ముందుసీటులో కూర్చుని. బయట నిల్చున్న మనిషితో మాట్లాడుతున్న యువతినే తదేకంగా చూస్తున్నాడు.

క్రింద నిల్చున్న మనిషి "జాగ్రత్త, కుసుమా! రాత్రికి విజయవాడలో వుండి ఉదయం బస్సులో వెళ్ళు" అని ఇంకా ఏదో చెప్తున్నాడు.

బస్సు బయలుదేరి స్పీడందుకుంది.

రఘురాం ముందున్న యువతిని జాగ్రత్తగా పరిశీలించాడు. నలుపు చాయలోనైనా బిగుతైన అవయవాలతో పొంకంగా వుంది. వయసు ఇరువై లోపే. ఒంటరిగా విజయవాడ వెళుతున్నట్లు రాఘురాం గ్రహించాడు.

రఘురాం వృత్తిరీత్యా పేరుబడ్డ ఒక కంపెనీ సేల్సు ఏజంటుగా ఉద్యోగం చేస్తున్నాడు.

ముందుసీటులోని కుసుమ వెనుకకు చూసింది. వెనుక సీటులోని రఘురాం చూపుతో ఒక క్షణం కల్సింది.

రఘురాం వళ్ళు జల్లుమంది.

బస్సు నార్కట్‌పల్లిలో ఆగింది.

ప్రయాణీకులు కాఫీకొరకు దిగుతున్నారు. రఘురాంకూడ సీటునుండి లేచాడు.

ముందుసీటులోని కుసుమ వెనుకకు తిరిగి "మీరు ఏమి అనుకోకుంటే ఒక కాఫీ పంపగలరా" అంది రఘురాంతో.

రఘురాం చిరునవ్వుతో "దానిదేముంది" అని బస్సు దిగి పోయాడు.

సూర్యాపేటలో దాదాపు బస్సు కాళీ అయింది. సీటుకొక ప్రయాణీకుడుకూడ లేరు.

అప్పుడే చిరుచీకట్లు కమ్ముకుంటున్నాయి.

బస్సు వేగంగా పోతోంది.

రఘురాం కుసుమతో కాలక్షేపాన్కి దిగాడు. ఆమె తనగురించి చెప్పింది. తనకు తల్లిలేదు. మారుతల్లి తనని అసలే ఓర్వదు. ఆమే కావాలని తనకు రెండోపెండ్లి ముసలివానితో జరిపింది. ఇప్పుడు తన భర్తవద్దకే వెళ్ళు తున్నానని చెప్పింది.

రఘురాం మనస్సు గాలిలో తేలియాడింది. నా భార్య కూడ రోగిష్టిది. నాకు ఏ సుఖం లేదని రఘురాం ఆమెతో చెప్పుకున్నాడు. ఇప్పుడు ఇర్వురు ఎంతో ఆత్మీయులై పోయారు.

"మిమ్ముల్నిచూస్తే నాకు ఆత్మీయుల్లాగా అనిపిస్తుంది" అన్నాడు రఘురాం. ఆమె చిరునవ్వే సమాధానమిచ్చింది.

దానితో కథ చాలాదూరం వెళ్ళింది.

రఘురాం డబ్బుకు భయపడలేదు.

ఆ రాత్రి విజయవాడలో కాస్టలీ హోటల్‌లో గది తీసి కొన్నాడు. ఎంజాయ్‌మెంటుకు డ్రింకు, బిర్యానీలు. కుసుమతో చాల రాత్రివరకు సరదాగా గడిపాడు. మధ్య రాత్రి తరువాత ఎంతో అల్సిపోయి ఇద్దరూ పెనవేసుకొని బెడ్‌పై వాలిపోయారు.

కిటికీలోనుండి సూర్య కిరణాలు వేడిగా రఘురాంను మేలుకొల్పాయి.

బద్ధకంగా లేచి రూం నలువైపులాపరికించాడు.

రూం తలుపులు దగ్గరగావేసివున్నాయి. ప్రక్కనేవున్న టేబిల్‌పై రెపరెపలాడుతూ ఒక పుత్తరం వెక్కిరించింది.

గాభరాగా తీసి చదవసాగాడు.

"శ్రీ రఘురాం గార్కి,

మీ రనుకున్నట్లు నేను పవిత్రమైన స్త్రీని కాను. నెలకు రెండు, మూడు సార్లు వృత్తిరీత్యా హైద్రాబాదు పోతుం టాను. మీ దయవలన 2000/- రూ॥ల వరకు గిట్టింది. దయచేసి నా సలహా పాటించి మీరు ఒకసారి వెంటనే డాక్టరుసు కల్వండి.

—కుసుమ."

—జి. బాలనర్సిమ్మారావు, నోముల.

## పట్టపగలు దొంగ?

ఓ ఇంట్లో పట్టపగలు దొంగతనం జరిగింది.

దొంగ దొరికిపోయాడు. వాడు బాగా తాగి వున్నాడు.

ఇంటి యజమాని దొంగతో ఇలా అన్నాడు:—

"ఏరా! దొంగ వెధవా! పట్టపగలు దొంగతనం చేస్తావా! ఎంత ధైర్యంరా నీకు—ఆ—?"

దొంగ! — పొరపాటయిపోయిందండి. బాగా త్రాగి వున్నానేమో రాత్రేదో, పగలేదో కూడా తెలియటంలేదు!

—ఐ. బుద్ధి వెంకట్రావ్, పిఠాపురం.

## జన్మజన్మల ఋణం!

పాపారావు దగ్గరకు ఓ అప్పారావు అప్పుకోసం వచ్చాడు.

పాపులారిటీకోసం ప్రాకులాడే పాపారావు, అడిగిందే తడవుగా నోటు రాయించుకోకుండా అప్పారావుకి కావలసి నంత మొత్తం అప్పుగా యిచ్చేశాడు.

అప్పు పుడుతుందో పుట్టదో అన్న అనుమానంతో వచ్చిన అప్పారావు దాన్తో యమ సంతోషపడిపోయి "మీకు ఆజన్మాంతరం ఋణపడివుంటాను" అని కృతజ్ఞతలు చెప్పుకొని వెళ్ళిపోయాడు.

తరువాత యెంతకాలానికి అప్పారావు అప్పు చెల్లించకపోవటం చూచి పాపారావు ఒకసారి అప్పారావుని నిలదీసి "నా అప్పు చెల్లించవా?" అని అడిగాడు.

ఆ మాటకు అప్పారావు వినయంగా "నేను మీ దగ్గర ఋణం పట్టుకెళ్ళేటప్పుడు మీకు ఆజన్మాంతరం ఋణపడి ఉంటానని మాట యిచ్చాను-యిప్పుడు ఆ ఋణం చెల్లించి వేస్తే మాట తప్పినవాడినవుతాను కదా!" అనేసి చక్కాపోయాడు.

పాపం! పాపారావు ఏం మాట్లాడాలో తెలియక తెల్ల మొఖం వేశాడు.

—పి .లక్ష్మి, కొత్తూరు.

—:o:—

